# ఆంధ్రమహిళ



జన్మదిన సంచిక

ANNAS 12



తమ వ్యాపారానికి ముఖ్యమైనది "పెన్సిలు" అని ఆర్టిస్టులందరికీ తెలుసు. రంగులు, బ్రష్‌లు, వగైరా తరువాత వస్తాయి.

వారి బొమ్మలకు "పెన్సిలు" పునాది వేస్తుంది. నిజానికి ఆర్టిస్టుయొక్క, అతని కళయొక్క అదృష్టాన్ని "పెన్సిలు" నిర్ణయిస్తుంది. మంచి ఆర్టిస్టులు, చెడ్డ ఆర్టిస్టులు ఉన్నట్లుగానే, మంచి "పెన్సిళ్లు" చెడ్డ "పెన్సిళ్లు"కూడా ఉన్నాయి. కాని "స్టార్ ఆఫ్ ఇండియా పెన్సిలు" అంటే "స్వచ్ఛమైన పెన్సిలు" అని అర్థం.

# Star of India



MADRAS PENCIL FACTORY. Madras

నాది నాది నాది

MY AMRUTANJAN

There are Millions of "My's" in that MY,

Applied to the 46 year old "Pocket Doctor" of INDIA

# అమృతాంజనము

గాని,

"యథాయథా........ .......కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా! నీ కీర్తిముల్లోకములను దెల్పఁజేయు పూనికతో పెరుఁగు చున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

నాది నాది నాది

టెలిఫోన్ ·
నెం 2918

టెలిగ్రాములు .
"INSEC"

# మైసూరు
# గవర్నమెంటు ఇన్సురెన్సు డిపార్టుమెంటు

పబ్లిక్ బ్రాంచ్



## సంఖ్యలు సమాచారము చూస్తే సంగతులు మీకే తెలుస్తాయి

(క్రొత్త వ్యాపారపు లెక్కలు)

| సంవత్సరము. | జరిగిన భీమాలు. | ఖరారు చేసిన మొత్తాలు |
|---|---|---|
| 1942-43 | 5393 | 60,08,200 |
| 1943-44 | 7377 | 82,39,200 |
| 1944-45 | 11011 | 1,24,20,100 |
| 1945-46 | 11936 | 1,46,81,700 |
| 1946-47 | 12936 | 1,64,85,100 |

చెల్లించిన మొత్తాలు (మరణము, పరిపక్వము ఐనవి)
రూ. 70 లక్షలకంటె హెచ్చే

కడచినసారి యిచ్చిన బోనస్ — సాలీనా వెయ్యికి 18 రూపాయలు

(ఇండియాలోకల్ల ఎక్కువ మొత్తం)

30-6-48 నాటికి తేలే లెక్కలు మంచి ఫలితాలు ఇవ్వనున్నాయి

## భీమాచేసి భవిష్యత్తుకు భద్రపడండి

దయచేసి బెంగుళూరు కార్యదర్శినిగాని దగ్గర ఏజెంటునుగాని దర్యాప్తు చేయండి

## MYSORE GOVERNMENT INSURANCE DEPT.

# మంచి రుచి అయినది - చాలా బాగుండును!




శ్రేష్ఠమైన చాకొలెట్‌వంటి బోర్న్-విటా యొక్క కమ్మదనం, పిన్నలయొక్క, పెద్దలయొక్క ఆదరాన్ని ఒకేమాదిరిగా పొందింది. దీనిలోని కాల్సియం, విటమినులు బలమైన ఎముకలను నిర్మించి, నూతనారోగ్యాన్ని, బలాన్ని అమితంగా చేకూర్చుతవి

## కాడ్‌బరీస్

# బోర్న్ విటా

కాల్‌సియం విటమినులు ఎక్కువగా ఉన్నవి.

కాడ్‌బరీ శ్రేష్ఠతకు ప్రసిద్ధం


మీ ప్రయాణ సౌకర్యానికి సాటిలేనివి
సౌందర్యోపయోగమైన
ఖటావ్
వాయిల్సు

# 15 సంవత్సరములకు పైబడి



# ఐ. టి. ఎల్. తయారీలు,

వైద్యులచే వరుసతప్పక సలహా యివ్వబడుచున్నవి. నమ్మకానికి, శరిష్ఠ గుణాలకు ఖ్యాతిగడించినవి.

1. మాల్ట్ ఎక్స్ట్రాక్ట్-కాడ్ లివర్ ఆయిల్ చేరినది.

| | | |
|---|---|---|
| 2. గ్రైప్ సిరప్ | 5. రెటికులిన్ | 8. గ్లూకోనేట్ డి |
| 3. ఇటియాల్ | 6. సెడటిన్ | 9. విటోమాల్ట్ |
| 4. కెలోరాల్ | 7. విట్రోఫెర్రిన్ | 10. హైషర్ - డి క్వాడ్, లివర్ ఆయిల్ |

తయారుచేయువారు:

ది మైసూర్ ఇండస్ట్రియల్ & టెస్టింగ్ లాబొరేటరీ లిమిటెడ్,
మల్లేశ్వరం, బెంగుళూరు.

విక్రయ ప్రతినిధులు: బెస్ట్ & కంపెనీ, లిమిటెడ్,
పోస్ట్ బాక్స్ నెం. 63, మదరాసు.

BZ 24 T 9

# బార్లీ నీళ్లు మరియు గంజి ఈ విధంగా తయారుచేయడం సులభము.




బార్లీ నీళ్లు సమమట్టంగా రెండు టీస్పూనుల ప్యూరిటీ బార్లీని నీళ్లతో ముద్దచేసి, ఒక పయింటు నీళ్లలో కలిపి, ఐదు నిమిషాలు మాత్రమే తాపీగా ఉడకనివ్వేచాలు. రుచికి ఉప్పో, పంచదారో లేకపోతే నిమ్మరసమో కలపండి.

గంజి: దీనిని మామూలు ప్రకారమే చేయండి, కాని తయారు చేయడానికి 20 నిమిషాలే తీసుకుంటుంది ఒక్క చెంచాడు ప్యూరిటీ బార్లీ ఎనిమిది చెంచాల సాధారణ బార్లీబియ్యంతో సమానమని గమనించండి.

# ప్యూరిటీ బార్లీ

అట్లాంటిస్ (ఈస్ట్) లిమిటెడ్, పోస్ట్

APBX 4 TG

The World Famous

# ASOKA AMLA HAIR OIL

100% Perfumed & Medicated

ASOKA AMLA HAIR OIL

VIJAYA

**M/s. VIJAYA CHEMICALS**

15, CLEMENS ROAD, VEPERY, MADRAS-7

కేవలము శిరోజాలను అభివృద్ధి చెయ్యడములోనే గాక మేధాశక్తిని కలిగించుటలోకూడ అశోక ఆమ్ల హెయిర్ ఆయిల్‌కు మరొకటి సాటిలేదు. మెదడుకు చల్లదనం, నేత్రములకు కాంతి ముఖానికి తేజస్సు కలిగిస్తుంది.

కురుల్లను గట్టిపరిచి, పెంచి, తుమ్మెద రెక్కల నల్లదనాన్ని పట్టును మించిన మృదుత్వాన్ని, హృదయానికి మహోల్లాసాన్ని కలిగిస్తుంది.

నందనవన పారిజాత కుసుమ సుగంధాన్ని మైమరపించే నవ సౌరభాన్నిస్తుంది.

దీనిలో కలిసిన సుగంధ ద్రవ్యాలు వట్టి వేరు, అగరు, చందన, కేతకి, ఆమలక, భృంగ, బ్రాహ్మి మొదలైనవి కనుకనే దీనికంతటి మంజుల పరిమళం—కనుకనే దీనికంతటి ఉల్లాసోజ్జనకమైన శక్తి.

గుణంలో దీనికి మరొకటి సాటిలేదు. పరిమళంలోను దీనితో మరొకటి సరిపోలదు.

ప్రశస్తమైన పరిమళ ద్రవ్యములతో శాస్త్రీయమైన పద్ధతులపై తయారు చెయ్యబడినది కనుకనే మా "అశోక ఆమ్ల హెయిర్ ఆయిల్‌కు" అంత విశిష్టత. ఎన్నో తలనూనెలను మీరు చూచివుండవచ్చు. ఎన్నిటినో వాడివుండవచ్చు కాని దీని సొబగే వేరు—సువాసనే వేరు—దీని గుణమే వేరు.

మీ సౌందర్య పోషణకు నిత్యం వాడవలసినది "అశోక ఆమ్ల హెయిర్ ఆయిల్" అని జ్ఞాపకం ఉంచుకోండి.

# అశోకా ఆమ్ల హెయిర్ ఆయిల్

# సందేశము

* రాష్ట్రపతి డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు *

స్త్రీలు తమ స్థితిని బాగుచేయవలసినదని పురుషులను అడిగే రోజులు గతించాయి. పురుషులు మూర్ఖులు నిరంకుశ ప్రియులని చెప్పడముగాదు. ఏ వర్గమైనా సరే తమ యొక్క అభివృద్ధి చేసుకొనే భాద్యత, విధి, సాధ్యము తమ చేతులలో ఉంచుకోవలసినదే గాని ఇతరులవలన తమకు మేలు కలుగుతుందని భ్రమపడరాదు. మీరు అయిదు సంవత్సరముల క్రిందటనే ఇటువంటి భావములు గ్రహించి స్వతంత్రముగా "ఆంధ్రమహిళ" అను పేరట ఒక మాస పత్రికను స్థాపించుట పొగడతగిన కార్యము. అటువంటి ప్రచారము జరుపుటలోకూడ ఏ కుల, మత, రాజకీయ కక్షులకు తావీయక, ఆర్థిక విధమైన లాభనష్టములను సరకుగొనక, ఏకాగ్రతతో వ్యాప్తిచేయుటయే ఏకైక ఆదర్శముగా ఎంచుకొని, ఈ అయిదు సంవత్సరములనుండి మీరు చేయుచున్న కార్యము లోకమునకు బాగా వెల్లడి అయిన విషయమే. ఇట్టి మాస పత్రిక చిరాయువుగానుండి మాసమాసము ప్రవర్ధమానము చెంది స్త్రీలకు సేవ చేయగలదని నాకు గట్టి నమ్మకము కలదు.

స్త్రీలు పురుషులతో సమానముగా హక్కులుపొందవలసినదని చెప్పే రోజులుకూడా గతించిపోయాయి. సమానత్వము, హెచ్చు తగ్గులు, ఇవి కుటుంబంలోని భార్యాభర్తలకుగాని సంఘములోని స్త్రీ పురుషులకుగాని వర్తించవలసిన విషయములుకావు. హెచ్చు తగ్గులు, మంచి చెడ్డలు, పెద్ద పిన్నలు ముందు వెనుకలు త్రాసులో పెట్టి తూచేవిషయములు కావు. ఇవి మానసికములైన భావములు. మనస్సును ఎవ్విధ్ధముగా శిక్షణకు లోపరిస్తే ఆ విధంగానే భావములు కూడా ప్రజ్వరిల్లుతాయి. కాబట్టి మన దృక్పధమును మార్చుకొని పాత మాటలు వదిలేసి, క్రొత్త యుగములో వారు వీరు అనే భేదాలుగాని, కొలబద్దల యొక్క ప్రమాణముగాని పాటించక స్త్రీ పురుషులందరుకూడా సరిసమానముగా దేశాభ్యుదయమునకు పాటుపడవలసిన కాలమిది. ఇదియే నా సందేశము.

# ఆంధ్రమహిళ

సంపుటి 6 :: మే '49 :: సంచిక 1

ముఖచిత్రం : ఆంధ్ర మహిళ

చిత్రకారిణి శ్రీమతి దిగుమర్తి బుచ్చికృష్ణమ్మగారు



ఇంకా, కథలు, సామెతలు, బాలానందము, వనితా విజ్ఞానము, గ్రంథవిమర్శ, పాకకళ యితర విషయాలు.

సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం యే, బి యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం యే., యల్. టి.

—: ప్రచురణ :—

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు




సంపుటి 6 మే 1949 సంచిక 1

# పంచాబ్దములు

ఆంధ్ర మహిళకు భగవదనుగ్రహమువలన ఐదు సంవత్సరములు జయప్రదముగ గడచినవి. పవిత్ర ఆశయపూరిత సేవా జీవితములో నారవ రంగము ప్రారంభమైనది. జాతీయ కళా, సాహిత్య, విజ్ఞానాలంకృతమై, నాయకుల శుభాకాంక్షలతో, సహృదయుల ఆశీర్వాదములతో, నూతనో ద్వేగముతో, ద్విగుణీకృతమైన సేవాదీక్షతో, యీ జన్మదిన శుభసమయములో, మా మహిళ బహిర్గతమౌతూ ఉన్నది.

గడచిన ఐదు సంవత్సరములలో మా ఆంధ్ర మహిళ బాలారిష్టములనదగు ప్రమాదముల కొన్నింటికో గురియయ్యూ, వానినన్నింటిని, స్థాపకుల యొక్క మనోబలమను దివ్యౌషధముతో ధిక్కరించి పూర్ణారోగ్యముతో నిలచియున్నది. రాజకీయ, వైజ్ఞానిక సాహిత్య రంగములలో వ్యాపించియున్న విప్లవ వాతావరణములో చెలరేగక, కులకక్ష మతకక్ష జనితమైన అతి వాద ఝంఝామారుతములో నెగిరిపోక, నైతిక పతన హేతువైన పాశ్చాత్యానుకరణ పిశాచ పీడనకు లొంగిపోక, నిశ్చల, నిర్భయ, నిరాడంబరములతో, శాంతి సామరస్య సౌభాగ్యములే లక్ష్యములుగ, విద్యా విజ్ఞాన ప్రబోధమే సాధనముగ, కల్మషరహితమైన, స్వచ్ఛంద, స్వార్థరహిత సేవా జీవితములో పురోగమించినది. ఈ పురోగమన దీక్షకు, యీ సేవాకాంక్షకు విజ్ఞానము నొలికించే తమ సద్రచనలచేత, కళాయుతమైన తమ చిత్రముల చేత, విలువను గుర్తించిన ఆదరాభి మానముల చేత దోహదము నిచ్చిన సహృదయుల కివే మా ధన్యవాద సహస్రములు.

అభ్యుదయదాయకమై, సదాశయ పూరితమైన రచనలతో, మా 'ఆంధ్ర మహిళ', చిర కాలము ఆంధ్ర మహిళల సేవ జేయగలదని ఆశించుచున్నాము.





# జన్మదినోత్సవ అభినందనము

శ్రీ కవిసార్వభౌమ డి. రాజశేఖరశతావధానిగారు

శా ॥ పంచాబ్దంబులు నిండె నీకనెడు సద్వార్తన్ వినఁగంటి! హ
ర్షించఁగంటి! భవన్మహోదయ జయ శ్రీ భాగ్యముల్ లోక మ
గ్గించఁగంటి! నితోధికోన్నత మహాకీర్తుల్ విడంబింపఁగా
సంచారంబొనరింపు! మాంధ్రమహిళా సత్పత్రికా పుత్రికా!

చ ॥ పురుషులు వేయిమందికి నపూర్వగుణోన్నతిఁ గూర్చిపొందు, పు
ణ్యరతి, లతాంగి నొక్కతె గుణాన్వితఁజేసిన నొందవచ్చునం
దురు! వనితాసముద్ధరణతోఁదులఁ దూగదు యజ్ఞకోటియం
దురు! సురలున్ సుఖింత్రు రమణుల్ పరిపూజ్యగుణాఢ్య లైనచో!

సీ ॥ అంగనల్ బహుళాయురారోగ్యవతులైన జాతియంతయు బలస్థైర్యమందు?
నతివలు పూర్ణవిద్యావతులైన సంతానము విజ్ఞాన దార్ఢ్యమందు
మహిళలందఱు విక్రమక్రమలైనచో ఖండమంతయు శౌర్యఖండమగును!
నంబుజాక్షులు విశుద్ధాచారవతులైన వర్ణసాంకర్యంబు ప్రభవమంద

## జన్మదినోత్సవ అభినందనము

గీ॥ దివ్యయుజ్జ్వల గుణముల నెల్లనేర్చి
యాంధ్ర మహిళాభివృద్ధి నీవాచరింతు!
వట్టి నీజన్మ భువన మాన్యంబుగాదె
యఖిల గుణగణ గేయయో యాంధ్రమహిళ!

సీ॥ ఏదేశ సతులు మర్యాదార్హలో దేవతల భంగి పూజనంబుల గ్రహింతు?
రాదేశ ధర్మంబు లాచారములు ధ్రువంబై పూజనీయంబులగు నటంద్రు!
కోటి తప్పులు సేయు బోటిని సుకుమార సరస శిరీష పుష్పమునసైన -
హాస్యంబు కొఱకైన నంటరాదనుచుఁ గర్ణులు జేమ్సుతాడ్డు విజ్ఞమణిపలికె!

గీ॥ నామహామహు హృదయ మత్యంతమృదుల!
మట్టి వాడు కోటికి నొక్కఁడలరు నేని,
విపుల సౌభాగ్య సదన మైవిశ్వమెల్ల
బరమ వైకుంఠ సదృశమై వఱలకున్నె!

సీ॥ పువులట్లు మార్దవంబురచించి విదుషులౌ రమణులు పంపు వ్యాసముల తోడ -
స్త్రీజనోన్నతిని గాంక్షించు కొండంత పండితులంపు విషయ సంతతుల తోడ -
పరమోత్తమంబు సంపాదకురాంధ్ర విజ్ఞాన రంజిత మహాశయము తోడ -
నానాటి కానాటి కతి నూతనమ్ములై యలరారు రాజకీయముల తోడ -

గీ॥ విరిసి దెసలెల్ల సౌరభ స్ఫురణ నింపు
పరమ మందార వనమట్లు పరిఢవిల్లె!
దిక భవిష్యత్తు నందు నీకేమి కొదవ!
యాంధ్రలోక కల్పకమ యో యాంధ్రమహిళ!

మ॥ లలనా కోటికి నాంధ్రభూమిని గరాలంకారమై విద్దెలన్
గులధర్మంబుల నుద్ధరించి సతులన్ గ్రొంగ్రొత్త సౌభాగ్యసం
కలితల్ గా నొనరించి యాంధ్రమహిళా కల్పాంత సుస్థాయిరం
జిలవమ్మా! కవిసార్వభౌముని మహాశీర్వాద సంభావనన్!



# ఆశీస్సు

ఆంధ్రమహిళా నీకు ఆశీస్సులమ్మా
ఆంధ్రమహిళా నీవు అందుకోవమ్మా ॥

పువ్వు పుట్టంగానె
పరిమళించిన యట్లు
పూవ వయసునె నీవు
పొలతులను దిద్దేవు

వర్ష పంచకంబు
వయసు నిండక మున్నె
వసుధలో పేరొంది
దిశదిశల వెలిసేవు

మహిళలా జాగృతికి
మహిళలా వున్నతికి
మంచి త్రోవను జూపి
మన్ననల పొందేవు

యింతుల పాలిటి
విజ్ఞాన ఖనివై
యింటింట వెలసినా
యిలవేల్పు వమ్మా

పెద్దలా ఆశీస్సు
పిన్నలా ప్రేమలూ
వడినిండ నింపుకొని
వర్ధిల్లు తల్లీ

(ఆంధ్ర మహిళ ఆంధ్ర మహిళల పాలిటి ఆదర్శమై ఇతోధికంగా వర్ధిల్లుగాక.)

శ్రీమతి చుండూరి రమాదేవి



మల్లమదేవి వసతిగృహమునందలి పారిశ్రామిక విద్యాలయపు విద్యార్థినులు.



ఉగాది రేడియో మహిళా మండలి కార్యక్రమములో పాల్గొనిన ఆంధ్ర మహిళాసభ సభ్యురాండ్రు, విద్యార్థినులు.



రాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయపు విద్యార్థినులు, ఉపాధ్యాయవర్గము.

---

**All blocks by Klein and Peyerl, Mount Road, Madras**

---

పంచరత్నాలు:

# పెండ్లి కానుక

"మధురశ్రీ"

నిరత శృంగార సరసిలో నృత్యమాడు
సతత గిరిపుత్రి ప్రేమలో సంతసించు
అనవరత జనశుభకర ఆశయుండు
శంకరుఁడు బ్రోచు గావుత దంపతులను!

ఎల్ల వేళల లచ్చితో నిచ్చమీర
ప్రేమ సల్లాప వీచుల ప్రీతితోడ
తేలియాడుచు జనులకు హేళిగూర్చు
విష్ణుడొసగుత శుభములు తృష్ణమీర!

మధుర మంజుల మోహాన మానసి అయి
వేదగానములు తనదు వీణియ పయి
మీటి కులికెడు పలుకుల చేటి ధవుఁడు
బ్రహ్మ- విజ్ఞాన మిచ్చుత అహరహమ్ము!

జాతీయ సంస్కృతి సర్వదేశాల్ చాటు
జవహరులాల్ బోలు చేవ సుతుల
దేశీయ సౌభాగ్య దీక్ష బంధురుడైన
ఆంధ్రకేసరి బోలు ఆత్మజులను
ఖండ ఖండాలలో ఖ్యాతి నార్జించిన
విజయలక్ష్మిని బోలు విజయ సుతల
భారత స్త్రీజన ప్రాభవమ్మును దెల్పు
అరుణను బోలెడు ఆత్మ సుతల
శ్రీలు విలసిల్లు భారత శ్రీ జననికి
వన్నె వాసియు దెచ్చెడి మిన్నవారి
ముద్దు బిడ్డల గనుమమ్మ ముద్దుగుమ్మ
నవనవోదయ దాంపత్య జీవితమున.

హాయిని గూర్చుగాక భగవానుడు! మీరు సదాసుఖంబులన్
తీయని నూత్నయౌవన సతేజపరీమళ జీవితమ్ము - ఆ
ప్యాయము గాగ బొందుడు 'సెభాస'ని మెచ్చిగృహస్థులెల్లరున్
పాయని మీదు ప్రేమగని హాయిగ బొందగ భోగ భాగ్యముల్.

# వేదకాలమునాటి స్త్రీలు

శ్రీమతి కె. మంగళాంబ ఎం. ఏ. ఎల్. ఎల్. బి.



ఇటీవల ఎక్కడ చూచినా మన ధర్మశాస్త్రాలను గురించిన చర్చయే. స్త్రీకి విడాకుల హక్కు ఇవ్వవచ్చునా, ఆస్తిలో సమభాగముండవలెనా వద్దా అను వాదోప వాదములతో మనచెవులు గింగురుమనుచున్నవి. ఈ సందర్భములో అనాదినుండి వచ్చు మన ఆచారాలు సంఘాన్ని ఎంతవరకు బలపరచినవో, ఎంతవరకు కూల ద్రోసినవో తెలిసికొనుట మన కర్తవ్యము. మన హిందూ సంఘానికి పునాదిరాయి వంటిది కుటుంబం. కుటుంబానికి పట్టుగొమ్మ వంటిది స్త్రీ. ఒక దేశము యొక్క నాగరికతను తెలుసుకోవాలంటే ఆ దేశంలో స్త్రీజాతి కెంతవరకు స్వాతంత్ర్యమున్నదో కనుగొనిన చాలునన్నాడు ఒక గొప్ప చరిత్రకారుడు. పురుషుడు తన సహజ బల పరాక్రమము వలననో లేక ఏ ఇతర కారణాలవలననో స్త్రీపైన అధికారాన్ని చెలాయించటానికి హక్కు సంపాదించుకొన్నాడు. దీనివలన ఏ సంఘమైతే ఈ కీడును గుర్తించి స్త్రీలకు వారి సహజ హక్కులను ప్రతిపాదించునో ఆ సంఘమే ఉన్నత సంఘము; ఉత్తమ సంఘము.

మన సాంప్రదాయములు, సంఘాచారాలు మొట్టమొదట వేదకాలములో పేర్కొనబడి యున్నవి. ఆ కాలములో స్త్రీలకెట్టి హక్కులుండినవో, ఏ యే కట్టుబాట్లకు లోనై యుండిరో ఇక్కడ పొందుపరచుచున్నాను.

ప్రాచీన కాలములో కూమార్తెపుట్టుట అశుభము కాకపోయినా అయిష్టముగా చూచేవారు. ఆకాలము ఎప్పుడూ కలహాలకు పుట్టినిల్లుగా వుండేది. అటువంటప్పుడు మగపిల్లవాడైతే తోడ్పడటానికి వీలుగా వుంటాడు; ఆడపిల్లయితే పెళ్లయి అత్తవారింటికి వెళ్లిపోతుందనే ఊహతో మన అనాది జాతివారు ఆడపిల్లజన్మించగనే కొన్నిసార్లు చంపేసేవారుకూడా. కాని మనదేశములో ఇటువంటి అక్రమాలు జరుగు చుండేవా అనే ప్రశ్నకు జవాబు చెప్పటం కష్టం. అథర్వణ వేదములోను, ఉపనిషత్తులలోను విద్వాంసురాలైన పుత్రిక కలుగుటకు మంత్రాలు, వ్రతాలు నిర్ణయింపబడి వున్నాయి. సంస్కృత నాటకాలను చదివినట్లయితే కుమార్తెలకు కుమారులవలె విద్యాబుద్ధులు గరపు చుండేవారు. దేవయాని, మొదలగువారు మరీ గారాబముగా పెరిగేవారు. కన్యయందు లక్ష్మీదేవి నిత్యమును నివసించునని తలచేవారు. శ్రీరాముడు అరణ్యవాసమునుండి అయోధ్యకు తరలి వచ్చునప్పుడు అవివాహితలు అతని నెదుర్కొని అభిషేకించిన తర్వాతనే సచివాదులు అతని నాహ్వానించిరి. కుమారునికి బ్రహ్మచర్యమెంత ముఖ్యమో కుమార్తెకును అంత అవసరమని పుత్రికలకుకూడ ఉపనయనము చేసేవారు. అప్పటి విద్యార్థులను బ్రహ్మవాదినులనియు, సద్యోద్వాహులనియు రెండు విధములుగా విభజించవచ్చును. క్రీ. పూ. 4 వ శతాబ్దము వరకును స్త్రీలు వేదాంత చర్చలయందు పాల్గొనేవారు. వీరినే బ్రహ్మవాదిను లంటారు. వేదములలో పేర్కొనబడిన ఇంద్రాణి, శచీదేవిమొదలగు స్త్రీలు చరిత్రకారులుగా నుండిరని చెప్పుటకు వీలులేక పోయినను, లోపాముద్ర, విశ్వావరఘోష మొదలగు నారీమణుల వలన ఋగ్వేదములోని కొన్ని భాగములు రచింప బడినవని మాత్రము చెప్పవచ్చును. జనకమహారాజు సభామండపమున వేదాంతరహస్యములను చర్చించిన గార్గి, యాజ్ఞవల్క్యుని భార్య మైత్రేయి బ్రహ్మవాదినులే. చాలమంది పరమార్థము నన్వేషించుటకై అవివాహితలుగా నుండేవారు. కౌశాంబిమహారాజు,సహస్రానికుని కుమార్తె జయంతి మతధర్మముల నన్వేషించుటకై జీవిత పర్యంతము అవివాహితగా నుండినదని జైన గ్రంథములు చెప్పుచున్నవి.

చాలమంది విద్యావతులు ఉపాధ్యాయవృత్తి నవలంబించెడివారు. ఉపాధ్యాయుని భార్యను ఉపాధ్యాయిని అనియు, ఉపాధ్యాయవృత్తి నవలంబించువారిని 'ఉపాధ్యాయ' అనియు పిలిచెడువారు. పురాణయుగమందు కూడ ఉపాధ్యాయులు లేకపోలేదు. కాని స్త్రీ పురుషులు ఒకే

పాఠశాలలో విద్యాభ్యాసము చేయుటు వున్నదా (Co-education) అనేది క్లిష్ట ప్రశ్న. వేదకాలమునందలి విద్య పాఠశాల విద్యకాదు. కుటుంబములోని వారందరు తండ్రి దగ్గర చదువు నేర్చుకొనెడి వారు. ధనవంతుల బిడ్డలు ఉపాధ్యాయులవద్ద చదువు కొనెడి వారేమో. ఉత్తరరామ చరిత్రయందు వాల్మీకి మహర్షి వద్ద లవకుశలతో ఆత్రేయి అనే వనితకూడ చదువుకొన్నదని చెప్పబడి యున్నది. భవభూతి మాలతీ మాధవములో, కామందకి భూరివసు, దేవరతులతో సహపాఠకురాలని చెప్పుచున్నాడు. దీనివలన స్త్రీ పురుషులు ఒకే పాఠశాలలో విద్యాభ్యాసము చేసెడి వారని తెలియుచున్నది.

ఆ కాలములోని ఆడపిల్లలు అతిథి సత్కారియందు ఆరితేరినవారుగా వుండేవారు. శకుంతల, కుంతీదేవి మొదలగు వారు వివాహమునకు పూర్వము ఇంటికి వచ్చిన అతిథిసత్తములను సత్కరించెడి వారని పురాణాలలో చదువుతుంటాము. కుంతీదేవి తన అసమానమైన అతిథి సత్కారమువల్ల దుర్వాసుని వంటి ముక్కోపులను గూడ లొంగదీసుకొని అతనిచే వరములను పొందినది.

ఇక ఆకాలములో బాలికల కేలాటి వినోదము లుండినవో చూతము. సాధారణముగా స్త్రీలు 16 లేక 17 సంవత్సరములవరకు పెళ్లిచేసుకొనెడివారుకారు. తండ్రి కూతురు వివాహమునకై అంత కష్టపడేవాడు కూడా కాదు. ఎందుకనగా కూతురే తన ఇష్టానుసారముగా వివాహము చేసుకొనెడిది. వారు సంగీతము, నాట్యములందు ప్రవీణులుగా వుండేవారు. నాటకములు మొదలగు వినోదములకు బాలికలు పెద్దవారితో వెళ్లుచుండేవారు. ధనవంతుల బాలికలు ఎక్కువగా కందుకక్రీడ (బంతిఆట) లలో పాల్గొనేవారు. రామాయణములో బాలికలు సాయంత్రము తమ స్నేహితురాండ్రతో ఆడుకొనుటకై వెళ్ళేవారని చెప్పబడియున్నది; ఈత మొదలగు క్రీడలందుకూడ ప్రవీణులుగా నుండిరి.

క్రీ. పూ. 3 వ శతాబ్దము తర్వాతనే బాల్య వివాహములు వాడుకలోనికి వచ్చినవి. దీనివలన స్త్రీ విద్యకు అంతరాయము కలిగినది. ఉపనయన సంస్కారము కూడ నిలిపివేయబడినది. వేద విద్య నేర్చుకొనుటకు స్త్రీలు కూడా శూద్రులవలె అనర్హులయి పోయినారు. క్రీ. శ. 8 వ శతాబ్దమునందు బాలికలకు 8, 9, సంవత్సరముల వయస్సునందే వివాహము చేసెడివారు. దీనివలన స్త్రీవిద్య ఎక్కువప్రచారమగుటకు వీలులేకపోయినది. దీనికి పూర్వము హిందూ సంఘమందు కవయిత్రులు, విద్యాధురీణు లుండేవారు. గాధాసప్తశతియందు రేవ, రోహా, మాధవి, మున్నగు కవయిత్రుల పేర్లు పేర్కొన బడియున్నవి. శీలభట్టారికయను కవయిత్రి తన సహజసరళశైలికై గొప్ప పేరు బడసినదని. విజయానికయను కవయిత్రి, సరస్వతీదేవి అవతారమని రాజశేఖరుడను మహాకవి పొగడుచున్నాడు. వారి రచనలు మనకు దక్కక పోవుట మన దురదృష్టము. కౌముదీ మహోత్సవమను రసికకావ్యము ఒక కవయిత్రిదనే విషయము, మనము గర్వించతగినది.

శంకరాచార్య, మండనమిశ్రులయొక్క వాగ్వివాదములు మండనమిశ్రుని ధర్మపత్ని తీర్చిన దనుట లోకవిదితమే. కొంతమంది స్త్రీలు వైద్య శాస్త్రమునందు ప్రవీణులుగా వుండేవారు. రూస అనే నారీమణి స్త్రీల వ్యాధులను గురించిన గ్రంథము రచించినట్లుగా అరబ్బీ విద్వాంసుల వలన తెలియుచున్నది. కాని ఇట్టి వృత్తి నవలంబించు స్త్రీల స్థితిగతులనుగూర్చి మనకంతగా తెలియవు. ధనసంపన్నుల బాలికలు, ముఖ్యముగా క్షత్రియ బాలికలు పెళ్లయిన తర్వాత కూడ బృహన్నాద, గణదాసు మొదలగు గొప్ప విద్వాంసుల వద్ద విద్య నేర్చుకొనేవారని మనకు పురాణముల వలన తెలియుచున్నది. వేదకాలముల తర్వాత కూడ స్త్రీలు సంగీతము, నాట్యము మున్నగు లలిత కళలయందు ప్రావీణ్యమును పొందుచుండెడివారు. గొప్పకుటుంబములకు చెందిన వనితలు కూడా నాట్యము చేయువారని ప్రసిద్ధి. క్షత్రియ కన్యలకు శస్త్రవిద్య, రాజనీతి మొదలగు రాచ విద్యలను నేర్పించెడివారు. ఆ కాలమున రాజు చనిపోయిన తర్వాత రాణి రాజ్యము చేయుట విచిత్రముగా నుండెడిది కాదు.

10 వ శతాబ్దమున చాళుక్య రాజులవద్ద [illegible] గవర్నర్లుగా, ఆఫీసర్లుగా ఆడవాళ్లుండిరని మనకు తెలియుచున్నది. కౌటిల్యుడు తన అర్థశాస్త్రమందు నిరాధారులైన

స్త్రీలను నాలుగవదగు వృత్తియందు తీసికొనవలయునని శాసించియున్నాడు.

ఇట్లు వేదకాలమందు స్త్రీలు పురుషులకు చేదోడు వాదోడుగా అన్ని విషయములందును పాల్గొను చుండిరి. కానీ కాలము ఒక పట్టున ఉండదు. రాను రాను బాల్య వివాహములు ఎక్కువయినవి. విధవా వివాహములు సన్న గిలిపోయినవి. ఇందుకు కారణము మన పూర్వీకులు ఎక్కువ సంగ పరిత్యాగమును అలవాటు పరచుకొన్నారు. వేదాంతము ముదిరేటప్పటికి ఎక్కువ కులములు, జాతులు ఏర్పడ్డవి. స్త్రీకి పూర్వమువలె స్వాతంత్ర్యము లేక పోయినది. మనువు మున్నగువారి సిద్ధాంతములవల్ల స్త్రీ కేలాటి స్వాతంత్ర్య ముండకూడదనియు, ఒకరికి ఎప్పుడూ లొంగియుండవలెననే అభిప్రాయాలు చెలరేగినవి. ఎందుకంటె పూర్వమువలె స్త్రీకి చక్కగా చదువుకొని తగిన సంస్కారము పొందటానికి అవకాశము లేకపోయినది కనుక ప్రతి విషయములోను పురుషుని సహాయము పొంద వలసిన గతి పట్టినది. బౌద్ధ జైనసిద్ధాంతముల వలన ఒక విధముగా విధవా వివాహము అరికట్టబడినది. బౌద్ధ భిక్షుకి వలె హిందూ విధవరాండ్రు సన్యాసము పుచ్చుకొని, కేశ ఖండన మొదలగు పద్ధతుల నవలంబించ సాగిరి. పూర్వము స్త్రీ విధవ రాలయిన, మరిదిని నియోగపద్ధతి ననుసరించి వివాహము చేసుకొనే హక్కు కలిగి యుండినది. కాని ఇప్పుడు భర్తచనిపోవుట కర్మ విశేషము కనుక పునర్వివాహము చేసుకొనుట పాపమని సిద్ధాంతీకరించిరి. సతి, ఘోషా మున్నగు పద్ధతులు ఆర్య మతమునకు సంబంధించినవికావు. అవి ఆర్యేతరుల సంప్రదాయములు.

ఇక వారి దుస్తులు, అలంకారము వేదకాలము లందలి స్త్రీల ఆభరణాదులను గూర్చి అంత విపులముగా చెప్పబడ లేదు. మామూలుగా స్త్రీ పురుషులు ఒకేవిధమైన దుస్తులు ధరించేవారేమో. ప్రస్తుత మళయాళాంగనలు కట్టుకొన్నట్లు ఒక గుడ్డను కట్టుకొని పైన ఒక ఉత్తరీయము (పరిధానము) ను వేసుకొనెడివారు. కాని చీరకూడ వాడుకలో నుండెనని తెలియుచున్నది. చీరను వికచ్ఛము, నాసకచ్ఛముగా (అంటే ప్రస్తుత మహారాష్ట్రుల శైలి) కట్టుకొనెడివారు. శిరస్త్రాణమును కూడా ధరించెడివారు. శిరోజములను పలువిధములుగా నలంకరించుకొనెడివారు. అజంతాచిత్రములను చూచినప్పుడు ఇప్పటి సినిమా తారలావిధముగా నలంకరించుకొనిన తెరకు మరికొంత వన్నె దెచ్చెదరని తోచుచున్నది! సిథియనులు, హూణులు మొదలగు విదేశీయులు మన దేశమునకు వచ్చిన తర్వాత ఇప్పటి పంజాబీవారి దుస్తులు వాడుకలోనికి వచ్చినవి. విధవరాండ్రు తెల్లటివస్త్రములను ధరించెడివారు. ధృతరాష్ట్రుని విధవరాండ్రైనకోడండ్రు అతనిని చూచుటకు అడవికి వెళ్లినపుడు తెల్లటి వస్త్రములు ధరించి వెళ్లిరని మహాభారతమున చెప్పబడి యున్నది. అనాదినుండియు మన దేశస్త్రీలు ఆభరణప్రియులని చెప్పవచ్చును. స్త్రీ పురుషులు కూడ కాళ్లకు, చేతులకు ఆభరణములు ధరించెడివారు; మొహంజదారో శిల్పములలో వలె మోచేతి వరకును గాజులు ధరించెడి వారో లేదో మనకు తెలియదు. తలమానికములు, కర్ణ భూషణములు, ఉంగరములు ఎక్కువగా వాడుకలో నుండేవి. ముక్కుపుడకను గురించి ఎక్కడ మనకు కానరాదు. భరతుడు తన నాట్య శాస్త్రమందు అన్ని ఆభరణాలను వర్ణించినాడేకాని ముక్కు పుడకనుగురించి చెప్పలేదు. అది మహమ్మదీయ శకమందలి చిత్రములలోనే మనకు మొదట దృగ్గోచర మగుచున్నది. ఈ విదేశ ఆభరణాన్ని కుంకుమ మొదలగు సౌభాగ్యమును సూచించెడి వస్తువులలో చేర్చి రనుట కొంత ఆశ్చర్యకరమే. చందనము మొదలగు లేపములను కూడ ఎక్కువగా వాడెడివారు. ఇట్లు ఆ కాల మందలి స్త్రీ అలంకార ప్రియురాలుగా వుండేది.

మరియొకసారి ఆ కాలమునాటి స్త్రీల ఆస్తి హక్కులను గూర్చి వివరిస్తాను.



# ఆంధ్రమహిళాసభ

## మైలాపూరు - మద్రాసు

మహిళా విద్యాలయము ;— హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్ మీడియెట్ పరీక్షలు, నృత్యము, గానము.

పారిశ్రామిక విద్యాలయము :—కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.
(గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది)

టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ :— స్త్రీలకు టైపు, షార్టుహాండు - గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ.

మహిళా మందిరము :— స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

ఆంధ్రమహిళ :— స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

నిర్మలాదేవి గ్రంథాలయము :—సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

క్రీడా, క్లబ్బుశాఖలు

సభ్యురాండ్రుగాజేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

మేనెల పూర్తిగా సెలవులు.

జూన్ 1 వ తేదీనుండి తిరిగి అన్నితరగతులూ ప్రారంభము.

వివరములు కోరువారు 5 అణాల స్టాంపులు పంపినచో పట్టీ పంపబడును.

# కర్ణాటక సంగీతము

సంగీత విద్వాన్, శ్రీ మధుర సుబ్రహ్మణ్యయ్యగారు,
సంగీత విద్వాన్, శ్రీ మంత్రాల గోపాలకృష్ణమూర్తిగారు.

**ఈవ్యాసము వ్రాయుటలో ముఖ్యోద్దేశము :-** వాగ్గేయ కారకులలో ప్రస్తుతం కర్ణాటక సంగీతమునకు ఎవరు రచించిన కీర్తనలు ఎంతవరకు ఉపయోగ మగుచున్నదీ, యిటీవల సంగీతము అభివృద్ధి చెందుటకు ఎవరు కారణమైనదీ వివరించబడినది—

మనం షుమారు 150 సంవత్సరముల కాలమునుంచి పరిశీలించుదము. కర్ణాటక సంగీతము షుమారు 150 సం॥లకు పూర్వము అనేకమంది గాయకులు పాడియున్నారు. మనకంటె వయస్సులోనుండి సంగీతవిద్యలో శ్రమపడిన వారిని గూర్చి కొంతమంది పాటకచ్చేరీలలో లక్షణ గీతములు, స్వరజితులు, భద్రాచల రామదాసు కీర్తనలు, జయదేవుని అష్టపదులు, నారాయణ తీర్థుని తరంగములున్నూ, మరికొంతమంది పురందరదాసు కీర్తనలు, క్షేత్రయ పదములు పాడేవారనిన్నీ, తానమునకు, పల్లవికి మాత్రము ఎక్కువ కాలము తీసుకొని ముగించెడి వారనీ తెలియుచున్నది.

ఏది ఎట్లున్నను నూరు సంవత్సరముల యిటీవలనుంచి త్యాగయ్యగారి కీర్తనలు, కర్ణాటక సంగీతము మనదేశములో ఏ యే భావలవారు గానము చేయుచున్నారో అంతవరకు వ్యాప్తి అయినవి. యితర దేశముల వారుకూడా మనదేశము వచ్చినప్పుడు అనేకచోట్ల త్యాగయ్య కీర్తనలు, పాటకచ్చేరిలలో వినుచున్నారు. అదిగాక రేడియోల ద్వారాగాని, వినికిడి చేతగాని అన్ని దేశములవారికి త్యాగయ్యగారి కీర్తనలు ప్రఖ్యాతి లోనికి వచ్చినవని మనకు విదితమే. ఏ యే దేశములవారు ఏరీతులలో పాడుచున్నప్పటికి బహు సూక్ష్మ బుద్ధితో విచారించువారికి ఆ రీతులు శ్రీ సద్గురు త్యాగయ్యగారి కీర్తనలలో యిమిడి వున్నవని తోచక మానదు. అన్నిరీతులు, ఆయన రచించిన ఒక్కొక్క కీర్తనలో ఒక్కొక రీతిగా అన్నిమార్గములు యిమిడి వున్నవి. పూర్వపు వాగ్గేయ కారకులు అనేక లక్షణ గీతములు, స్వరజితులు, కీర్తనలున్నూ రచించియే యున్నారు. అవి మారుమూల దాగియున్నవేకాని బయటికి రాజాల కున్నవి. రాను రాను పూర్వపు వాగ్గేయ కారకులు రచించిన పాటలు కొంత వరకు కొరతగానే పాడుచున్నారు. అందుచేత పూర్వపు వాగ్గేయ కారకులు అసమర్థులని చెప్పుటకాదు. వారు చాల గొప్పవారు. కాని వారి రచనలు పామరులకు, పండితులకు, అందరికి అందుబాటు కాలేదు. దానికి కారణము ఒక విషయమున్నదని తోచుచున్నది. ఏమిటిఅంటే జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములద్వారా చెప్పుటకు అలవిగాని ఆనందమును కల్గించలేదేమో అని. పాట వినిన వెంటనే అట్టి ఆనందమున్నూ, భక్తిని, సంగీతమునందు అపారప్రేమ కల్గించగలశక్తి శ్రీ సద్గురు త్యాగయ్యగారి కీర్తనలయందు యిమిడి వున్నదని చెప్పుటకు సందేహింప పనిలేదు. తెల్గు భాషలో కవనము చెప్పుటకు, భారతము రచించిన కవులలో నన్నయభట్టు ఎట్టివాడో, తెల్గు భాషలో కీర్తనలు రచించుటకు త్యాగయ్య అంత సమర్థుడు. బహులాలిత్యమైన పద జాలముతో కీర్తనలు రచించినాడు. అనేక రాగములలో సాహిత్యభావము ననుసరించి, రక్తిగల ఆదితాళములో ఎక్కువ కీర్తనలు వ్రాసియున్నారు. వారి వాక్కునుండి అనేకమంది శిష్యులకు చెప్పియున్నారు; తద్వారా వ్యాప్తి అయినవి. కర్ణాటక సంగీత మభ్యసించే గాయకులలో త్యాగయ్యగారి కీర్తనలు రుచిచూడకుండా ప్రముఖుడై వచ్చిన గాయకుడు ఒక్కడూ లేడు. ఏ గాయకుడైనను పాటకచ్చేరి చేయవలసి వచ్చినప్పుడు త్యాగయ్య కీర్తన పాడుట మానివేసి రక్తి, పాండిత్య ప్రకర్షణ చేసుకోగల ధీరుడు కనబడుటలేదు. త్యాగయ్యగారు పామరుల కుపయోగించు నట్లు తేలికగా నామావళి, వుత్సవ సాంప్రదాయ కీర్తనలు వ్రాసినారు. అదిగాక, పండితుల కుపయోగించునట్లు, జగదానంద కారక, శ్రీరఘు

(24 వ పేజీ చూడుడు)

# స్త్రీ పురుషుల నిర్వచనాలు

## జె. యస్. మిల్ అభిప్రాయాలు

పురుషుడు ప్రాచీన కాలమునుంచి ప్రకృతి యారాధకుడై నేర్చికొన్న విజ్ఞానమును దశదిశల వెదజల్లెను. విశ్వ సాహిత్యములో స్త్రీ పురుషునియర్ధాంగిగను, గృహిణిగను వర్ణింపబడెను. పూర్వ పాశ్చాత్య రచయితలు స్త్రీల యాదర్శమును నిర్వచించి యున్నారు. మధ్యయుగములో పురుషుడు స్త్రీని క్రీడావస్తువుగ పరిగణించెను ; అది స్త్రీ యధఃపతన కాలము. స్వతంత్ర భారతదేశంలో, శాసన సభలలో స్త్రీకి పురుషునితో సమానముగ వారసత్వపు హక్కులు నిర్ణీతమగుచున్న సమయంలో, గత శతాబ్దమందు, జె. యస్. మిల్ అను పాశ్చాత్య మహనీయుడు మహిళాభ్యుదయమునకు పాటుపడ్డ విషయము తెలిసికొన దగియున్నది.

జాన్ స్టూ అర్టు మిల్ 1806 సం॥లో జన్మించెను. తండ్రి జేమ్సు మిల్-బ్రిటిష్ హిందూదేశ చరిత్ర, అర్థిక శాస్త్రము-అను గ్రంథముల రచించెను. జె. యస్. మిల్ యూరోపియన్ భాషల నేర్చి అర్థిక, రాజకీయ, తర్క, వేదాంత శాస్త్రముల ప్రవీణుడయ్యెను. తండ్రికొడుకు లిర్వురు సంస్కర్తలు, దేశభక్తులు; సర్వమానవ సమానత్వము, జాతీయవిద్య, కార్మికుల శ్రేయస్సు, స్త్రీల ప్రాతినిధ్య, సాంఘిక, రాజకీయ అర్థిక హక్కులకై కృషిసల్పిరి. స్త్రీలదయ, యౌదార్యము, క్షమ, ప్రతిభలవల్ల వృద్ధినంది, పితాసుతులు వారిఋణము దీర్చికొనిరి.

జేమ్సు మిల్, లేడీ జాన్ స్టూ అర్టు యొక్క వుపకార వేతనముపై యెడింబరో విశ్వ విద్యాలయములో జదివెను. అతని పేరు యీ దాత నామధేయ మేమో! స్త్రీ పురుష సంబంధములో నెక్కుడు స్వాతంత్ర్యముండిన, మానవుల నాటినుండి వచ్చుచున్న దుర్గుణమగు భోగాసక్తిని వదలి, యదే జీవిత పరమావధియని భ్రమింపకుందురని జేమ్సు అభిప్రాయము. స్త్రీల హక్కులు కోరిన వాడగుటచే నితడును, కొడుకును, వీరి సహచరులును తమ బృందములోని వాడైన ఫాన్ బ్లెంక్ రచించిన "ప్రభుత్వ"మను వ్యాసములో స్త్రీల యభివృద్ధి పురుషుల యభివృద్ధితో కలసియున్నందున, సత్ప్రభుత్వమునకు లోటురాకుండ వారికి ప్రాతినిధ్యము నిరాకరింప వచ్చునను వాక్యమును ఒప్పుకొనరైరి.

'మిల్' రాజకీయాశయములు, ఫ్రాన్సులోని 'సెంట్ సైమనియన్ స్కూల్' యభిప్రాయములు నైక్యమయ్యెను. సెంట్ సైమనియన్ల సోషలిజం 'ఓవెన్' దాని కంటె నుత్తమమై, యాదర్శ కరమై, మానవాభ్యుదయమునకు మార్గదర్శకముగా నున్నదని మిల్లు యానందించెను. మిల్లు యభిప్రాయంలో వీరు సంఘములో కుటుంబ ప్రాముఖ్యత చాటించి, స్త్రీ పురుషుల సర్వ సమానత్వము నుద్ఘాటించి, వారి పరస్పర సంబంధమును గురించి చక్కని క్రొత్త త్రోవ జూపించి చిరకీర్తి గాంచిరి.

1830 సం॥ ప్రాంతమున 'మిల్' తన భావిభార్య, టేలరు సతితో మైత్రి నెరపెను. టేలరుసతి బాల్యమందే వివాహితయై పతిభక్తి గల్గి యుండెను. ఈమె స్వార్థ రహిత; న్యాయశీల ; ప్రజ్ఞావతి ; చతుర ; సుందరి ; గంభీర ; దయావతి ; ప్రతిభావతి. ఈ విశిష్టగుణములన్నియు నామెలో మూర్తీభవించి యుండుట 'మిల్' గ్రహించెను. స్త్రీలకు సహజముగానుండు సాంఘిక ప్రతిబంధకముల వలన నామె తన యంతశ్శక్తులను క్రియారూపేణా ప్రపంచమునకు జూపవీలుగాలేదనియు, తగిన యవకాశములున్నచో నామె గొప్ప శిల్పి, వక్త, ప్రపంచ పరిపాలకు రాలయ్యెడిదని మిల్లు యభిప్రాయము. ఆమె కుశాగ్రబుద్ధికి తన విజ్ఞాన సంపదను దోహదముచేసి మిల్లు తన జీవితాదర్శములకై కృషిచేసెను.

డాక్టర్. కౌతా యశోదాదేవిగారు, ఎం. ఏ., డి లిట్.

సోషలిస్టుల యభిప్రాయములను వీరిరువురు బలపర్చు చుండు వారు. ప్రపంచములోనుండు వస్తువు లందరరు జెందుననియు నైకమత్యముతో కృషిజేసి ఫలితము నందరు యనుభవింప వలెనని వీరిర్వుర యాశయమై యుండెను.

జె. యస్. మిల్ వివాహము 1851 లో జరిగెను. తర్వాతఏడున్నర సంవత్సరములు మాత్రమే భార్య జీవించెను. భార్యకు తనపై యభిమాన మేర్పడుటకు, రాజకీయ, సాంఘిక, గృహస్థ విషయములలో తనకున్న నిశ్చితాభిప్రాయములే కారణ మని 'మిల్' స్వీయచరిత్రలో వ్రాసియున్నాడు. తన భార్య భావములను, సిద్ధాంతములను అర్థము చేసికొని గ్రంథమూలమున జనులకర్పించుటయే తాను జేసిన ఘనకార్య మని 'మిల్' చెప్పియున్నాడు. స్త్రీ లితరులకు అధీనులై యుండవలెననుటకు కారణముగాని, స్త్రీల పరాధీనత పురుషుల పరాధీనతలకుగల భేదముగాని 'మిల్' తనకు తెలియ దన్నాడు. కాని పురుషులకువలెనే స్త్రీల క్షేమాలు, హక్కులకు పరిపూర్ణ రక్షణ యవసరమనియు, నా రక్షణ స్త్రీలకు తమను బంధించు శాసనములు జేయుటలో సమాన హక్కులున్నగాని దుస్సాధ్య మనియు మిల్లు నిశ్చితాభిప్రాయము. "స్త్రీల పరాధీనత"యను గ్రంథములో స్త్రీల ప్రతిబంధకములు, నాచరణ యోగ్యములగు సారాంశములు వీని గూర్చి 'మిల్' వ్రాసిన విషయములు భార్య యభిప్రాయములట. ఆమె తోడ్పాటు లేకపోతే, యప్పటి సంఘములో స్త్రీల దైన్యస్థితి, మిగత సంఘ దురాచారములతో పెనవేసుకొని, మాన వాభ్యుదయమునకెటులడ్డము తగులు చున్నదో తనకు సరిగ తెలిసియుండదని 'మిల్' భావన. అప్పటికిని స్త్రీల పరాధీనస్థితినిగూర్చి తన వ్రాత కొరవడి యున్నదనియు, భార్య తన మనోగతాభిప్రాయముల లిఖించి గ్రంథమును సరిచూచు వరకున్నైన జీవించి యున్నచో గ్రంథము చాల బాగుండెడిదని యతని యభిప్రాయము.

జె. యస్. మిల్ యార్థిక శాస్త్రగ్రంథములో అర్థిక శాస్త్రము, కార్మికుల భవిష్యత్తు అను ప్రకరణములు, భార్యా ప్రేరేపితములట. కృతజ్ఞతా సూచకముగ కొన్ని ప్రతులపై అతడు భార్యను గురించి యంకిత వాక్యములు లిఖించి యున్నాడు. "స్వాతంత్ర్య" మను గ్రంథమును దంపతులిరువురు కలిసి రచించిరి. దాదాపుగ అతని గ్రంథములలో మానవ ప్రకృతికి సంబంధించిన విషయము లన్నియు భార్యచే నిర్వచింపబడినవే. భార్య మృతి యనంతరము అతడు యామె కంకితముగ నొక వ్యాఖ్య రచించెను. ఆమె పుత్రిక చాల తెలివైనదై తనకు గ్రంథ రచనలలో తోడ్పడు చుండెనట.

పార్లమెంటు మెంబరుగానుండి జె. యస్. మిల్ స్త్రీల పుద్యమమున కంఠరార్పణ జేసెను. రెండుసార్లు నిరాకరించి, మూడవసారి కొందరు యెన్నికదార్లు తనను శాసనసభకు తమ యభ్యర్థిగ నిలబెట్టెదమన, ప్రచురణార్థమై అతడు వారికొక లేఖ వ్రాసెను. అందలి సారాంశమిది :-"రాజకీయ విషయములలో తన యభిప్రాయములు ముఖ్యముగా వోటింగు హక్కును గురించి, పార్లమెంటులో ప్రాతినిధ్యమునకు పురుషులవలెనే స్త్రీలు నర్హులని," యెన్నికల్లో గెల్చిన స్త్రీ ప్రాతినిధ్య విషయమై అతడు కృషిజేయ కృతనిశ్చయుడై యుండెను. ఈ సిద్ధాంతము మొట్టమొదట తెలియజేయు భాగ్యము అతనికే ప్రాప్తించెను. ఆ ప్రణాళికపై, అతని యెన్నిక స్త్రీ పుద్యమమునకు దారి చూపించింది. స్త్రీ పుద్యమము దినదినాభివృద్ధినొంది స్త్రీలకి ప్రోద్బల కారణమయ్యెను. అతడు అటువంటి యసాధారణ ప్రణాళికపై జయము పొందుటందరకు వింతగా తోచినదట. అట్టి ప్రణాళికతో నెన్నికలలో గెల్చుటకు దేవునికికూడ తగిన యవకాశముండియుండదని యొక సుప్రసిద్ధ రచయిత యన్నాడట. అభ్యర్థిగా నిల్చినందునను, కన్సర్వేటివు ప్రత్యర్థికంటె కొన్ని వందలవోట్లు యెక్కువవచ్చి గెల్చినందునను, 'మిల్' రాజకీయాభిప్రాయములు, దేశం మారు మూలలవరకు వ్యాపించెను.

పార్లమెంటులో నందరు చర్చించే విషయములపై మిల్లు మౌనముగా నుండెను. స్త్రీల వోటింగుహక్కు, ప్రత్యేక ప్రాతినిధ్యముల గురించి తన యభిప్రాయములను భ్రమలని మిగత సభ్యులు తలంచిరి. కాని ఆ యభిప్రాయములే వ్యాప్తి పొంది ఫలప్రదమయ్యెను. రిఫారమ్ లీగ్ ప్రణాళికలో పురుషుల హక్కులున్నందున అతడు అందులో సభ్యత్వము నిరాకరించి స్త్రీల బహిష్కారాభిప్రాయము తమకు లేదని

## స్త్రీ, పురుషుల నిర్వచనాలు

వారు చెప్పినను పురుషుల హక్కుల పతాకనెత్తుట కొప్పుకొనలేదు. డిస్‌రాలీ రిఫారమ్ బిల్లు చర్చలో నొకయమెండ్‌మెంటుగా 'మిల్' యెన్నుకొనుటకు హక్కును పురుషులకు మాత్రమే వర్తింప జేయుటకు వ్రాయబడిన మాటల తొలగించి, తన్మూలముగ పురుషులు యెన్నిక దారులగుట కేపరతువల్ల నర్హులో, నదే షరతువల్ల-గృహ యజమానిగ నుండుట మొదలగువాటికి స్త్రీల నర్హులు జేయుట-యను విషయమును బ్రతిపాదించెను. ఎడల్టు ఫ్రాంఛైజ్ బాగ వ్యాపించుచున్న యీ రోజుల్లో స్త్రీలు తమ వోటింగు హక్కు నడుగకపోవుట హక్కును పాడుచేసి కొనుటయ్యేది. ఆ సందర్భమైన వుద్యమం 1866 లో నారంభమయ్యెను జె. యస్. మిల్ పిటిషను తయారుచేసి పేరుగన్న చాలమంది స్త్రీల చేవ్రాలు బంపించెను. చర్చలో ప్రతిపక్షుల యశక్తత వెల్లడి యయ్యెను. ఎనుబది మందికి పైగా పిటిషను కనుకూలంగా వోటు యియ్యడ మందరకు చాల యాశ్చర్యము గలిగించెను. ఈ విషయములో నేకీభవించనని ముందుగా చెప్పిన 'బ్రైట్' మహాశయుడనుకూలంగ వోటుచేయుట, అతనికి చాల ప్రోత్సాహకర మయ్యెను. అతడు పారల్ వోటింగ్‌కు విద్యను షరతుగా బెట్టి, అందరి వోటింకుహక్కు వచ్చిన తర్వాత నదిరావలెనని యభిప్రాయపడెను.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో).



మహిళా సభలో షైపు షార్టుహాండ్ విద్యార్థినులు.

## కర్ణాటక సంగీతము

(21వ పేజీ తరువాయి)

వరా ప్రమేయ, ఎందరో, దుడుకుగల, నాదతనుమనిశం, సాధించెనె, కనకనరుచిరా యీ విధముగా, అనేక కీర్తనలు తెలుగులోను, సంస్కృతములోను తేనె లొలుకు నట్లుగా అందరికిని సమన్వయపరచి, ఉద్రూత లూగించి, ఆనందపరచినారు. గాయకులకు కావలసిన వస్తుసామాగ్రి అంతయు వారి కీర్తనలలో యిమిడి వున్నది.

యీ క్రింది కీర్తనలలో వుదహారణగా కొన్ని వ్రాయుచున్నాను. రాగం, తానం, పల్లవి, స్వరనడక-జాగాలు—

1. రాగము పాడేవిధానము : దాశరధీ నీ ఋణము, సుందరి నీ దివ్యరూపము, దరిదాపు, ముందువెనుక అను కీర్తనల వలన తెలియును.

2. తానం : కొలువైయున్నాడే, ఏమిత్రోవ, జగదానంద కారక, సాధించెనె.

3. పల్లవి నడక : సుందరేశ్వరునిజూచి, కారువేల్పులు, దొరకునా.

4. స్వరనడక : పంచరత్న కీర్తనలు, జగదానంద, ఎందరో, దుడుకుగల, సాధించెనె, కనకనరుచిరా.

5. జాగాలు : గిరిరాజ సుతా, చెడేబుద్ధి, ప్రక్కలనిలబడి, బాలకనక, యింకను ఎన్నో కీర్తనలు కలవు.

6. విళంబకాలము : శ్రీరఘువరా ప్రమేయ, ఎవరిమాట,

7. ద్రుతకాలము : విడజాలదురా, నెనరుంచినాను.

యీ విధముగా వస్తుసామాగ్రి సమకూర్చినారు. ఏ కీర్తనలలో తెరిచి చూచినా, రాజస, తామసభక్తి గాక శుద్ధ సాత్వీక భక్తితో వుపాసించినట్లు కనపడును. ఆయన కర్ణాటక సంగీతమునకు జేసిన సేవ అపారము. మానవులకు యిహ, పరసాధనలను కల్పించినాడు. వానిని మనము సద్వినియోగ పరచుకొనవలెను. వాగ్గేయ కారకులను విమర్శించిన యింత వస్తుసామాగ్రి యిచ్చినవారు మరెవ్వరు లేరు. ఆయన మన పాలిటి కల్పవృక్షమే.



# స్త్రీలు - నాడు; నేడు.

మూలం.
శ్రీమతి కమలాదేవి.

అనువాదం
వి. ప్రభావతి.

పురోభివృద్ధికి బీజాలు తిరుగుబాటులోనే యిమిడి వుంటాయి. తిరుగుబాటనేది ఆదిమానవుని నాటనుంచీ వుంటూనేవుంది. మానవ నాగరికతాభివృద్ధిలో తిరుగుబాట్లు మైలురాళ్ళవంటివి మొదటి ప్రపంచ యుద్ధానంతరం పీడిత ప్రజానీకం తమనిరోధకశక్తులపై సలుపుతున్న ప్రబల పోరాటానికి సాటియైనది ప్రపంచ చరిత్రలో ముందెన్నడూ కానరాదు. కానీ యీనాటి తిరుగుబాటులో ఒక ప్రత్యేకత యిమిడివుంది పారిశ్రామికయుగం ప్రపంచాన్ని పలు విధాల కదలించివేసింది. తత్ఫలితంగా మానవ జీవితంలో కూడా విపరీతమైన మార్పులు వచ్చాయి. పూర్వం జరిగిన తిరుగుబాట్లలో శాస్త్రీయమైన వివేచన, విచక్షణలు లోపించేవి. ఈనాడు ఆదర్శానికీ, ఆచరణకూ విజ్ఞాన శాస్త్రాన్ని ఆలంబనగా తీసుకుంటున్నారు. నిత్య సత్యము కంటె అనిత్య తత్వానికీ, శాస్త్రీయకంటె మూఢ నమ్మకానికీ, విమర్శకంటె విధేయతకూ యెక్కువ ప్రాముఖ్యమీయబడిన, పూర్వపు ప్రాపంచిక విలువలు సడలించ బడినాయి. నాటి మానవుడు మూఢవిశ్వాసముల బరువు క్రింద క్రుంగిపోయేవాడు నేటి మానవుడు, మానవత్వానికి సహజ చిహ్నములైన వుద్రేకాలను అణచి సంకుచితవిరోధ భావముల బారినుండి తనను తప్పించుకొన ప్రయత్నించుచున్నాడు. తనలోని మానవత్వమునే చూచుకొని గర్వింప ప్రయత్నించుచున్నాడేకాని తన హృదయ భావాలను దేవత్వ సిద్ధుల మాటున దాచుకొన ప్రయత్నించటంలేదు.

## సంఘంలో తిరుగుబాటు

తరతరాలుగా జరిగిన ఆతిరుగుబాటులో స్త్రీ పురుషులు తమకు వుచితమైనరీతిని పాల్గొన్నారుకానీ ప్రత్యేకంగా స్త్రీలు వహించిన పాత్రలనుగురించి యెవరు ప్రసంగించలేదు అయినప్పటికి మానవ నాగరికతాభి వృద్ధిని సూక్ష్మబుద్ధితో పరిశీలిస్తే స్త్రీ, పురుషులనే జాతులు అద్వైతములని తోస్తుంది స్త్రీ పురుషుల తారతమ్యాలెంచ బడటం సాంఘిక, ఆర్థిక కారణములవల్లనేగాక ఆయా సంఘాల ప్రాబల్యం కలవారు నిర్ణయించిన, నియమాలవల్ల కూడా జరుగుతుంది సంఘంలో ముఖ్యంగా స్త్రీ వుద్యమాన్ని అర్థంచేసుకోవాలంటే పైవిషయం ముందుగా తెలుసుకోవాలి సంఘంలో స్త్రీ యొక్క స్థితిని నిర్ణయించేది ఆ సంఘానికి చెందిన నాగరికతా సంస్కారాలు కాక ఆ సంఘ నిర్మాణమే. స్త్రీ వుద్యమం అనే వృక్షానికి వేళ్ళు సంఘ ఆర్థికపు పరిస్థితులలో పాదుకొనివుంటాయి.

ఏసంఘంలోనైనా స్త్రీ సామాన్యపుస్థితి ఆసంఘ బాహుళ్యంలోవున్న బుద్ధి కుశలతనుకాక ఆ సంఘం యొక్క ఆర్థిక జీవిత నైజాన్ని ప్రకటితం చేస్తోంది. ఎక్కడెక్కడ స్త్రీ ఆర్థికంగా పరాధీనయై కనుపిస్తుందో అక్కడ ఆమెస్థితి కనిష్టంగానూ, కష్టభూయిష్టంగానూ, ఎక్కడెక్కడ ఆమె ఆర్థిక స్వాతంత్ర్యం కలిగి వుంటుందో ఆక్కడ ఆమెస్థితి వున్నతంగానూ, వుత్సాహంగానూ వుంటుంది.

ఈనాడు నాగరికములనిపించుకొనే సాంఘిక వ్యవస్థలలోకంటె ఆది మానవుల కూటాలలో స్త్రీలు యెన్నో రెట్లు స్వాతంత్ర్య అవకాశాలను కలిగివుండేవారు. దానికి కారణం వారి సంఘాలలో ఆర్థిక వ్యవస్థలు సంకుచితములు కాకపోవటమే వారి అలవాట్లలోనూ, అభిలాషలలోనూ వారికి యెంతో స్వాతంత్ర్యముండేది. సక్రమ జీవితాన్ని శతధా ఛిద్రంచేసే వైరిలాంచనలు, అర్థంలేని గౌరవ మర్యాదలు ఆనాటివారి జీవితంలో ప్రవేశించ

లేదు. కనుకనే స్త్రీ పురుషులు కష్టనష్టాలను, సుఖసంపదలను సమభాగస్తులై అనుభవించారు క్రమంగా స్వార్థాలు, స్వార్జితాలు, సామ్రాజ్యాలు మానవ జీవితంలో ప్రవేశించాయి. దీనితో సంఘాలలోని ఆర్థికవ్యవస్థలు అంతకంతకు విపరూపాలు పొందాయి

సంఘంలో కలిగిన మార్పులవల్ల స్త్రీల స్థితులలోకూడ మార్పులు కలిగాయి. విజయకాంక్షవల్ల పురుషుడు, యుద్ధములద్వారా నిర్మూలక శక్తికి చిహ్నమైన తాను, నిర్మాణకశక్తికి చిహ్నమైన స్త్రీని అబలగా, రక్షణీయగా యెంచి తనపై ఆధారపడవలసిన ప్రాణిగా తయారు చేశాడు.

## స్త్రీ పురుషుని చేతిలో కీలుబొమ్మ

పురుషుడు తన ఆత్మ వికాసానికి యే విషయాలలో ప్రవేశింప ప్రయత్నించాడో ఆ విషయాల దరిదాపుకి కూడా స్త్రీలను చేరనివ్వలేదు. పురుషుని వ్యాపృత్తులు నానాటికి అభివృద్ధి అవుతున్నప్పుడు, స్త్రీలు ప్రమేయం పెట్టుకోదగిన విషయాలు నానాటికి క్షీణించినాయి. స్త్రీలు తరతరాలుగా, పుడమిమీద, పురుషులసంఖ్య నభివృద్ధిచేసే సాధనాలుగా యెంచబడ్డారు. సంఘంలో స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం యేనాడు లేకపోయిందో ఆనాటి నుంచీ ఆమె 'అబలయై' 'కుసుమకోమలియై' 'అవశ్య రక్షణీయయై' పురుషుని చేతిలోచిక్కినది. పురుషుడు ధన, వస్తు, వాహనాలతోపాటు వనితనుకూడా అనుభవ యోగ్యమైన వస్తువుగానే పరిగణించాడు. స్త్రీలపై పురుషులకేర్పడిన అధికారానికి నైతిక, మత న్యాయ శాస్త్రాలు అనుగుణ్యమైన శిలాశాసనాలను నిర్మించాయి.

సంఘంలో రెండు విధాలయిన నీతులు అమలు జరుపబడ్డాయి. ఒకటి–ప్రత్యేకంగా స్త్రీలు సంఘ రూపానికి విచ్ఛిన్నమురాకుండా వుండుటకు ప్రత్యక్షరము అనుల్లంఘనీయమైన "నీతులు"; రెండు– పురుషుల చాంచల్యాన్ని, అలక్ష్యభావాలని విశాల హృదయంతో గ్రహించి సహించవలసిన 'నీతులు'. ఈ విధంగా స్త్రీలను నిస్సహాయలుగా తయారుచేసిన తర్వాత బాల్య వివాహాలు, బురఖా పద్ధతులు, తార్పుడు, వ్యభిచారాలు సంఘంలో అనివార్యంగా ప్రవేశించాయి. ఒక విధంగా ప్రాచీన, అర్వాచీన, నైతిక చరిత్ర పురుషుల అహంకారోన్మత్త ప్రవర్తనల క్రోడీకరణయే. అమాయికలైన ఆడువారిని భయపెట్టి చిరకాలం పురుషులకు లోబడి వుండేటట్లు చేయటానికి పలువిధాలైన సాధనలు సేకరించబడినాయి.

పారిశ్రామిక యుగ ఆరంభంతో బానిసత్వానికి తగిలిన గొడ్డలి వేటువల్ల అనేక సాంఘిక శక్తులు తలలెత్తినాయి. దానితోపాటు ఫ్రెంచి తిరుగుబాటునుబోలిన ప్రజాస్వామిక విజయాలు నూతనమైన జీవితాదర్శాలను, జీవితోద్దేశాలను ప్రజల మనస్సులలో నిలిపినాయి. మతము, ఆచారము తమ శక్తి ప్రాబల్యాలతో క్రుంగదీసినవారికి ఆ విజయాల ఫలితంగా ఆశాకిరణాలు కనుపించాయి. మూగవోయిన వారికంఠాలు విప్లవగీతాలన ఆలపించాయి. చైతన్యముడిగిన వారి శక్తులు పశ్చిమ ఖండాన్ని ఆమూలాగ్రం కదలించ జాలిన పెనువుప్పెనగా పెల్లుబికాయి. మానవ హక్కులకోసం, సర్వమానవ సమానత్వం కోసం వారు సలిపిన శంఖారావం వ్యోమవీధుల లో ప్రతిధ్వనించింది. తరతరాలుగా పురుషుల దౌర్జన్యాలకులోబడి కృశించిపోయిన స్త్రీ జనాలిని అధోగతినుంచి తప్పించటానికి, పురోభివృద్ధిమార్గాలను చూపించటానికి వుద్యుక్తులైన మహనీయులు ప్రత్యక్షమైనారు. స్త్రీ స్వాతంత్ర్య వుద్యమానికి అదే శుభోదయం. ప్రపంచంలోని అన్ని భాగాలలోను స్త్రీవుద్యమముల ఆరంభం ఇంచుమించు ఇదే మాదిరి పరిస్థితులలో జరిగింది. భారత నారీ చరిత్రలోని ప్రథమాధ్యాయాలుకూడా యీ అంశాలనే సూచిస్తాయి. మన దేశపు మహిళల ఆదర్శాలను, వుద్యమాలను మనం స్వయంగా అర్థం చేసుకోవాలంటే స్త్రీ స్వాతంత్రోద్యమానికి ఆవశ్యకతను కల్పించే పై కారణాలను మనము మనస్సునందుంచుకోవాలి

## స్త్రీ స్వాతంత్ర్యోద్యమ తత్వము.

స్త్రీ స్వాతంత్ర్యోద్యమానికి స్త్రీ పురుష భేదమేగాక ఆర్థిక, రాజకీయపరిస్థితుల మూలకమైన కారణములుకూడా వున్నాయి. ఈ విషయాన్ని కొన్ని సమయాలలో మహిళలే విస్మరిస్తున్నారు.

మన దేశములోను, గ్రామాలలోను, పారిశ్రామిక కేంద్రాలలోనూ నివసించే శ్రామిక యువతులు వుత్తమ తరగతులకు చెందిన మహిళలకంటే యెక్కువ స్వతంత్రులు. వారు తమ సంసారాలలో పురుషులతోపాటు సంపాదనపరులు. అందుచేత వారు వుత్తమ తరగతికిచెందిన స్త్రీలకంటే యెక్కువగా స్వాతంత్ర్య వ్యక్తిత్వాలను కలిగి వుంటారు. వారి ఆర్థిక పరిస్థితులమూలంగా సంఘపరమైన శాసనాలకు వారు అంతగా లొంగియుండ నవసరములేదు ఉత్తమ కులాలకు చెందినవారిలో విడాకులు, వితంతు వివాహాలు దురూహ్యాలుగా యెంచబడుతున్నప్పటికీ కష్టజీవులైన వారిలో అవి అనూచానమైన ఆచారాలుగానిలచి వున్నాయి. కాలే కడుపులు జనానా చీకటి కోణాల నుంచి శ్రామిక యువతులను రక్షిస్తున్నాయి.

ఈ విధంగా స్త్రీ వుద్యమాలకు మూలకారణం ఆర్థిక అస్వతంత్రత అయియుండగా అనేకమంది ఆవిషయాన్ని అపార్థంచేసుకుంటున్నారు ఆరోగ్యానికి భంగకరమైన వాతావరణంలో జీవించటంవల్ల వ్యాధులు రావటం యెంతసహజమో, వక్రసిద్ధాంతాలమీద నిర్మింపబడిన సంఘంలో దురాచారాలు, దౌష్ట్యాలు ప్రబలిపోవటం అంత సహజమే. మన సంఘంలో మిగిలియున్న మూఢనమ్మకాలకు, క్రూరాచారాలకు కారణమైనది మనదేశములో మొదటినుంచీ వ్యాపకంలో వున్న బానిసతత్వమే.

వేదకాలములో అన్నివిషయాలలోను పురుషునితో సమానురాలిగా యెంచబడిన హైందవనారి యేవిధంగా యీనాటికి పురుషుని బానిసగా తయారు చేయబడిందో అదేవిధంగా అరేబియా యెడారులలో తమ పురుషునితో పాటు ధైర్యసాహసాలు ప్రదర్శిస్తూ ఒకనాడు మెలగిన ముస్లింవనిత యీనాడు పరదా చాటున పురుషుని పీడనకులోనై నోరున్న పశువుగా మారింది. ముస్లిం, హైందవ మత గ్రంథాలు స్త్రీలను సర్వదా శృంఖలాబద్ధులుగనే వుంచవలసినదని వేనోళ్ళ చాటించాయని వాటిలోని శ్లోకాలను, అధ్యాయాలను పురుషులు ప్రదర్శించారు. ఇస్లాం మతము చాటచూచిన న్యాయసమ్మతమైన, నిష్పాక్షికమైన సూత్రాలను త్రోసిరాజన్నారు. అర్థంలేని ఆచారాలు స్త్రీలను జడులనుగా చేసివేశాయి. సూర్యరశ్మి, పవన సంచాలన యెరుగక నాలుగుగోడలమధ్య మ్రగ్గవలసిన మగువలకువారసత్వపు బిల్లులు, విడాకులచట్టాలు యెంత ప్రయోజనకారులో! క్రైస్తవ మతానువర్తులైన పాశ్చాత్య జాతులవారు అధోగతిపాలైన ప్రాచ్య నారీమణులను గురించి ఈనాడు యెంతైనా చులకనగా మాటాడవచ్చు. కానీ మిగిలిన అన్ని మతాలలాగే క్రైస్తవ మతస్థులుకూడా ఆ మతానికి చెందిన స్త్రీ జాతిని మిగిలిన మతాలవారికంటే యేమంత గౌరవనీయంగా ఆదరించలేదు. ఆదాము, అవ్వ కథరూపంలో పురుషుని స్వర్గధామంనుంచి నరక కూపానికి పడత్రోయించిన వ్యక్తిని స్త్రీగా చిత్రించిన క్రైస్తవ ధర్మకర్తలు స్త్రీ జాతిపట్ల యెంతటి ఔదార్యాన్నికలిగివుందీ తెలుస్తుంది. సెయింట్ పాల్ మహాశయుడు స్త్రీలనూ, స్త్రీ పురుష సంబంధములనూ అసహ్యమైన విధాలలో ప్రబోధించిన ఆనాటిప్రబోధనల ప్రాబల్యం ఈనాటికీ మతపరమైన నిషేధాల రూపంలోనూ, సాంఘిక మర్యాదలరూపంలోనూ నిలచియే వున్నాయి.

పాశ్చాత్య ఆర్థిక ప్రపంచాన్ని కూకటివేళ్ళతో కదలించివేసిన ప్రబలశక్తులు ప్రపంచంలోని యితర భాగాలలో కూడా మార్పులు కల్పించాయి

ఒక శతాబ్దానికిపూర్వం భారతదేశంకూడా ఒక నూతన సంచలనాన్నిపొందింది. మొగల్ సామ్రాజ్య పతనానంతరం భారతదేశంలో ప్రజాస్వామిక సిద్ధాంతాలపైన ఒక గొప్ప తిరుగుబాటు జరిగియుండెడిదే. కాని, బ్రిటిష్‌సామ్రాజ్య సిద్ధాంతం భారతదేశచరిత్ర గమనరీతిని మార్చివేసింది.

భారతదేశంలో కరుడుగట్టిన బానిసత్వతత్వం బ్రిటిష్‌వారి సామ్రాజ్యవాదనకు అనువైన మార్గాన్ని యేర్పరచింది. సామ్రాజ్య విస్తీర్ణంలో తమకెంతైనా సహాయభూతంగా నిలిచే బానిసత్వ సిద్ధాంతానికి, బ్రిటిష్‌వారు భారతదేశంలో తిరిగి నిలువ నీడను కల్పించారు. బ్రిటిష్ దేశస్థుల ఆగమనం తోనే భారతనారీ స్వాతంత్ర్యోద్యమం ఆరంభమైనదని నమ్మే మహానుభావులు 'మత తాటస్థ్యము' పేరిట బ్రిటిష్ వారు పూర్తిగా వైదొలగని ద్వేషభూయిష్టమైన' అరిష్ట దాయకమైన ఆచారాలకు నూతన శకాన్ని ప్రాబల్యాన్ని కల్పించి భారతదేశం ప్రళయకాలంవరకూ తమ బంటుగా వుండేటట్లుచేయ ప్రయత్నించారనే విషయం అర్థంచేసుకో లేరు.

## పురోగమనంలో స్త్రీ.

స్త్రీ స్వాతంత్ర్యోద్యమం, క్రమమైన సంస్థరూపంలో, భారతదేశంలో యితరదేశాలకు విభిన్నమైన మార్గాల నను సరించింది. పురోగమనాభిలాషులైన భారతస్త్రీలు, తమ వాంఛాఫలసిద్ధికోసం సలిపిన పోరాటంలో, సంఘంలోని కరడుగట్టిన ఛాందసులే కాక, ప్రభుత్వపరమైన విరోధాన్నికూడా ఎదుర్కో వలసి వచ్చింది. 'మత తాటస్థ్యం' అనే దొంగ తెరమాటున, బ్రిటిష్‌ప్రభుత్వం ఏఏ విషయాల నైతే తనకు సంబంధించినవిగా విస్మరించిందో, ఆ యా విషయాలలో ఏ ఒక్కదానిని ఏ జాతి ప్రభుత్వమైన చూచి సహించలేదు. నిరక్షరాస్యులైన ప్రజాబాహుళ్యం తమంతట తాము సత్యాన్ని అర్థంచేసుకో గల శక్తినిచ్చే విద్యను ప్రజకందచేయటానికి బ్రిటిష్ ప్రభుత్వం వారు ఎంతమాత్రం అశక్తులు కాలేదు. కనుక సంఘంలోని పూర్వాచార పరాయణులలోనే కాక, వారికి అండగా నిలిచిన ప్రభుత్వంతోకూడా, భారతనారీలోకం తమ స్వాతంత్ర్య సముపార్జన నిమిత్తం అనన్య సామాన్యమైన పోరాటాన్ని సలుపవలసి వచ్చింది.

ప్రాచ్యదేశాలలో స్త్రీస్వాతంత్ర్యోద్యమం తననిరోధక శక్తులతో బాహాటంగా యుద్ధాలు జరిపించవలసి వచ్చింది అంతటి అవుసరం హిందూముస్లిం వనితలకు కలుగక పోవటానికి కారణం, వారు నిరసించిన స్థితి అనాదిసిద్ధము కాక, వారభిలషించినది ఆదిలో వారనుభవించినదే అయి వుండటం. ఆనాడు సెంట్‌పాల్ మహాశయుడు స్త్రీల విషయంలో నాటిన విషబీజాలు అమోఘశక్తివంతాలై, తమ ప్రాబల్యాన్ని మిగిలిన అన్ని ఆచారాలకంటె ఎక్కువ కాలం నిలద్రొక్కుకొని వుండగలిగినంతటివి. ఈనాటికీ కేథలిక్ దేశాలలో, ప్రభుత్వం స్త్రీలను వున్నతోద్యోగాలకు నియుక్తులనుగా చేస్తున్నప్పటికీ, ఆ దేశాలలోని ధర్మకర్తలు కామినులపై తమ కినుకను విడనాడలేక యున్నారు; వారి భావనలో స్త్రీలను స్వతంత్రులుగా తయారుచేసిన దేశం భగవంతుని ఆగ్రహానికి గురియగును. ఆదేశవాసుల ఆత్మలు సైతాన్లుకు స్థిరనివాసం కల్పిస్తాయి.

పాశ్చాత్య సోదరీమణులు తమ స్వాతంత్ర్యంకోసం సలిపిన పోరాటాన్ని, భారతనారీమణుల స్వాతంత్ర్యోద్యమాన్ని పోల్చిచూస్తే వీరిస్వాతంత్ర్యనౌక మొత్తంమీద సాఫీగా ప్రయాణంచేసిందని చెప్పాలి. వీరి వుద్యమం ఆదిలో ఒక సాంఘికమైన, విద్యావిషయమైన సంస్కరణోద్యమంగా పరిణమించింది. 1917 లో మాంటేగ్ చెల్‌మ్స్‌ఫర్డు సూచనలపై భారతరాజ్యాంగము సవరణలు పొందుతున్న సమయంలోనే ప్రథమంగా భారత స్త్రీ లోకం తమ రాజకీయపు హక్కులకోసం ఒక నివేదికను ప్రభుత్వానికి సమర్పించారు కాని బ్రిటిష్‌పార్లమెంటు వారి నివేదికను ఆమోదించక దానిని భారతదేశ పరిపాలక వర్గానికే తిరిగి పంపారు. 1918 లో భారతజాతీయ కాంగ్రెస్ సంస్థ స్త్రీలకు ఓటుచేసే హక్కున్నదని గుర్తించారు. తత్ఫలితంగా కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు స్త్రీలకు ఓటువేసే హక్కు న్యాయశాస్త్ర సమ్మతంగా కల్పించి ప్రజల ప్రతినిధులుగా స్త్రీల నాహ్వానించి బ్రిటిష్‌వారిని నివ్వెరపుచ్చారు. భారతప్రభుత్వాన్ని అనుసరించి సంస్థానాధిపతులుకూడా స్త్రీలకు పాలక వర్గాలలో స్థానాల నీయసాగారు. 1933 లో భారతరాజ్యాంగం పునర్విమర్శ

చేయబడిన సందర్భంలో స్త్రీలు తమకు కల్గిన రాజకీయ విజ్ఞాన, వివేచనలు ప్రతి ఫలించే విధమున ఒక నివేదికను సమర్పించారు. ఆ నివేదికలో వారు భారతదేశానికి ప్రజాస్వామిక సిద్ధాంతాలపై నిర్మింపబడ్డ జాతీయ ప్రభుత్వ ఆవశ్యకతనుగూర్చి ప్రసంగిస్తూ జాతి మత వివక్షతలు లేక స్త్రీలకు పురుషులతోపాటు ఓటుచేసే హక్కును కల్పించవలసినదిగా కోరారు. వారు ప్రకటించిన యీ కోరికలు రాజకీయ విషయాలలోకూడా స్త్రీలు యెంతమాత్రం వెనుకబడివుండలేదని ఋజువుచేశాయి.

వికాసం

కాంగ్రెసుపార్టీవారు 1930 లో సహాయనిరాకరణోద్యమాన్ని ఆరంభించినపుడు స్త్రీలుఅమోఘమైన చైతన్యంతో మేలుకొన్నారు సహజంగా వుద్రేక స్వభావులైన వనితలు తమ జీవితాలను సంఘ సేవకు, మాతృదేశ స్వాతంత్ర్య సముపార్జనకు అంకితంచేసుకున్నారు అంతవరకు కూపస్థమైన స్త్రీ జనాళి స్వాతంత్ర్య పోరాటంలో వీరాంగనాగణమై కదనరంగంలోకి దూకింది.

మాతృదేశపు పిలుపు వారి చెవులకు సోకనంతవరకు భారతినారీలోకం గృహిణులుగా, భార్యలుగా మెలగటంతోనే తృప్తి పొందేవారు హైందవ స్త్రీలు తాము వేద కాలంలో ఆక్రమించియున్న గౌరవప్రదమైన స్థానం నుంచి యే విధంగా తొలగింపబడిందీ వారు గమనించనే లేదు తమ పూర్వపుఔన్నత్యాన్ని గురించిన స్మృతులు కూడా వారి మనస్సులనుండి పూర్తిగా తుడిచివేయబడి నాయి. వారి జీవితనౌకలు ప్రత్యేకమైన గమ్యాలు లేక పురుషులు నడిపించిన బాటలలోనే సంచరించేవి.

మహాత్ముడు మహిళలలో కల్పించిన జాగృతిఫలితంగా భారతనారి తనకూ వొక వ్యక్తిత్వమున్నదనీ, తన జీవితానికీ ఒక ప్రత్యేక ప్రయోజనమున్నదనీ, తన చేతులకు తగిలించబడిన సంకెళ్ళు భారతమాతకు తగిలించబడిన సంకెళ్ళకు రూపాంతరాలనీ, తనను అధోగతిలోనికి నెట్టినప్పుడు పురుషుడుకూడా తన వెనుకనే తలక్రిందులుగా అదే అతః పాతాళంలోకి దొర్లాడనీ తన శక్తిని పునరుద్దీపింపచేసుకోవటంలో మాతృదేశానికి పునరుజ్జీవనం కలుగుతుందనీ తెలుసుకుంది నిస్సహాయయైదున్నప్పాన్నల నడుమ జీవిస్తున్న మహిళ ఆ మహాత్ముని ప్రాభవంవల్ల తన శక్తి సామర్థ్యాలను ఒక్కసారిగా గుర్తెరిగింది. తనవల్ల తన సంసారానికే గాక తన దేశానికీ, అనేక ప్రయోజనాలున్నాయని ప్రథమంగా ఆమె అప్పుడే తెలుసుకుంది. దేశసేవలో స్త్రీలకు గల పాత్రను నిర్వచిస్తూ గాంధీజీ యిలాఅన్నారు, "స్త్రీలు అబలలు అనటం దురుసుతనం బలమంటే పశుబలమే ఐతే, నిజమే ! స్త్రీలు, పురుషులంతగా పశుప్రాయులు కారు కాని, బలమంటే నైతిక బలమే ఐతేమాత్రం స్త్రీలు పురుషులకంటె యెన్నో రెట్లు బలాఢ్యులని ఒప్పుకోక తప్పదు పురుషునికంటె స్త్రీకి ధైర్యము, సహనము యెక్కువ అనే విషయం లోకవిదితంకాదా ! స్త్రీయే లేని నాడు పురుషుడు నామమాత్రంగానైనా నిలువలేడు. అహింస మనజీవిత తత్త్వమైతే భారతదేశ భవిష్యత్తు పూర్తిగా స్త్రీలమీదనే ఆధారపడివుంది !!"

బ్రిటిష్‌వారిని యిండియావదలి పొమ్మనీ, భారతీయులను తమ మాతృదేశ స్వాతంత్ర్య సముపార్జనలో విజయాన్నో, మరణాన్నో పొందవలసిందనీ, గాంధీజీ ఆదేశించిన మరుక్షణంలో సంభ్రమాశ్చర్యాలు రేకెత్తించే అనేక ఘట్టాలు ఘటిల్లినాయికాని యుద్ధరంగంలో ప్రథమశ్రేణిలో బారులుతీర్చి నిలువ నుద్యుక్తులైన భారతనారీమణులు ప్రదర్శించిన ధైర్యసాహసాలు, వీరోచిత దీక్షలు మరువరానివి. 'అసూర్యంపశ్య'లుగా పట్టుపరదాల మాటున దాచబడి పోషించబడిన కుసుమ కోమలగాత్రులు ఒక్కసారిగా తమ పరదాలను చించివేసి దుర్బలత్వాన్ని పారదోలి మండుటెండలో కదనరంగంలో కాలూని నిలచారు! సుకుమారులై పెరిగి షడ్రసోపేతములైన భోజన భాజనముల నారగించే ఆగర్భశ్రీమంతులెందరో చెరసాలలలో దాకలలో వుంచబడిన 'చారుపిండాలను' సైతం తినగలిగారు ఆకలి దప్పులను చిరునవ్వుతో సహించారు. ఆనాటివరకు భారత

నారీమణుల చుట్టు ఆవరించియున్న నాలుగు గోడలు త్రుటి కాలంలో కుప్పన కూలిపోయి వారిని ఒక్కసారిగా విశాలప్రపంచంలోకి వదిలివేశాయి వారిజీవిత విధానాలలో వినూత్నమైన ఆదర్శాలు ప్రవేశించి వారిజీవితానికే ప్రత్యేక అన్వయసిద్ధినికలిగించాయి విద్యాగంధ మెరుగనివారు సైతం విద్యావంతులైన వారితో పాటు మాతృదేశ రక్షణకై బద్ధకంకణులైనారు. బాధ్యతాయుతమైన, బాధాకరమైన అనేక కార్యాలను వారు యెంతో నేర్పుతో, ఓర్పుతో నెరవేర్చారు విదేశవస్త్ర బహిష్కరణోద్యమం పూర్తిగా మహిళలే కొనసాగించారు ఆవుద్యమంలో వారు ఎదుర్కోవలసి వచ్చిన బాధలు చెప్పనలవికానివి అహింసాత్మకమైన ఆ పోరాటానికి ఒకరూపాన్నియిచ్చి సార్థకతను కల్పించింది ముఖ్యంగా భారత నారీమణులే గాంధీజీ పలికినట్లు ఆపోరాటంలో భారతనారీలోకం ప్రదర్శించిన ధైర్య సాహసాలు భారతదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించవలసినదే

భారతదేశ స్వాతంత్ర్య సముపార్జనలో భారతనారి నిర్వహించినపాత్ర భావియుగాల వారు సైతం గర్వించతగినది. దేశస్వాతంత్ర్యోద్యమానికి నారీలోకంచేసిన సహాయంకంటె భారతనారీలోకానికి దేశస్వాతంత్ర్యం కోసం వారుసలిపిన పోరాటమే ఎక్కువసహాకరించినదని చెప్పాలి. ఎందుచేతనంటే సంఘసంస్కర్తలు యాభైసంవత్సరాలుగా ఎంత శ్రమపడినా లభించని ఫలితాలు యీ వుద్యమంవల్ల అత్యల్ప కాలంలో నేసిద్ధించాయి తత్ఫలితంగా యీనాటిభారతనారి దేశంకోసం, సంఘకోసం తానునిర్వహించవలసిన విధులు వున్నాయని గుర్తించి గౌరవప్రదమైన స్థానాన్ని పొందింది ఆమె తన జీవితనౌకను స్వహస్తాలతో స్వేచ్ఛామార్గాలలో నడిపించుకో గలుగుతోంది

# రాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయము.

## ఆంధ్రమహిళా సభ.

జూన్ నెల 1–వ తేదీనుండి తరగతులు ప్రారంభమగును.

కుట్టు, ఎంబ్రాయిడరీ పరీక్షలలో హాయ్యర్ గ్రేడ్ పరీక్షలకు శిక్షణ ఏర్పాటులు చేయబడును.

నేత లోయర్ గ్రేడ్ పరీక్షకు శిక్షణ యీయబడును. చేరగోరువారు త్వరలో దరఖాస్తు పంపుకొనవలెను.

ఈ విద్యాలయములో యింతకు పూర్వము శిక్షితులైన యువతులచే జాకెట్లు, గౌనులు, బనియన్లు, చొక్కాలు, ఎంబ్రాయిడరీ చేసిన దిండు గలీబులు జేబుగుడ్డలు, మున్నగునవి తయారు చేయబడుచున్నవి. రకరకముల తువాళ్లు, దుప్పట్లు, సాదాచీరెలు, చొక్కాగుడ్డలు నేయబడుచున్నవి. ఇక్కడ తయారైన సరుకును కొనియు, ఇక్కడ తమకు కావలసిన వస్తువులను ముందుగా ఆర్డరిచ్చి తయారు చేయించుకొనియు, బీదయువతులకు ఆర్జనసదుపాయములను కల్పింపనెంచిన మా కుతూహలమును ప్రోత్సహించవలెనని మనవి చేయుచున్నాము.

—కరెస్పాండెంటు.

# -: నవ్యభారతిలో నారీమణి :-

(అంగర సత్యనారాయణాచారి.)

ప్రస్తుతం భారతదేశం సర్వస్వతంత్రమైయున్నది స్వతంత్రభారతి నత్యున్నతమస్థాయికి గొంపోయే బాధ్యత ప్రజలపై నున్నది. ప్రజలనగా పురుషులు, స్త్రీలు కూడా కనుక స్వతంత్రభారత సముద్ధరణలో పురుషులతో స్త్రీలుకూడ సమానమైన బాధ్యతలు నిర్వహింపవలసి యున్నదికదా! అటువంటప్పుడు ఆ బాధ్యతానిర్వహణమునకు స్త్రీ లెట్టి అర్హతలు గలిగియుండాలి? ఏయే తర్ఫీదులను పొందాలి? ఎట్టి విద్యలను నేర్చిన స్త్రీలు గౌరవప్రదమైన యున్నతస్థానముల నలంకరింప నర్హులవుతారు? ఈ సమస్యలను జాగ్రత్తగా ఆలోచించాలి

దేశ క్షేమమునకై, దేశ సౌభాగ్యమునకై, ఆదర్శ రాజ్యాంగ నిర్వహణమునకై, మనదేశానికి ఉపకరించు ననేకవిషయాలను పాశ్చాత్యదేశాలనుండి మనం సమాదరణతో స్వీకరింపవచ్చు కాని యెన్ని చేసినా మనదేశం కర్మభూమియని మాత్రం జ్ఞాపకముంచుకోవాలి వివిధజాతులు, వివిధమతములు, వివిధాచారములు గల మన దేశంలో నారీమణులు తమ పాత్రను అతి మెలకువతో రూపొందించుకోవాలి. భారతదేశ సౌభాగ్య సౌధనిర్మాణములో స్త్రీలు గౌరవప్రదమైన, స్థానముల నందునట్లు ప్రజలు, ప్రభుత్వము ప్రముఖవనితామతల్లులు, సమంజసమైన మార్గమును కనుగొనాలి.

స్త్రీలకు ఆదర్శప్రాయమైన, న్యాయబద్ధమైన, గౌరవప్రదమైన జీవితములను గడుపుటకు, రెండు మార్గములు గలవు ఒకటి విద్యా విషయికమైనది రెండవది ఆరోగ్య సంబంధమైనది

విద్యా విషయికమైన శాఖలో అనేక బాధ్యతలున్నాయి వాటిని సవ్యముగా నిర్వహించినచో దేశమునకెనలేని సేవజేసినవారగుదురు. అసలు స్త్రీలు ఉన్నత విద్య నభ్యసించుట అనవసరమనే మహానుభావులు లేకపోలేదు అయితే అట్టివారి వాదమునకు అంగీకరించే వారిప్పటి పరిస్థితులలో నెవరు నుండబోరని నావిశ్వాసము అయినా విద్యావిషయములో వనితలు పురుషులకేమాత్రమ తీసికట్టు కారు

దేశమందున్న మిక్కిలి సాత్వికమైన వ్యవస్థలలో విద్యాబోధ మిక్కిలి పవిత్రమైనది. ఆదర్శప్రాయమైన, నియమబద్ధమైన జీవితమును గడుపుటకు విద్యాబోధనము జీవిత పరమావధిగ స్త్రీలు గ్రహించుట వాంఛనీయము. జన్మతః శాంత స్వభావులైన స్త్రీలు పాఠశాలలలో, ఉపాధ్యాయినులుగాను, కాలేజీలలో ఉపన్యాసకులుగాను పనిచేయుట సమంజసము అర్హతను సంపాదించిన స్త్రీలు యింకను ఉన్నత పదవులనందుకొనగలరు. 1937-లో U P విద్యాశాఖా మంత్రిణిగా శ్రీమతి విజయలక్ష్మి పండిట్ నిర్వహించిన పాత్రయే యిందుకు నిదర్శనము.

ఇకె నారోగ్యశాఖలో స్త్రీలు జన్మసాఫల్యము నందగల పవిత్ర ధర్మమును నిర్వర్తింపవీలున్నది. అసలు ఒకరోగి ఆరోగ్యవంతుడవాలంటే యిచ్చేమందుమాట అలా ఉంచితే, ముఖ్యముగా అతనికి ఆందోళనతగ్గి ధైర్యము కలిగించే ఓర్పు యెంతైనా ఉండాలి. అది స్త్రీలలో నెక్కువ గనుక, ప్రతి నారీమణి వైద్యవృత్తి నవలంబించుట అవసరము. నేటికాలమున చాలమంది యువతులు M B B S మొదలగు ఉన్నతమైనతరగతులలో చదువుచుండుట శ్లాఘనీయము స్త్రీలు వైద్యశాఖలో కీర్తినొందు నవకాశముకలదు ప్రకాశంగారి మంత్రివర్గములో శ్రీమతి ఆచంట రుక్మిణీ లక్ష్మిపతిగారు వైద్యమంత్రిణిగా తన ప్రతిభనినుమడింపజేసినది. ప్రస్తుత కేంద్ర మంత్రివర్గంలో ఆరోగ్యమంత్రిణిగా తన గురుతర బాధ్యతలను నిర్వహించుచున్న రాజకుమారి అమృతకౌర్ సర్వజనామోదము నందుచున్నది కనుక నీ రెండు శాఖలు స్త్రీలకు మెలుగునిచ్చును ఇవి వారిమానప్రాణసంరక్షణలకు ఉపకరింపగలవు అయితే యితర ఉద్యోగాలు, యితర బాధ్యతలు స్త్రీలు నిర్వహింపలేరా! ఝాన్సీ లక్ష్మీబాయి, కెప్టెన్ లక్ష్మిలాంటి వీరనారీమణులు యుద్ధములందు ధైర్యసాహసములను చూపించుట కాదనగలవారెవరు? కాని యిట్టివి వ్యక్తిగత స్వభావమును బట్టి, ఉత్సాహమునుబట్టి, సమర్థతనుబట్టి, మారుతూవుంటాయి కాని మహిళాలోకమునకీ రెండు శాఖలు ముఖ్యము అందువల్ల తమ గురుతర భాధ్యతలను నిర్వహించి తద్దీప్త్యా మహోజ్జ్వలమైన ప్రతిభను ప్రపంచమునకు జాట వీలగును



శ్రీమతి చింతగుంట
సీతామహాలక్ష్మమ్మగారు.



న్యాయపతి
రాఘవరావుగారి సతీమణి.



ఈమె ఆంధ్రమహిళా సభలో యావజ్జీవ
సభ్యురాలు. మహిళాసభ విద్యార్థినులకు
భోజనగృహ నిమిత్తమై
వీరు 10,000 రూపాయలు విరాళముగా నిచ్చిరి.
సీతాలక్ష్మి భోజనగృహము వీరిపేర నిర్మితమయినది.
వీరి ఔదార్యమునకు మహిళాసభ
చాలా కృతజ్ఞత తెలియజేయుచున్నది.



(38-వ పేజీనుంచి)

మానరాదు 'రేడియం' చికిత్సలో యింతతొందర వుండదు గాని గుణం సమానమే

యక్స్‌రేలతో ఒక్క కేన్సర్ వ్యాధేకాకుండా కీళ్ళ వ్యాధుల్ని, గుండె, రక్తసంబంధమయిన వ్యాధుల్నికూడా కుదర్చడానికి సాధ్యమవుతుంది చర్మవ్యాధులకుకూడా వుపయోగిస్తారు

ఇలాంటి అద్భుతమైన "రేడియోథెరపీ" చికిత్సా సాధనాలన్నీ వున్నదీ, మనదేశంలోకెల్లా పెద్దదీ, మద్రాసులో వున్న 'బెర్నార్డ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రేడియాలజీ'

ఎవరికైనా, యేదైనా మాననిపుండు శరీరంలో చాలా కాలంవున్నా, రొమ్ముమీద మరి యితరచోట్ల వాపులు, కంతులు, యెడతెరిపిలేనిదగ్గు మాటలోమార్పు, జీర్ణించిన అజీర్ణవ్యాధిమొదలైన బాధలున్నవారిని వెంటనే వైద్యశాలకు వెళ్ళమనిని మనము సలహాయివ్వాలి. అది కేన్సర్‌వ్యాధిగామారవచ్చు

ఇంతవరకు కేన్సర్ చికిత్సకనిపెట్టబడిందికాని, దానికి కారణం కనిపెట్టబడలేదు. ఇంకా ఇందులో జరుగవలసిన కృషి, తెలిసికోవలసిన విషయము చాలావుంది. రాన్‌ట్జన్ మేడమ్‌క్యూరీలవంటి మేధావులెవరో, యీఘోరవ్యాధి యొక్క ఆద్యంతాలు కనుక్కోగలని ఆశిద్దాము.

# న్యాయమూర్తి
# శ్రీ చింతగుంట రాఘవరావుగారు

## "... పురుషులందు పుణ్య పురుషులు వేరయా ..."

ఆంధ్రులలో ఉన్నతపదవుల నొందిన వారనేకులున్నారు. వారి జయములు ఆంధ్రమాతకు అలంకరణములు. వారిలో మహిళోద్యమముపట్ల సానుభూతి కలిగి ఆంధ్ర మహిళాసభను ఆదరాభిమానములతో ప్రోత్సహించిన ఉదారస్వభావులలో శ్రీయుత చింతగుంట రాఘవరావుగారు ముఖ్యులు. వీరు ఇటీవలనే చెన్నపురి న్యాయస్థానమునందు న్యాయమూర్తిగా నియమింపబడిరి. వీరి జీవిత సంగ్రహమును పాఠక లోకమునకు అందజేయుట మాకెంతయు ముదావహము.



శ్రీయుత రాఘవరావుగారు గుంటూరుజిల్లాలోని గోవాడయను గ్రామములో 1896 వ సంవత్సరములో జన్మించిరి. "పూవుపుట్టగనే పరిమళించు" నన్నట్లు వీరు ప్రాథమిక తరగతులనుండి పట్టభద్రులగు వరకు తమ ధీశక్తిచేత ఎల్లరను ఆశ్చర్యపరచుచుండిరి. కాకినాడలోని పిఠాపురం రాజావారి కళాశాలలో వీరు ఇంటర్మీడియట్ పరీక్షకై చదువుచున్నప్పుడు ఆ కళాశాల ప్రధానోపాధ్యాయులు, సర్. ఆర్. వెంకటరత్నం నాయుడుగారి ఆదరాభిమానములను చూరగొనిరి. ఇంటర్మీడియట్ పరీక్షలో ఆంగ్లమునందును, చరిత్రయందును వీరు అందరికంటె ఎక్కువపాండిత్యమును ప్రకటించిరి; ప్రథమశ్రేణిలో నుత్తీర్ణులైరి. తరువాత వారు చెన్నపురి ప్రెసిడెన్సీ కాలేజిలోను, న్యాయకళాశాలలోను విద్య నభ్యసించిరి. ఆయా తరగతులలో వారు ఉత్తమ శ్రేణికి చెందిన విద్యార్థిగా నిర్ణయింపబడినారు.

విద్యార్థిదశలోనే శ్రీయుత రాఘవరావుగారు అనర్గళమైన వాక్చాతుర్యముగల వక్తగా ప్రశంసింపబడినారు. 1918 వ సంవత్సరములో జరుపబడిన కళాశాలల వక్తృత్వపు పోటీలలో

వీరు ఉత్తమ వక్తగా నిర్ణయింపబడి సువర్ణపతక ములను బహుమానముగా పొందియున్నారు.

సర్ అల్లాడి కృష్ణస్వామి అయ్యరుగారివద్ద కొంతకాలము న్యాయవాదనలో తర్ఫీదును పొందిన వెనుక 1919 లో న్యాయవాదక వృత్తిని స్వీకరించినారు. వక్తృత్వములోని వారి నైపుణ్యముతోడను, న్యాయ శాస్త్రములో వారికి గల పాండిత్యముతోడను, రాష్ట్రమందలి అన్ని భాగముల నుండి వచ్చిన కేసులలో వారు న్యాయమూర్తుల మెప్పును పొందురీతిని వాదించి యున్నారు.

అచిరకాలములో శ్రీ రాఘవరావుగారు ఉత్తమతరగతికి చెందిన న్యాయవాదిగా పరిగణింపబడినారు. వారు అతిముఖ్యమైన అనేక కేసులలో వాదించియున్నారు. వాటిలో 'పామూర్ కేసు', 'కోవాడ కాలువ కేసు', 'యూనివర్సల్ లైఫ్ ఎష్యూరెన్స్ కంపెనీ దివాలా కేసు, 'కాలికట్ బ్యాంక్ కేసు ముఖ్యమైనవి. జూన్ 1948 లో ములకల్లంక కేసు సందర్భమున వీరు ప్రీవీ కౌన్సిల్‌లోను, డిశెంబరు1948లో 'హిందూలా' లోని కొన్ని ముఖ్యాంశములను వెలికి తెచ్చు ఒక కేసు సందర్భమున ఫెడరల్ కోర్టులోను వాదించియున్నారు.

న్యాయవాదక వృత్తిలో న్యాయవాది చెప్ప వలసినదంతయు న్యాయమూర్తులయొక్క అంతరాయములు లేనివిధముగ చెప్పు నవకాశములు కల్పించుటకు వారు ఎక్కువ పాటుపడియున్నారు. న్యాయమూర్తులు న్యాయవాదులను గౌరవించవలసిన రీతిని స్పష్టముచేసి యున్నారు,

1934 మొదలు అయిదు సంవత్సరముల పాటు శ్రీ రాఘవరావుగారు చెన్నపురి న్యాయవాదుల సంఘములో ఎన్నుకొనబడిన సభ్యులుగను, కొంతకాలము పాటు మద్రాసు యూనివర్సిటీ సెనేట్ సభ్యులుగను వుండిరి.

మితభాషులు, సహృదయులుఅయిన శ్రీయుత రాఘవరావుగారు తోటి న్యాయవాదుల ఆదరాభిమానములను చూరగొన్నారు. వీరు న్యాయమూర్తిగా నియమింపబడుట అందరకును ఆహ్లాదకరమైన విషయము. వాస్తవమునకు ఇదిఎన్నడో ఆయనకు కలుగవలసిన గౌరవము. న్యాయమూర్తిగ వీరు బహుకీర్తివంతులు కాగలరని మావిశ్వాసము. న్యాయమూర్తి స్థానమును వారు అంగీకరించుటలో అధికాదాయమును విసర్జించవలసి వచ్చినది. అయినప్పటికిని వారు ఆ స్థానము నంగీకరించుట వలన వారికి మానసికానందమును కల్పించు సారస్వత, వేదాంతములను ఎక్కువగా సేవించు నవకాశము లభించినది.

శ్రీయుత రాఘవరావుగారు మహిళోద్యమముపట్ల నెక్కువ ఆదరాభిమానములను చూపిరి. ఔదార్యచిహ్నముగా వారు 'ఆంధ్ర మహిళాసభ'లో స్త్రీల భోజనగృహ నిర్మాణమునకై తమ ధర్మపత్ని సీతా మహాలక్ష్మమ్మ గారిపేర రు. 8000లు విరాళ మొసగియున్నారు; ఈయన న్యాయవాదిగా మాకు ఉత్తమసలహాల నిచ్చియున్నారు. ఇందులకు మా ఆంధ్రమహిళా సభ కృతజ్ఞత తెలియబరచుచున్నది. ఈ ఉత్తమవ్యక్తికి భగవంతుడు ఆయురారోగ్యముల నొసంగు గాక!

## నేటి సంగీతంలో

# హార్మోనియం

శ్రీ హరీంద్రనాథ చటోపాధ్యాయ.

**భా**రతదేశపు శాస్త్రీయ సంగీతవిధానమునకు ‘హార్మోనియం’ ప్రవేశమువలన తీరని అపరాధం జరిగింది. ఈ అపరాధాన్ని గుర్తించుకోవటానికి భారతదేశానికి చాలాకాలం పట్టింది. మృదువైన ధ్వనులను యిచ్చే మన దేశపుసంగీత వాయిద్యాలను, శ్రావ్యప్రధానమైన మన దేశపు సంగీతాన్ని, వురుములవంటి ధ్వనులతో యీ హార్మోనియం అవమానపరచింది. హార్మోనియం మన దేశంలో పొందిన యీ విజయానికి ఒక కారణంవుంది. అది ముఖ్యంగా చారిత్రాత్మకమైనది.

మోక్షసాధనములని పిలువబడే కళలలో యేవీకూడా శాశ్వతమైన గుణగణాలతో ఊర్ధ్వలోకాన్నుంచి అవతరించలేదు. జీవితం ఒక తీరని సమస్య. సాంఘిక, రాజకీయపరిస్థితులవల్ల జీవితంలో సర్వదా మార్పులు జరుగుతూనే వుంటాయి. ప్రకృతి యెప్పటి కప్పుడు జీవిత విధానంలో మార్పులను కల్పిస్తూనే వుంటుంది. ‘కళ’ అనేది కళాకారునియొక్క వ్యక్తిత్వానికి ప్రతిబింబం మాత్రమే కాక అనూచానమైన ఆచారాలవలన, సాంఘిక వాతావరణాలవలన రూపమీయబడినదై ఒక దశనుండి మరియొకదశకు, ఒక బాణీనుండి మరియొక బాణీకి మారుతూ చరిత్రలో ఒక వర్గానికిగాని, మతానికి గాని, దోహదాన్ని కల్పించే ఒక ఉపకరణం.

అనాదినుంచీ ‘కళ’ యేదో వొకవిషయాన్ని కీర్తించటానికే వుపయోగపడింది. ఏసుక్రీస్తుని, బుద్ధదేవుని, దైవాంశ సంభూతులనిపిలువబడిన పరిపాలకులను, ‘కళ’ కీర్తించింది. యుద్ధవీరులను, వీరపత్నుల విహ్వలనయనాలను ‘కళ’ చిత్రించింది. ‘కళ’ యెల్లప్పుడు యేదో వొక వర్గానికి సముఖంగా గాని, విముఖంగా గాని తన ఓటును వేస్తున్నది. ఇంగ్లండులో మకుటధారుల రూపచిత్రాలను ఆ దేశపు ప్రఖ్యాత చిత్రకారులందరు చిత్రిస్తున్నారు. రష్యాలో లెనిన్, స్టాలిన్‌లు తమ కృషిఫలితంగా కళలో నుండి సామ్రాజ్యాధిపత్య చిహ్నమైన ‘జార్’ను పూర్తిగా వైతొలగించారు. ప్రయత్నపూర్వకంగా గానీ అప్రయత్నంగా గానీ ‘కళ’ ఒకే దృక్పథాన్ని చాటటానికి సమకట్టింది. ఉదాహరణకు, ఉదయించే సూర్యుణ్ణి ఒక కవి యుద్ధవీరుని చేతిలోని రక్తసిక్తమైన డాలుతో పోల్చివుంటే ఆతడు అప్రయత్నంగానైనా యుద్ధప్రచారం జరుపుతున్నాడన్నమాట. లేక ఇంకొక కవి అదేసూర్యుణ్ణి ప్రపంచ జనులు నివసించే ఒక మహోన్నతమైన భవన నిర్మాణంకోసం దినదినం తూర్పుదిశనుంచి విసరబడే ఒక యిటుక ముక్కగా భావించి చిత్రించినట్లయితే ఆతడు నిస్సందేహంగా ప్రజాశక్తుల విజయాన్నే సూచిస్తున్నాడు. ఈ విధంగా కళాకారుడు ఆయాకాలాలకు కొలతబద్దవంటి వాడు. కాలంతో పాటు మార్పుచెందలేని కళాకారుడు గతయుగాలకు అందమైన ప్రతిబింబాలను కల్పించేవాడుగా నిలిచిపోతాడు. మానవచరిత్ర నిర్మాణంలో సహకరించే కళాసృష్టిని కల్పించిన చిత్రకారుడు తనచుట్టు ప్రతినిత్యము కలిగే మార్పులను గమనిస్తూ, మానవునిలో అంకురించిన

నిత్య నూతన వాంఛల ఫలితంగా చరిత్ర గమనరీతిలోని వైవిధ్యములకు తన ప్రకృతిని అన్వయ పరచుకొనే ఒకశక్తిగా నిలువగలదు.

మానవుడు చిరస్థాయిగా యెదుగు బొదుగులు లేక నిలచివుండే జడపదార్థంకాదు అతని ఆత్మ అనేక వాహినులుగా ప్రవహిస్తుంది; అనేక వాంఛలను రేకెత్తిస్తుంది; అసంఖ్యాకములైన ఆశలను కల్పిస్తుంది; మహోన్నత ఆదర్శాలకోసం, విజయాలకోసం పరితపింపజేస్తుంది మార్పుకు లోబడని అంశము యీ విశ్వసృష్టిలో లేదు పరిపూర్ణత్వం సిద్ధించిన దనుకొన్న యేవిషయమైనా చైతన్యరహితమై అంతటితో అంతరించవలసిందే. అనంత ఆకాశంలో యే ఒక్క నక్షత్రమైనా, మాంత్రిక శక్తులవల్లగానీ, మూర్ఖత్వంవల్లగానీ నిర్ణీతమార్గంలో సంచరించటం ఆపివేస్తే అరఘడియలో యీ సృష్టిఅంతా ప్రళయ కల్లోలితమౌతుంది పై అంశాలనుబట్టి కళ సర్వదా మార్పులకు లోనవుతుందనీ, కళా ప్రపంచంలో కలిగే ప్రతిమార్పు అర్థవంతమైనదని ఋజువు కాగలదు. హార్మోనియం ప్రవేశంతో మనదేశపు సంగీత కళ వినూత్నఘట్టాన్ని ముఖాముఖి ఎదుర్కోవలసి వచ్చింది

సంగీతశాస్త్రిజ్ఞులుపయోగించిన ప్రాచీన వాయిద్యాలు మృదులాతి మృదులములైన ధ్వని విశేషాలను కల్పించేవి ఆ వాయిద్యాలు శబ్దంకంటే నిశ్శబ్దాన్నే యెక్కువగా సూచించేవి. సితార్, బీన్, సారద్, సారంగి—వీటిని విన్నప్పుడు, వాని నిస్వనంలో అనిర్వచనీయమైన విషాద, గాంభీర్యాలు శ్రోతల మనస్సులలో పొడసూపుతాయి ఈ వాయిద్యాలు చిన్నగదులలో కొద్దిమందిచేత వినదగినవే కాని, పెద్ద పెద్ద సభలలో ఆరుబయట వాయిద్యాలు వుపయోగించవలసి వచ్చినప్పుడు యివి నిరుపయోగములవుతాయి. ప్రజాబాహుళ్యాని కంతటికీ అందుబాటులో లేని విధంగా యీ వాయిద్యాలు సృజింపబడటానికి చారిత్రాత్మకమైన ఒక కారణం వుంది శాస్త్రీయ సంగీతానికి అనుబంధించి కనిపెట్టబడిన యీ వాయిద్యాలు ప్రజలు పరిపాలకుల ఆదరాభిమానాలకు ప్రాకులాడిన్న బానిసయుగమునాటివి

ఏ మహారాజుల ఆనందంకోసం ప్రాచీన ప్రఖ్యాతగాయకులు గానంచేసేవారో ఆ మహారాజులకంటేకూడా గాయకులే యెక్కువగా పూజింపబడినట్లు, ప్రాచీన గాయకుల జీవితగాధలను బట్టి తెలుస్తోంది గతయుగాలలో మహీపాలురు గాయకావతంసులను తమ సింహాసనములపై కూర్చుండబెట్టి గౌరవించినట్లుకూడా తెలుస్తోంది. ప్రాచీన సంగీత శాస్త్రిజ్ఞులందరు యేదో ఒక సంస్థానానికో లేక మహారాజుల ఆస్థానాలకో అనుబంధించినవారైయుండి వారి పోషణలలో వృద్ధిపొందారు ఆ గాయకులు, ఆ యా పోషకుల ఆస్థివిభవాలలో ఒక భాగముగా పరిగణింపబడేవారు.

భారతదేశంలో శాస్త్రీయమైన సంగీతం రజిత, కాంచనాలవలె వెలకు పొంద దగినదై, కలవారి కొలువులలో కట్టివేయబడింది బ్రిటిష్ వారి ఆగమనానికి పూర్వం శాస్త్రీయ సంగీతానికి మహారాజ పోషణలు జరిగాయి గాయకులు జాగీర్లు, ఏనుగులు, అష్రాఫీలు (బంగారు నాణెములు) స్త్రీలు, కోరినంత ద్రాక్షసారాయి, నల్లమందు మొదలైనవాటిచేత విరివిగా సత్కరింపబడేవారు. గాయకులకు రాజకుటుంబాలలో ప్రవేశమీయబడింది ధర్మకర్తలవలే, గాయకులుకూడా తమ్ము సత్కరించువారిని కీర్తించి గానంచేశారు ధనమూలంగా పొంద దగిన అన్నివస్తు విశేషములవలే సంగీతంకూడా ధనంచేత కొనదగినదైనది; భోగలాలసులైన ప్రభువులకు, ద్రాక్షసారాయిమైకంతో తూలిపోయే భూపాలులకు, వారి వారి రాత్రి చర్యలలో సంగీతం ఒక వినోదమైంది. అనాదినుంచీ సంగీతశాస్త్రం ప్రజాబాహుళ్యంలో వుండే సంగీతాభిలాషను సరకు చెయ్యలేదు అందుచేత ప్రజాబాహుళ్యం, సంగీత శాస్త్రిజ్ఞులు కనికరించి సంగీత బిక్షపెట్టేవరకు వేచియుండక తమకు తోచిన ఢక్క, బాకా మొదలైన పెద్ద ధ్వనిచేసే వాయిద్యాలను కల్పించుకున్నారు వారు కల్పించిన ఆ వాయి

ద్యాలు అసంఖ్యాక ప్రజానీకాన్ని, దోపిడిచేయబడిన వారి జీవితాలను గొంతెత్తి వెల్లడిచేసేవిగావున్నాయి ఆ వాయిద్యాలలో ధనికవర్గంవారు యెంచినట్లు మృదుత్వము లేకపోయినా అవి ఆ వర్గానికి చెందినవారి దారుఢ్యాల్ని, విశ్వాసాన్ని వెల్లడించేవిగా మాత్రం వున్నాయి శాస్త్రీయ వాయిద్యాలు వాద్యగాండ్రను పోషించి బానిసలుగా కొనకలిగినవారి చెవులకుమాత్రమే సోకగలిగితే ప్రజల వాయిద్యాలు వేలాది ప్రజలకు తమ నిస్వనాలను పంచి యిచ్చేవి

యూరోపియన్ నాటకరంగాన్ననుసరించి పార్శీనాటక కంపెనీల వారు మనజాతీయ నాటకరంగంలో తీసుకువచ్చిన మార్పులతోపాటు హార్మోనియాన్నికూడా ప్రవేశపెట్టారు హార్మోనియం ప్రవేశానికి కారణం, ఒక్కదానినవీనతే కాదు; నాటి నాటకాలలో ప్రేక్షక సమూహాని కంతటికి వినిపించే ధ్వని హార్మోనియంవల్ల కలగటంకూడా ఒక కారణం. అంతేకాకుండా బ్రిటిష్‌వారి ఆగమనంతో సంక్రమమైన దేశీయ నాగరికతకు, సంకరధ్వనులను కలిగించే హార్మోనియమే సరియైనదని మనవారు యెంచసాగారు. చిన్న చిన్న కూటాలలో నుంచి పెద్ద పెద్ద నాటకపు హాలులలోకి సంగీతాన్ని తీసుకురావలసి వచ్చినప్పుడు హార్మోనియం ముఖ్యమైన సేవచేసింది అంతకు మినహా మిగిలిన అన్నివిషయాలలోను హార్మోనియం మనకు మంచి కంటే, కీడునే ఎక్కువ కలుగజేసింది; శాస్త్రీయ సంగీతాన్ని నాశనంచేసి దాని స్థానంలో ఈనాటి సంగీత శాస్త్రిజ్ఞులు నిర్మింప ప్రయత్నిస్తున్న సమ్మేళన విధానాలలో యేదానినీ, ప్రవేశపెట్టలేకపోయింది

మనం ముఖ్యంగా పిచారించవలసింది, సంగీత సమ్మేళనానికి కావలసిన పునాదికూడా లేకపోవటమే. నవ్యత దానియంతటది ఆవిర్భవించక, ప్రాచీనతలో నుంచే అంకురిస్తుంది. కాబట్టి ప్రపంచములోని అన్ని మూలలనుండి సేకరించబడిన విజ్ఞానవిషయాలను మనము జీర్ణించుకోవాలి. మనం మనదేశపు సంగీతాన్ని మాత్రమేకాకుండా వివిధ దేశాలలోని పలురకములైన సంగీత విధానాలనుకూడా నేర్చుకోవాలి "మనదేశంలోనే మనకు కావలసిన ప్రతి విషయం వున్నప్పుడు పాశ్చాత్యదేశాలనుంచి కానీ, చీనా, ఆఫ్రికాదేశాలనుంచికానీ, మరెక్కడనుంచికానీ మనం యేవిషయాన్నైనా యెందుకు నేర్చుకోవాలి?" అనే యీ మాదిరి అసహనభావాన్ని మననుంచి పారద్రోలాలి. ఈ మాదిరి అంచనా అసహజమైన, అపాయకరమైన జాతీయ భావానికి దారితీస్తుంది. అది ఎంతమాత్రమూ అభ్యుదయ సూచకముకాదు. సోమరితనానికి, అంధత్వానికి అదిచిహ్నమవుతుంది. ఈనాడు మనము కొత్తవైన ఆకాశపుటంచులనుచూస్తున్నాం ప్రపంచజనులు యీనాడు నూతన జీవిత విధానాలకై, నూతన సంగీత సాహిత్యాలకై, నూతన అన్వయార్థాలకై, యెదురుచూస్తున్నారు.........మనము జీవితంలోకాని, సంగీతంలోకాని సరి క్రొత్త బాణీలను కనిపెట్టగలిగిన నాడు ప్రపంచములోని అన్నిదేశాలనూ, అన్నిజాతులనూ సమాన ఆదరణతో చూడగల హృదయ వైశాల్యము మనకు సిద్ధిస్తుంది అప్పుడే అలసట, తృప్తి యెరుగని నిజమైన కళాకారుని ఎద్దనుంచి "ఈనాడు" అత్యవసరముగ వాంఛించిన సేవ స్థిరమైన రూపాన్ని పొందుతుంది.



# భారత నారి

వేద పురాణ శాస్త్రములు వేరై పోయిన భారతీయు సం
పాదన దేవతార్చనయు భక్తియు నీతియు నార్యధర్మముల్
ఏదరిఁ జేరనీయ కిటు లింపుగఁ గాచిన తల్లివీవు ని
న్నాదర భావమున్ గనుట అబ్బురమా! లలనా శిరోమణీ.

పురుషుం డేకడ నైన పుణ్యపురుషుండే యన్న కాలంబునన్
స్థిరమౌ జీవన మార్గ సాహితికి జేజేలిచ్చు కాలంబునన్
తిరుగా గుమ్మము త్రొక్క గేస్తునకు జ్ఞప్తిం దెచ్చి యాచారముల్
మరుగై పోకను నిల్పినట్టి మణివమ్మా! భారతాంగాసతీ.

స్వేచ్ఛా భారతమందు నేఁడు మరలన్ జేకొందు మాఆర్షముల్
ఇచ్ఛా శక్తినటన్న వీరలకు నేఁడీపాటి యాధర్మముల్
విచ్ఛిన్నంబై పోక నిల్పినది నీవేగా మహాదేవి! నీ
యిచ్ఛా శక్తికి నేమనంగ వలెనో యీ రేడు లోకంబులున్.

"అరయ మహాపతివ్రతలు ఆర్షసతుల్" అను నానుడెల్లెడన్
విరసము నంద నీయ కెటు వీరడి పోవక బ్రోచి పుణ్యులే
పురుషుల స్త్రీల నట్టులె పురాణము లందునె గాక నేఁడునీ
భరత సతీత్వ నామమును భవ్యగతి న్నిలబెట్టి తమ్మరో!

ఎన్నియుగాల కైన నిటు నిన్నె తలంచుచు మ్రొక్కుచుందురే
యన్నుల మిన్నలైన హృది యాదర మిచ్చుచు నిన్నె చూచి, సం
పన్నత దిద్దుకొందురిట ప్రాజ్ఞతఁ జూపుచు గన్న, నమ్మరో!
యున్నె మహాద్భుతంబు తలయూచరె దేవతలైన నోసతీ!

---

భాషాప్రవీణ, శ్రీమతి అయ్యగారి రాఘవమ్మ

# చికిత్సా విధానములో వింతలు—రేడియో థెరపీ

డాక్టరు. టి. ఆర్. శేషగిరి రావుగారు.  ఏ. ఐ. ఆర్. వారి సౌజన్యముతో

ఈ మధ్య మీరు కేన్సర్ (మేహరణం) అనే వ్యాధిని గురించి తరచుగా వింటున్నారు. కేన్సర్ ఒక భయంకర మైన వ్యాధి ఈవ్యాధినికనిపెట్టడం చాలాకష్టం; ముదిరినతర్వాత కనిపెట్టికూడా సరియైన చికిత్సలేకపోతే మరణం నిశ్చయం కా గా ముదిరినతర్వాత నివారణవిషయం ఆలోచించ వలసిందే. కొంతకాలంక్రితం వరకూ దీనికి చికిత్సే లేదు ఇప్పుడు శాస్త్రవిజ్ఞానం చాలా వృద్ధైంది. చికిత్స కనిపెట్ట బడింది. దానినే "రేడియోథిరపీ" అంటారు ఇది ఆధునిక అత్యద్భుత చికిత్సావిధానాలలో వొకటి

రేడియోథిరపీ అంటే కేన్సర్ మొదలైన కొన్ని గడ్డు వ్యాధుల్ని 'యక్స్‌రేస్, రేడియం' అనేవాటిని వుపయోగించి చేసే చికిత్సావిధానం. యక్స్‌రేస్ రేడియం అనేవి యీ వ్యాధి సమూహాన్ని సమూలంగా నిర్మూలించగలిగిన సాధనాలు

యక్స్‌రేస్‌ను ప్రఖ్యాత జర్మన్ శాస్త్రవేత్త రాన్‌ట్జన్ అనే ఆయన 1895 సం|| లో కనిపెట్టారు. ఆయన వొక రోజున తన చీకటి పరిశోధనాలయంలో కూర్చుని పరిశోధనలను చేసుకుంటూన్న సమయంలో ఆగదిలోనే వొక మూలని వున్న 'బేరియంప్లాటినోసైనైడ్' అనేమందు పూసిన స్క్రీన్ వొకటి మెరుగుడుపురుగు మాదిరిగా మెరుస్తూ వుండటాన్ని చూశాడు ఆశ్చర్యపడ్డాడు సహజంగా పరిశోధనా కుతూహలుడు కనుక అంతటితో ఆగక అది అట్లా మెరవటానికి కారణం ఏమిటా అని ఆలోచించాడు. చివరికి కంటి కగుపడని ఒకవిధమైన కిరణాలు ఆ స్క్రీన్ మీదపడి మెరుస్తూన్నట్లు తెలుసుకున్నాడు ఆ కిరణాలు యెక్కడనుంచి వస్తున్నాయా అని శోధించి, అవి తను పరిశోధనచేస్తూన్న వొక గాజుగోళాన్నుంచి వెలువడు తున్నాయని, మధ్యగావున్న కాగితంలోంచి, అట్టలోనుంచి కర్రలోనుంచికూడా, అవి చొచ్చుకొనిపోయి మూలనున్న స్క్రీన్‌కి తగులుకొని అక్కడ ఆగిపోతున్నాయని తెలుసుకొన్నాడు. తరువాత అతని ఆశ్చర్యానికి మేరలేదు. ఆమెరుస్తూన్న స్క్రీన్‌కి, కిరణాలకీ మధ్య తనచేతిని దూర్చి నీడను చూశాడు యెముకలన్నీ యెక్కువ నల్లగానూ, స్పష్టంగానూ, మిగతా నరాలు, కండరాలు తక్కువ నల్ల గానూ, వేటికవి స్పష్టంగాను కనుపించాయి చేతివ్రేళ్ళను కదిలించాడు. యెముకలుకూడా కదిలాయి. ఎగిరి గంతేశాడు. ఎట్టకేలకు మానవశరీరం లోంచి చొచ్చుకొని పోయి, శరీరంలోని అంతర్భాగాన్నంతటినీ చూపించ గల కిరణాల్ని కనుక్కోగలిగినందుల కెంతో సంతోషపడ్డాడు. వీటిని వుపయోగించి మానవసేవ చేయటానికి చక్కటి అవకాశం యేర్పడిందనుకున్నాడు. వైద్యప్రపంచానికి వొక వరప్రసాదంగా భావించి అందరికి తెలియపరచాడు ప్రథమంలో తాను వాటికి "రాన్‌ట్జన్ కిరణాలు" అని పేరుపెట్టి తన పేరును ప్రపంచంలో చిరస్థాయిగా చేశాడు వీటియొక్క పుట్టు పూర్వోత్తరాలుగాని, గుణగణాలుగాని తెలయకపోవుటయే గాక, కంటికగోచరమైన కిరణములు కావటమువలన, యివి యక్స్‌రేస్ అనికూడా పిలువబడ్డాయి.

తరువాత 'రాన్‌ట్జన్' చేసిన పరిశోధనవల్ల ఈయక్స్‌రేలు శరీరములోని, అస్థిపంజరముల ఫోటో, అంటే "రేడియోగ్రాఫులు" తీసుకోడానికీ, లోహాలలో గల కల్తీలు కనిపెట్టడానికీ వుపయోగిస్తాయని తెలుసుకున్నారు. యీ యక్స్‌రేలు చొచ్చుకుపోయే శక్తి వివిధపదార్థాలయొక్క సాంద్రతను పట్టివుంటుంది. అందుచేతనే ఒకచేతియొక్క రేడియోగ్రాఫు తీస్తే, వివిధభాగాలయొక్క సాంద్రత ననుసరించి యెముకలు బాగా నల్లగానూ, మిగతా నరాలు, కండరాలు తక్కువనల్లగానూ కనపడతాయి. శరీరంలో తీయవలసిన భాగానికి ఒకప్రక్క ఫొటోఫిల్మును వుంచి రెండోప్రక్క నించి నియమితకాలము యక్స్‌రేలను ప్రసరింపజేసి ఆ ఫిల్మును చీకటిగదిలో ద్రావకాలలో కడుగుటవలన శరీరంలో రోగాలను కనిపెట్టడానికి వీలవుతుంది. రేడియం సంగతికూడా తెలుసుకున్న తరువాత యక్స్‌రేలను చికిత్సకెలా వుపయోగిస్తారో తెలుసుకుందాము.

మీ "మేడమ్‌క్యూరీ"ని గూర్చి వినని వారుండరనుకుంటాను మేడమ్‌క్యూరీ అనేక కష్టాలకులోనై 'రేడియం' అనే అపూర్వఖనిజాన్ని లోకానికి ప్రసాదించిన మహావ్యక్తి రేడియంకూడా బంగారము, వెండి, సీసం మొదలైన వాటి మాదిరిగా ఒక మూల ద్రవ్యముకానీ, దీనికి యేమూల ద్రవ్యాలకూ లేని ఒక అద్భుతశక్తివుంది ఏమిటీ అంటే యిది యెప్పుడూ యెడతెరిపిలేకుండా కంటికగుపడని ఆల్ఫా, బీటా, కణాల్ని, గామాకిరణాల్ని, సూర్యుడెప్పుడూ కాంతి పంపుతూ వున్నట్లుగా తననుండి పైకి పంపిస్తూవుంటుంది ఇందువల్ల ఆద్రవ్యంలోకలిగే తరుగు చాలాతక్కువ. కొన్నివందల సంవత్సరాలకుగానీ తూకం

గోతరుగును కనిపెట్టలేము. ఈగామా కిరణాలుకూడా యక్స్‌రేల మాదిరిగా కేన్సర్, చికిత్సకుపయోగడతాయి. రేడియంచాలా అరుదైనవస్తువు దీనిని యురేనియం మొదలగు ఖనిజాలలోంచి శుద్ధపరచి విడతీయడం చాలా కష్టము అందుచే దీనివిలువ అపారము.

ప్లాటినంలోహంతో వొకటి మొదలు మూడు సెంటీమీటర్లు పొడవైన సన్నని గొట్టాల్ని తయారుచేసి, అందులో చాలాకొంచం అనగా ఒకటి రెండు మిల్లీగ్రాముల రేడియంవుంచి రెండుప్రక్కలమూసి గ్రామఫోనుసూదులులా తయారుచేస్తారు వీటినే రేడియం సూదులు అంటారు ఆల్ఫా, బీటా కణాల్ని ప్లాటినం ఆపుచేసి, గామా కిరణాల్ని మాత్రం తనలోనుంచి చొచ్చుకుపోనిస్తుంది. ఆ సూదుల్ని కేన్సర్ వుండే భాగాన్నికోసి లోపలవుంచి కుట్టుతారు. దానిలోనుంచి వెలువడే గామా కిరణాలు కేన్సర్ జీవకణాన్ని మొదలంటానిర్మూలిస్తాయి. రేడియం క్లోరైడ్ అనే లవణాన్ని నీటిలో కరిగిస్తే 'రేడన్' అనే వాయువు వొస్తుంది. దానినికూడా రేడియంసూదులలో మాదిరిగానే చిన్నచిన్న గాజుగొట్టాలలో యెక్కించి కేన్సర్ చికిత్సకు వుపయోగిస్తారు

ఈ కేన్సర్ అనేది అతిభయంకరమైనవ్యాధి. ఈవ్యాధి శరీరంలో ప్రవేశించిందీ అంటే_తరుణంలో చికిత్స చేయకపోతే_ ఒక పీతమాదిరిగా లోపలకు తొల్చుకొనిపోయి అవయవాల్ని పాడుచేసి ప్రాణహానిని కలిగిస్తుంది సాధారణంగా యీ వ్యాధి అంకురించే స్థలాలు- పెదవులు, దవడలు, నాలుక, నోరు, గొంతుక, అన్ననాళము, వాయునాళము, కడుపు; స్త్రీ ల లో యింకారొమ్ములు గర్భాశయము. వయస్సు ముదిరినవాళ్ళకే యీవ్యాధి తరచుగా వస్తూవుంటుంది ప్రప్రథమంలో బాధచాలా తక్కువగా వుండటంచేత సాధారణంగా ప్రజలు దీనిని వుపేక్షిస్తారు. వ్యాధిక్రమంగా వృద్ధిపొంది రక్తంద్వారా అన్ని ప్రాంతాలకీ వ్యాపించి, పుండై స్రావం ప్రారంభిస్తుంది వ్యాధి ముదిరినతర్వాత పుండు అన్ననాళములలోవుంటే మ్రింగటానికిబాధ; గొంతులోవుంటే మాట రాదు; వాయునాళంలోవుంటే దగ్గువస్తుంది, వుమ్మిలో రక్తంపడుతుంది. యీ వ్యాధి యీవిధంగా మనిషి జీవితాన్ని దుర్భరంచేస్తుంది. ఇంత ముదిరిన తరువాత వైద్యశాలకు వెళ్ళినా వ్యాధికుదరటం చాలాకష్టం ఈ కేన్సర్ జీవకణాలు త్వరలో కోటానుకోట్లు వృద్ధిఅవుతూ వుంటాయి కానీ, అంత త్వరగావృద్ధిపొందే కేన్సర్ జీవకణాల్ని యక్స్‌రేలు, గామాకిరణాలు **అతి సులభంగా** నిర్మూలిస్తాయి. శరీరంలో తక్కిన అవయవాలకు యీకిరణాలవల్ల హానికలుగుతుంది శరీరంలో శస్త్రానికి వీలుగా వుండే భాగాలలో కేన్సర్‌వుందీ అంటే రేడియం సూదులనుపయోగిస్తారు శస్త్రానికి వీలులేని లోపలభాగాలలో వుంటే (యక్స్‌రే) కిరణాల నుపయోగిస్తారు.

మొదట రోగి వైద్య శాలలోని రేడియాలజీశాఖకు రాగానే అక్కడవుండే ప్రధాన వైద్యుడు రోగినిపరీక్షించి ఆరోగికి యేవిధమైన చికిత్స చేయాలో నిర్ణయిస్తాడు. కేన్సర్ శరీరాంతర్భాగంలోనే వుండటంతటస్థిస్తే వెంటనే అభాగానికి యక్స్‌రే చిత్రాన్నితీసి పుండుయెక్కడవున్నదో యేస్థితిలోవున్నదో తెలుసుకొని యక్స్‌రే మోతాదును_అంటే ఎంతతీవ్రమైన యక్స్‌రేలు యివ్వాలి, యెంతకాలం యివ్వాలి అనేవిషయాలను_ నిర్ణయిస్తాడు. ఆతరువాత రోగిని యక్స్‌రే యంత్రంవుండే గదిలోనికి తీసుకునివెళ్ళి, సోఫాలాంటి దానిమీద పరుండబెడతారు యక్స్‌రేయంత్రం చాలాపెద్దదిగా వుంటుంది. చూడటానికి కొంతమందికి భయంగాకూడా వుండవచ్చు. దానికుండే వొక చక్రాన్నితిప్పి, ఆయంత్రలో యక్స్‌రేలు ప్రసరించేగొట్టం శరీరంలో యేభాగానికియక్స్‌రేలు అవుసరమో, ఆభాగం దగ్గరకు వచ్చేటట్లుచేస్తారు గదితలుపుమూసి బైటనుంచి ఒకమీట నొక్కగానే యంత్రం పనిచేయటంప్రారంభించి యక్స్‌రేలు శరీరంలోకి చొచ్చుకుపోతాయి ఆగదికి గాజు తలుపులుండటంచేత లోపల యేమిజరుగుచున్నదీ బైటనుంచి వైద్యుడు చూడగలడు. ఒకవేళ రోగి భయస్థుడై లేచి అటూ ఇటూ పరుగిడుతుంటే చూచి మీటను ఆపుచేయటానికి వీలుగా వుంటుంది. ఇంకొక తమాషాకూడావుంది లోపలవుండేమనిషి కనుపించడమేకాదు అతను మాట్లాడే మాటలుకూడావినుటకు వీలైన యేర్పాట్లు ఆగదులకు వుంటాయి మీట నొక్కగానే ఒక గడియారంకూడా పనిచేయటం ప్రారంభించి నియమితకాలంకాగానే గంటకొడుతుంది వెంటనే వైద్యుడు మీటను ఆపుచేసి రోగిని బయటకు తీసుకొనివస్తాడు ఇదంతా జరిగే సరికి రోగికి చాలామట్టుకు బాధ తగ్గి చికిత్సలో ఒకవిధమైన నమ్మకం యేర్పడుతుంది. వాపులు తీస్తాయి స్రావం తగ్గుతుంది. పుళ్ళువుంటేమానుతవి పూర్ణచికిత్స పొందాలంటే వైద్యునిసలహా పూర్తిగా పాటించాలి బాధ కొంచంతగ్గగానే వైద్యశాలకు వెళ్ళడం

(మిగత 31-వ పేజీలో)



# కళ - మహిళ

శ్రీమతి ఎస్. ఎస్. రాజరత్నం

కళ, హృదయాన్ని వికసింపజేస్తుంది. పశుత్వం పోయి మానవత్వం వస్తుందన్నారు పాశ్చాత్యులు. మరి ప్రాచ్యులు భగవంతుని ఉపాసించే సాధనాలలో కళను ఒక మార్గముగా పేర్కొన్నారు. ఈ విధంగా కళ మానవత్వంలో నుండి దేవత్వం సంపాదించడానికి మార్గమైంది. అసలు మానవ శరీరంలో ముఖ్యమైన అంగాలు మూడు. 1 తల, 2 హృదయము, 3 పొట్ట. జీవనోపాధికి పనికివచ్చు కొన్ని పరిశ్రమలు పొట్టనింపుతూ భౌతిక శరీరమునకు వికాసము నిస్తాయి. మరి కొన్ని విద్యలు బుద్ధిబలమును పెంపొందింప జేస్తాయి. కళలు హృదయ వికాసానికి దోహద మవుతాయి. మానవ ఔన్నత్యానికి మూడూ అవుసరమే. మానవాభివృద్ధికి మూడు మార్గములూ ముఖ్యమైనవే.

పాశ్చాత్యులు, 'ఏపనైనా చేయటంలోని నేర్పరితనమే' 'కళ' అని నిర్వచించారు. ఆర్యులు (చతుష్షష్టి కళలు) 64 కళలన్నారు. పాకకళ, చిత్రలేఖనము, నృత్యము, వడ్రంగము, కుట్టుపని వీటన్నిటిని కళలక్రిందనే పేర్కొన్నారు. ఇన్ని కళలలో లలిత కళలు 4 అని వేరుచేశారు. ఇవి సంగీతం, సాహిత్యం, నృత్యము, చిత్రలేఖనము.

కొంచెం ఆలోచించి చూస్తే కళకు, మహిళకు చాల సన్నిహితత్వం ఉన్నట్లు తోస్తుంది. నామ సామ్యమేగాక సహజముగా కళను ఆరాధించే ప్రత్యేక శక్తి మహిళకు ఉన్నట్లు తోస్తుంది. ఇది గ్రహించే, ప్రాచీనులు కళాధిదేవత, సరస్వతిని ఒక స్త్రీగా సృష్టించారేమోనని అనిపిస్తుంది. ఇచ్చట అన్ని కళలను గూర్చి ప్రస్తావిస్తే చాలా గ్రంథం పెరిగిపోతుంది గనుక లలితకళలను గూర్చియే ఆలోచిద్దాము.

లలిత కళలలో మొదటిదైన సంగీతము స్త్రీ సొమ్ము అని చెప్పక తప్పదు. దీనికి మూలాధిదేవత సరస్వతి; ఒక స్త్రీ. ప్రాచీన గ్రంథాలను, పురాణాలను లేక బొమ్మలను గాని చూద్దాము. ప్రాచీన గ్రంథాలలో ప్రళయకాల రుద్రుడు నాట్యమునకు మూలపురుషుడని చెప్పబడి నప్పటికినీ, నృత్యము చేస్తూఉండని శివుని బొమ్మలు, వర్ణనలు చూస్తూ చదువుతూనే ఉన్నాము. కాని వీణ చేతిలోలేని సరస్వతిబొమ్మ ఒకటైన కానరాదు. అసలు స్త్రీ జంత్రముపైగాని మరియే యితర వాద్యముపైగాని ఆధారపడియుండ నక్కరలేదు. ఆమెకు భగవంతు డిచ్చిన కోమలమైన, మధురాతి మధురమైన కంఠముంది. అందువల్లనే ప్రాచీనకాలములోను, ఆధునిక యుగములోను గాయకులకంటె, గాయకీమణులు విఖ్యాత యశులై ప్రజల ఆదరాభి మానములను చూరగొంటున్నారు. ఆంధ్రదేశములో లక్ష్మణదేవరనవ్వు, ఊర్మిళాదేవినిద్ర మొదలగు కొన్ని పాటలు స్త్రీల పాటలు అని పిలువబడుతున్నాయి. కాని మొగవాళ్ల పాటలు లేక పురుషుల పాటలు అనేవి ఎక్కడా కానరావు. ఎవరైనా మొగవారా పాటలు పాడితే "ఏమిటిరా ఆడంగి లేకుల అచ్చన్న" అని హేళనచేస్తారు. స్త్రీల ఔన్నత్యమంతా అడుగంటి స్త్రీజాతి క్షీణదశలోనుండి, అక్షరజ్ఞానమునకు నోచుకోని కాలంలో స్త్రీ విద్యుక్తధర్మాలు, సకల వేద వేదాంత రహస్యాలు, కళామర్మాలు ఆడవాళ్లకు అవసరమైన అన్ని విషయాలను ఈ పాటల మూలముగా తెలిసి కొనే వారు. మగువ మక్కువతో పెంచుతున్న ముద్దుబిడ్డను 'ఎందుకలా ఏడుస్తావు? ఈ ప్రపంచంలో నీకు పోయిహుళక్కి' అని లాలిస్తూ జోకొడుతుంది. ఆటపాటలతో అల్లరిచేస్తూ కాలం గడిపే తన కుమార్తెకు భయంతో కాకపోతే, నయంతోనైనా ఆటలలో ఒక ఆటగా "అమ్మాయికాళ్లకు గజ్జకడితే కుంటమ్మ పెళ్లిళ్లు మొదలైనవి కలిసి రావలెనే" నని భావిజీవితపు సమస్యలను పరిష్కరించే మార్గాలను సూచిస్తుంది. సహజంగా స్త్రీ బాగా కష్టపడి భారమైన

పనులుచేయలేదు. కనుకనే మొలకలు నాటేటప్పుడు, వడ్లు దంపుతూ, కుప్పలు నూరుస్తూ పాటలు పాడుకొంటూ తన బరువును కొంత తగ్గించుకొంటుంది. ఇవన్నీ పల్లెపదాలు, గ్రామజీవనమునకు సంబంధించినవి. ఇవిగాక కట్టు దిట్టములతో సంగీతశాస్త్రాన్ని అభ్యసించి తాన్‌సేన్, త్యాగయ్యల వంటి ప్రఖ్యాత పురుషుల భక్తిలోను, ఖ్యాతిలోను మరి ఎందులోను తీసిపోక కీర్తనలుచేసిన స్త్రీలలో మీరాబాయి ఒకతె. ఈమెయేగాక ప్రతిరాకుమార్తెయును సంగీతశాస్త్రము నభ్యసించెడిదని మన కావ్యములు చూచిన తెలియును. శ్రీహర్షుడు వ్రాసిన నాగానందములో నాయిక వీణ వాయించుచు, జీమూత వాహనునికి కన్పడును. ఆంధ్ర కావ్యజగత్తులలో మకుటస్థానము నలంకరించుచున్న వసుచరిత్ర, మనుచరిత్రలలో నాయికలిద్దరూ వీణవాయించుచూ, పాడుచూ మనకు కనుపించెదరు. ఈ విధముగా యిది విఖ్యాత రాజవంశములలో జనించిన రాజ కన్యకలచే నభ్యసింప బడినప్పటికి ఇది సానులకుగాని సంసారులకు గాదు అనే తలంపు కొంతమంది కలిగియుండుట చాల విచారము.

ఇక సాహిత్యము : దీనికిగూడ అధిష్ఠానదేవత స్త్రీయే. సరస్వతీ ప్రార్థన చేయనిదే చదువు మొదలు పెట్టిన వారుండరు. మనమనస్సులోని భావములను విస్పష్టముగా చక్కగా పరునికి ఎఱుక బరచుటే భాషయొక్క పరమోద్దేశము. ఈ భాషకు కొన్ని వింతలు, సొగసులుగూర్చి ప్రపంచములో మనము కన్న, విను ఘట్టములను వానిలోని మనుష్యుల ప్రవృత్తులను చిత్రించుటే కవిత్వమునకు పరమలక్ష్యము. వీనినన్నిటిని స్త్రీ బాగుగా చిత్రించగలదు. ఇందు చేతనే స్త్రీలచే వ్రాయబడిన కొన్ని కథలు, కావ్యాలు కొంతమంది పురుషులచే వ్రాయబడిన ఉద్గ్రంథాల కంటె చాలా మధురముగా ఇంపుగా ఉంటాయి. వస్తుతః స్త్రీ హృదయము చాల సున్నితమైనది. ఆమె తన విశాల హృదయముతో ప్రపంచములో జరుగుచున్న అన్యాయాలూ, అక్రమాలు చూచి, ఊహించి, అనుభవించి జాలిపడుతుంది. ఒక్కొక్కప్పుడామె కోమల హృదయం ఆవేశానికికూడ గురి అవుతుంది. "ఆవేదనలోనే అమృతత్వం ఉన్నది" అనే మాట ననుసరించి, కోమలమైన భావాలతో, మృదు మధురమైన మాటలతో, అమృతంతో సమానమైన మధువులొలికే, సుధలు గురిపించే గ్రంథాలు బయలుదేరుతాయి. ఇప్పటి కాలములో స్త్రీ విద్యకు ఇంత ఆందోళన చేయవలసి వచ్చినను ప్రాచీనకాలములో స్త్రీలు చక్కటి మేలైన, అవసరమైన విద్యను గురుకులములో నేర్చుకొనేవారని ప్రాచీన గ్రంథాలు చదువుతుంటే గోచరిస్తుంది. దీనికి గార్గి, మైత్రేయి మొదలగు ఋషికన్యల జీవితములే నిదర్శనములు. వీరు బ్రహ్మచారిణులై వేదాలలో కొన్ని భాగములను వ్రాశారని తెలియవచ్చుచున్నది. వీరిలో గార్గి జనక మహారాజు సభలో వెయ్యి గోవుల పందెము పెట్టినప్పుడు యాజ్ఞవల్క్యుని పండితు లెవ్వరూ గెలువ జాలరని తీర్పు చెప్పినది. దీనిని బట్టి ఆ కాలములో స్త్రీలకున్న ఔన్నత్యము, వారికిగల విద్యా వివేకములు, గౌరవము తెలిసికొనవచ్చును. మధ్యయుగములో మొల్ల, రామాయణము వ్రాసి ఖ్యాతి చెందినది. ఇక ఆధునికులలో కొంతమంది, కాంచనపల్లి కనకాంబగారు, గుడిపూడి ఇందుమతీ దేవిగారు మొదలైనవారు కవులలో 'భేష్' అనిపించుకొన్నారు. "కవిత్వంకూడా కాంతల సొమ్మేమో" అని అనిపింపజేస్తున్నారు. దీనిని ధృవపరచవలసిన భారం, భావి భారత నారీమణులపైన ఆధారపడియున్నది.

నృత్యము భారతీయ కళలన్నిటిలోను చాల ప్రాచీనమైనది. పూర్వకాలమున ఈ కళ చాల వృద్ధిచెంది ఉన్నత స్థానము నలంకరించెడిది. సంగీతము మొదట నాట్యములో ఒక అంగముగానుండి క్రమముగా అభివృద్ధిచెంది నాట్యము నుండి వేరైనదని చెప్పబడినది. ఈనాట్యమునకు పురుషుడైన పరమశివుడు మూలపురుషుడైనప్పటికి స్త్రీలే ఎక్కువగా ఈ కళను అభ్యసించెడివారు. ఊర్వశి, రంభాది అప్సరసలందరు నాట్యకత్తెలుగా ప్రఖ్యాతి గాంచిరి. స్త్రీకి దైవమిచ్చిన శరీరలావణ్యము, కోమలావయవములు దీనికి ఎక్కువగా దోహదమైనవి. ప్రతి రాజాధిరాజు ఆస్థానమందు నాట్యకత్తెలు నియమింపబడెడివారు. ఇందువలన ఈ నాట్యము కులటలకు, పురుషుల నాకర్షించుటకు అను చెడు అభిప్రాయము ప్రజాసామాన్యమునందు ప్రబలిపోయినది. కాని సుప్రసిద్ధ రాజవంశమున బుట్టిన కన్యకలు ఈ నృత్యమును నేర్చెడివారు. అర్జునుడు బృహన్నల రూపములో విరటుని కూతురగు ఉత్తరకు నాట్యము నేర్పలేదా? ఇదియే ప్రబల నిదర్శనము. ఈ విధముగనే అనేక రాచబిడ్డలు ఈ విద్య యందు నిపుణులుగా యుండెడివారు. కావున ఇకనైనను

మాసిపోవుచున్న ఈ మహాకళనుద్ధరించి మహౌన్నత్యమునకు దెచ్చుట మన విధి.

చిత్రలేఖనము, పై కళకు ఏవిధముగను దీసిపోలేదు. పూర్వము ప్రతి రాజకన్యయు దీని నభ్యసించెడిది. ముగ్ధలు తమ ప్రియులచిత్రములను తామే వ్రాసికొని వానిని వీక్షించుచు తమ విరహాగ్నిని ఉపశమింప జేసుకొనుట పురాణ గాథలలో పెక్కుచోట్ల గలదు. ప్రభావతీ ప్రద్యుమ్న మను నాటికయందు ప్రభావతి తాను కలలో గాంచిన పురుషుని ప్రేమించి వెతజెందుచుండ నామె చెలి చిత్రలేఖ తన సఖియ వర్ణన ననుసరించి చిత్తరువువ్రాసి అతని అన్వేషణార్థము బయలుదేరెను. శకుంతలను అత్తవారింటికి బంపు సమయమున వనవాసు లొసగిన యాభరణములచేత తమ చెలియ నలంకరింపబోవుచు నననూయ, "మే మింతవరకు భూషణములుపయోగించి యెరుగము. కాని చిత్తరువువ్రాత అలవాటునుబట్టి నీ యంగముల యందు ఆభరణములను అలంకరించెదము" అని పలికెను. ఆకాలమున ఋషి కన్య కలుగూడ చిత్తరువుల వ్రాయుట కలవాటు పడిరని తెలియుచున్నది. పురాణ కథలలోనే గాక భౌద్ధగాథలలో గూడ వొక రాజకన్యక వివాహమునొల్లక చిత్రలేఖన మభ్యసించుటకై యొక భౌద్ధారామమునకువచ్చి అచ్చటనే కొంతకాలము గడిపినట్లు తెలియుచున్నది. దీనిని బట్టి ఆకాలమున ఈ కళ ఎట్టి ఉచ్ఛదశలో నున్నదో ఊహించుకొననగును. పూర్వపు రాచబిడ్డలు సమస్త భోగములతో తులతూగుచున్నను ఉద్యానవనములలో విహరించుటయేగాక ప్రతిచెట్టునకును, లతకును దోహదక్రియ లొనరించినట్లు, వానిని పెంచుటయందు చాలశ్రద్ధ తీసికొనినట్లును చాలకావ్యములలో చెప్పబడినది.

నిజముగా భారతమహిళ జీవనమె కళామయము. ఆమె యొక కళామూర్తి. రేఖాగణితముల కందనినేర్పు తీర్పులతో రంగవల్లుల తన వాకిలిముంగట దిద్దుకొనును. తన పెరటిలో వివిధరకముల పూ ఫలజాతి వృక్షములు పెంచి, ఉద్యానవన కృషిచేయును. వివిధరుచులతో వంటజేసి పాకకళను పోషించును. ఆటపాటలతో దన చిట్టిపాపను నిద్రబుచ్చును. సకల కళలను వ్యక్తపరచు వివిధవస్తువులతో తన గృహముల నలంకరించుకొనును. తాను ప్రకృతిమాత ఒడిలో పుట్టి పెరిగి, తిరిగి ఆప్రకృతిలోని వింతలను సొగసులను చిత్రవిచిత్రముగా చిత్రించుకొనును. ఆమె గృహామే ఒక కళాలయము. ఆమె ఒక కళాస్వరూపిణి. కళనుపాసించుటకు స్త్రీకి ప్రత్యేకమగు, దైవదత్తమగు శక్తికలదు. ఆమెచేయు ప్రతిపనిలోను కళ ఉట్టిపడుచున్నట్లుకన్పించును. ఇందువలననే ప్రాచీనకవులు వనితను ఒక సుకుమార లతికకుపోల్చిరి. తాజ్ మహాలుగూడ కళాపోషకుడు రసికుడునగు మొగల్ పాదుషా హృదయమును చూరగొన్న రాజ్ఞి, మనోజ్ఞమూర్తియగు ముంతాజ్ పేరిట కట్టబడుట చేతనే ఇంత కళావిలసితమై ఒప్పుచున్నదేమో అన్న అనుమానము పొడము చున్నది.

పూర్వకాలమున కళకత్యంత ఉన్నతస్థాన మివ్వబడి నప్పటికి ఆధునిక విద్యావిధానములో ఆంగ్ల శాస్త్రములకున్నంత ప్రాముఖ్యత భారతీయ కళలకు ఇవ్వబడుటలేదు. స్త్రీ కళాశాలలు దేశమునందు తక్కువగుట చేతను, ఉన్నవానియందైనను లలితకళలెక్కువగా లేకపోవుటవలనను, ఉన్నత ఆంగ్ల విద్య నభ్యసించు వనితలు కళలుగాక శాస్త్రములను అభిమాన విద్యలుగ స్వీకరించుచున్నారు. ధనిక, మధ్యతరగతి కుటుంబములకుచెందిన మహిళలు తమవిశ్రాంతి సమయములను ఈకళారాధనకై గడుపవచ్చును. వారుతీరుబడి కాలము వృధాపుచ్చక సద్వినియోగము చేయవచ్చును. ఈకాలములో చేయుపనులే మనుజునకు వ్యక్తిత్వమునిచ్చును. సంసార సామ్రాజ్యమును పరిపాలించు రాణి స్త్రీ. ఆమె ఏయే భావములు అభిరుచులు కలిగియుండునో పిల్లలకుగూడ ఆ భావములే పట్టుబడును. పసిపిల్లలు తమ చిన్నవయసులో చాల చురుకుగానుండి తల్లుల గుణములను గ్రహించుచూ వారివర్తనము ననుకరింప ప్రయత్నింతురు. కావున కళలుద్ధరింపబడవలెనన్న మొదట స్త్రీలకు జాతీయ కళలను గఱపవలెను. "ముదితల్ నేర్వగరాని విద్య గలదె ముద్దార నేర్పించినన్" అను సూక్తి ననుసరించి పూనా యందలి మహిళా విశ్వవిద్యాలయమువారు కళలను విద్యావిధానములోచేర్చి మహిళలకు అభిమాన విద్యలుగ తీసికొనుటకు కవకాశమిచ్చిరి. ఈ విషయమునందు వీరిదే ముందడుగు. తరువాత భారతదేశములోని తక్కిన విశ్వవిద్యాలయములవారు వీరిని అనుకరించిరి. కనీసము స్త్రీ కళాశాలల యందైనను కళలకు ప్రోత్సాహ మీయవలెను. మాసిపోయిన ప్రాచీన భారతీయ నాగరికతను పునరుజ్జీవింప జేయవలెనన్న మహిళలకు సక్రమమైన పద్ధతులలో కళలను గఱపవలెను.

★

# మన సామెతలు

1. అచ్చం తిరుమణిధారి అయితే పుల్ల పట్టడంలోనే తెలుస్తుంది.

2. అందని పూలన్నియు ననంత పద్మనాభ స్వామి కర్పణమనెనట.

3. అన్ని పదార్థములున్న విస్తరి అణిగి యుండగా, ఏమిలేనియాకు యెగిరెగిరి పడినదట.

4 అవలక్షణపుటల్లుని హస్తమున నక్షత లిడగా నవ్వలికి వెళ్లినోటవేసి కొనెనట.

5. అగ్ని హోత్రములో ఆజ్యము పోసి నట్లు.

6. అటయితే వైద్య కష్టము, ఇటయితే వైతరణీ గోదానము.

7. అత్త పేరుపెట్టి కూతురిని కుంపట్లో వేసి నట్లు.

8. అత్త వారింటిసుఖము మోచేతి దెబ్బవం టిది.

9. అదుగో అంటే ఆరునెలలు.

10. ఆలు మగలమధ్య పోట్లాట అద్దము మీాద పెసరగింజ వేసి నంతసేపు.

11. ఆలులేదు చూలులేదు, కొడుకుపేరు సోమలింగము.

12. ఆహారమందూ వ్యవహారమందూ సిగ్గు పడరాదు.

13 ఆశలేనికూటికి ఆకలిలేదు.

14. ఆ సోదిమాటలకు అర్థములేదు, గుడ్డి కంటికి చూపులేదు.

15. ఇచ్చే వాణ్ణిచూస్తే, చచ్చే వాడైనా లేస్తాడు.

16. ఇదుగోపులి అంటే, అదుగో తోక అన్నట్టు.

17. ఇనుము విరిగితే అతకవచ్చును గాని, మనస్సు విరిగితే అతకలేము.

18. ఇంట్లో ఈగలమోత బైట సవారీల మోత.

19. ఉండనిస్తే పండుతుంది, వూడ దీస్తే యెండుతుంది.

20 ఉపాధ్యాయులు ఏమి చేస్తున్నారంటే, అబద్ధాలు వ్రాసిదిద్దు కొంటున్నారు అన్నాడట.

21. ఉపాయము యెరుగనివాణ్ని వూళ్లో వుండ నివ్వకూడదు.

22 ఉప్పుతో ముప్పయిఆరువుంటే వుత్త ముండయినా వండుతుంది.

23. కడవంత గుమ్మడికాయ, కత్తిపీటకులో కువ.

24. కడుపు కూటికి యేడిస్తే, కొప్పు పూలకు యేడ్చినట్లు.

25. కండ్లుపోయిన తర్వాత సూర్య నమ స్కారాములా ?

26. కట్టిన వానికి ఒకయిల్లు అయితే, కట్టని వానికి వెయ్యియిండ్లు

27. కడుపులో లేనిది కౌగలించు కొంటే వస్తుందా ?

28. కోడలుగృహ ప్రవేశము, అత్తగంగా ప్రవేశము.

29 కొన్నది వంకాయ, కొసరినది గుమ్మడి కాయ.

కూర్పు. శ్రీమతి మన్యం కామేశ్వరీదేవి



విరుద్ధ ప్రవృత్తులు తప్పక ఒకళ్ళ నొకళ్ళని ఆకర్షించుకుంటా యేమో అనుకుంటా. నిజంగా చెప్పాలంటే రాజాకి నాకు కలయిక వాటి ఫలితమే అనవలసివస్తుంది. పొడుగ్గా ఆరడుగుల మనిషి, తిరిగీ తిరగని కండలు, కోలమొఖం, అందు దేన్నో వెతుక్కుంటూ అల్లాడిపోయేకళ్ళు చూస్తుంటే నాకే అర్థంకాకుండా ఉండేది. ఈనాడు కూడా ఆతను దేనికో, ఏదో సఫలీకృతం చేసుకోవాలన్న ఆశతోనే, జీవితాన్ని, సంతోషాలు సుఖ దుఃఖాలు, చంపుకుని నిర్జీవ వ్యక్తిత్వం ఏర్పరచు కున్నాడేమో!

ఆ మొదటిరోజుల్లో అనేవాడు. "నువ్వు చాలాభాగం సంసారంలోనుండి పుట్టేవు. దైవం, పూజలు పునస్కారాలు నిన్ను పెంచేయి. ఇట్లావుంటే ప్రపంచకం గురించి ఎప్పుడు ఆలోచిస్తావో" నిజంగా ఆతనన్నట్టు నేను సంసారిని. మా అమ్మ నన్ను ఆదర్శపత్నిగా, తలమానికంలా చెయ్యాలనే పెంచింది. నా అనే చిన్న ఇల్లు దిద్దుకుంటున్నానంటే, అదినాది అన్న భావనలో ఆమరత్వం చూస్తున్నానంటే గొప్పగానే ఉండేది. ఈ చిన్న మూలకిటికీల్లోవుండే దేవుడిపూజలు నన్ను ఆవృతంచేసేవి. దేవుడు లేందే ప్రపంచకంలేదు. దేవుని తెలుసుకుందుకు రాజా ఎందుకు ప్రయత్నించడూ అన్న వూహ.

తీరుబడిగా వున్నపుడు దొడ్లో పూలచెట్లకు నీళ్ళుపోసే దాన్ని. ఇంట్లో రాజా లేనంతకాలం నాకు అదేపని. ఏసమయంలోనైనా అతనుచూడ్డంతటస్థిస్తే "ఇదోపిచ్చి. అసలు నీతల్లో ఇల్లాటి పిచ్చివూహాలు చాలావున్నాయి" అంటాడు. అల్లా అనిపించుకోవడంలో కూడా ఓ సొగసు ఉందేమో అనుకుంటా.

ఆ రోజు కాబోలు! జీవితం దాని పరిణామం, రాచకీయాలు అవి వ్యక్తుల్కి ఎంత హుందా ఇస్తాయో చెపుతున్నాడు. నాకు నిజంగా అవి అనవసరమే! అవి నా జీవితాన్కి ఎందుకూ పనికిరావు. ఒక్కటిమాత్రం నాకు సమస్యగా వుండిపోయింది. ఇరవైనాలుగు ఘంటలూ, ఆ రాజకీయ పుస్తకాలు, వ్రాతలు, లెక్చర్లుఇస్తూ కూర్చుంటే, నా పంథా ఎల్లా ఆలోచిస్తాడా అని. సంసారం అనేది జీవితానికి తుదా? ఇది నిత్యస్వర్గం కాదా అని ..

"రాజకీయాలు నిజంగాజీవితాన్ని నిలబెడతాయా?..."

"నీ ఉద్దేశ్యం?" ఆతను అడ్డుగానే ప్రశ్నించేడు.

"మీ శాస్త్రులు, వాదాలు, అన్నీ భౌతికం. అందులో తలా తోకాలేకుండా, కథంలో ఈగలా కొట్టుకుంటూ, ఏదో చేసేంఅని గొంతెత్తి అరుస్తారు. అసలు మనల్ని నడిపేది భగవంతుడు. కర్మ అన్నదానిమీద ఈ జీవి నడుస్తుంది"

"అంతగా చెపుతున్నావే. నువ్వు ఆదేవుణ్ణిచూచేవా?" నెమ్మదిగా ఆస్వరంఉన్నా, హేళనఉండింది. నాకు కోపం ఒచ్చింది. "మీకువలె నేను పట్నవాసాల్లో పుట్టలేదు. ఈ రాజకీయాలు, అంతఃకలహాలు నాకు తెలియవు. ప్రకృతి సౌందర్యంలో, ఆ ఆనందంలో, విశాల దైవలీలల్లో నేను పెంపబడ్డా. పెరిగే. నేను నా భావనలో దేవుణ్ణి చూడగలిగేనేమో..."

నవ్వేడు. ఈ కోణలిలోనుండి ఆలోచన అన్నదే అతనికి నవ్వులాటగావుంది. అది అక్కర్లేని విషయం. పిచ్చి. క్షణికం ఆలోచన కల్గినా దాన్ని క్రూరంగా చంపేసేడేమో అని తోచింది.

"భగవద్గీత చదవలేదా?"

"ఎందుకూ"

ఈ నాస్తికుడికి ఏం సమాధానం ఇవ్వనూ?

"జీవితంలో భగవద్గీత చదువుతూ కూర్చుంటే, మానవునకు చైతన్యం ఒస్తుంది. దేవుడువచ్చి మనల్ని స్వర్గానికి తీసుకు వెడతాడు కాదూ?"

ఏం చెప్పనూ? దూరతీరాల్ని ఎల్లాచూడను? లేచి వెళ్ళుతూనే "దేవుడునన్ను పాపిగా ఎంచి నరకాన్కి తీసుకు వెళుతాడు. నువ్వు .."

వెళ్ళిపోయేడు. కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి. జీవితం ఇల్లా గడచి పోవలసిందేనా? కళ్ళు తుడుచుకుంటుంటే హృదయం గోలెడుతోంది. సందిగ్ధం...?

ఇల్లా జరిగినా ఆరాత్రిళ్ళు దగ్గరగా, తీసుకున్నపుడు మాత్రం 'సుందరీ! నువ్వులేకపోతే నేను లేనేమో!' అని రహస్యంగా అనేవారు. చుట్టూరావున్న ప్రకృతి రహస్యంగా మైకంపోసేది. అతని కౌగిట్లో మర్చిపోయే, ఏదో హృదయం సంగీతం పాడేది.

* * * *

మా పెళ్ళిఅయి సంవత్సరం గడిచిపోయింది. మొదట్లో మా ప్రవృత్తులు ఒకళ్ళనొకళ్ళు విమర్శించుకొన్నా, రోజు రోజుకూ అది రాజాలో ఎక్కువేఅయ్యేది. ఆ సమయాల్లో నేను చెప్పినది సమంజసంగా వుందా లేదా, అని నిలబెట్టి ఒప్పించే స్థితికూడా ఒచ్చేది.

లోపలమాత్రం నాకు బెంగగానే వుండేది రాజా విషయంలో! నన్ను వెగటుగా "అందులో, ఇందులో నువ్వు దేవుణ్ణి చూస్తున్నావు కాబోలు" అనడం తప్పేదికాదు. ఆఖరికి—అది ఏపువ్వుల్ని కోసేటప్పుడైనా, కూర పోపు పెట్టేటప్పుడైనా సరే...

ఆ పండక్కి లక్ష్మివచ్చింది. వూచలావున్నా, చలాకీగా వుండే ఆమెనుచూస్తే నాకు ఆనందంగా వుండేది. చేస్తున్న ఉద్యోగం శలవుపెట్టి నన్ను చూడడానికి వచ్చింది.

ఆరోజు అంతాకలిసే భోజనం చేస్తున్నాము. లక్ష్మి నవ్వుతూనే నా వంటకాలని మెచ్చుకుంటోంది.

నవ్వుతూనే "సుందరి వంటింటి మహాలక్ష్మి."

"పిల్లలువుంటే కలకల్లాడే లక్ష్మిలాగే వుంటుంది" వాలుగాచూస్తూ లక్ష్మి.

"పిల్లలూ! సంసారం పిల్లలనే జిగురుతో అంటించబడ్డం అనేది నాకక్కర్లేదు. అది మూర్ఖత్వం"

రాజా ఇల్లా అనడం నాకు కోపమే వచ్చింది. బాధ కల్గింది.

"భార్యకావాలి కాని పిల్లలక్కర్లేదు" నాలో విప్లవం.

"పిల్లలు. వాళ్ళనుగురించి ప్రపంచకం, వంశం నిలబెట్టేం అనుకుంటారు. అంతకంటే క్రూరత్వం ఇంకోటి లేదేమో! ఈ స్థితిలో వాళ్ళునిజంగా ఆటంబాంబు లాంటివాళ్ళు."

లక్ష్మి ఖంగారుపడింది, మాలోని ఘర్షన ఎక్కువౌతుందేమో అని. నాకుమాత్రం ఆక్షణంలో పిల్లలు ఉంటే-ఆశ ఆవరించింది. ఏదో మధురత ఉన్నట్టేవుంది...

వెళుతున్నప్పుడే లక్ష్మిఅంది. 'నువ్వు నీ 'స్వం' కోసమే ప్రాకులాడుతున్నావ్. కోణంలో నువ్వు ఆలోచించావా? ఈనాడు రాజా ఇల్లా మారాడంటే ఎందుకో అని వూహించేవా?' అంది.

ఆతలంపు నాకు అట్టేకాలం వుండనేలేదు. రాజా రాజకీయ పనులమీద ఊళ్ళోతిరుగుతూనే ఉన్నాడు. ఆ అలసిపోయిన శరీరంను ఇంకా శ్రమపెడుతూనే ఉన్నాడు. ఏదో సమయంలో రావడం, వెళ్ళడం గూడా జరిగిపోయేది. ఆ రాత్రిళ్ళల్లో మనసారగా మాట్లాడాలి. ఏదో అనుకునే దాన్ని. కాని అది అతీతం అయిపోయేది.

ఆరోజు సాయంత్రం తిరిగి వచ్చేడు. కళ్ళక్రింద నలుపు నిద్ర లేదన్నట్టేవుంది. బడలిన మొఖంలో బాధ కన్పిస్తోంది. ఒళ్ళు చూచే నిప్పులు కాగుతోంది. పడుకోమని డాక్టర్ను పిలిచే...'విశ్రాంతి' చెప్పేడు ..

'మా వూరు వెళదాం'

'ఆ పల్లెటూరా?'

"మీకు శాంతి, విశ్రాంతి, ప్రకృతి ఇస్తుంది. అందులో..."

"ప్రకృతి! కాపురం ఉండడాన్కి మనుషులు కరువైనందున, దుబ్బుగా పెరిగిన ముళ్ళపొదలు, డొంకలూ ప్రకృతా? అందులో దేవుడు అందం మలచిపెట్టేడా?..." అయినా.

ఇద్దరం వెళ్ళేం. పెట్టెలనిండా పట్టలేనన్ని పుస్తకాలు కుక్కి ఆయన బళ్ళునింపేడు. నాకుమాత్రం అది ఓర్చుకోలేని విషయమే అయ్యింది, ఈ అనుకుని, ఆశించుకున్న

విశ్రాంతి రాకుండా చదువుతూ మరింత దిగనారుతాడేమో అని.

గడబిడగావుండే పట్నం వాసనల్లోనుంచి, ఊగేచెట్లు, పసిరిక వాసనల్లోకి వచ్చినందుకు నాకు సంతోషంగావుంది, పుట్టి పెరగడం, అల్లాంటి వాతావరణాల్లోనే కాబట్టి. ఈ పొలాలు, దూడలు, సాయంత్రపు సంధ్య, ఇంట్లో పని పాటలు చూచుకోవడంతో మునిగిపోయే. విముఖతతో, తప్పని సరిగా వచ్చిన రాజాని ఆతని వూహాలకు, చేతలకు పూర్తిగా వదలివేసే. ఈనాడు నాలో నిబిడీకృతం అయిన సౌందర్యపిపాస, దైవత్వ ఉపాసన, నేను బోధించడానికి ప్రయత్నించలేదు. కాని ఒక్కటే—రాజా అనుగుణ్యంగా తన వాతావరణాన్ని అనునయం చేసుకోగల్గుతాడన్న ఆశ.

రోజూ సాయంత్రం గోదావరి ఒడ్డుకు వెళ్ళేవాడు. ఇంటికి తిరిగివచ్చే పశువులు, అస్తమిస్తున్న సూర్యుడు, వచ్చే చల్లగాలి ఇవి చూస్తూంటే అతను ఆలోచించేవాడు. ఆలోచనలు క్రియారూపం లేకుండా ఉండం పిచ్చి ఎత్తినట్లే ఉండేది. ఆ అశాంతిలో ఆతను చిరాగ్గా వుండడం నాకు తెలుసు.

నేను ఆవూళ్ళోకి వచ్చేనని, చాలామంది చూడ్డానిక్కి వచ్చేవారు. రాజాకి పరిచయంచేసే. ఈ తోచని విరక్తి సమయాల్లో వాళ్ళతో కలసి, ఈ పల్లెల్లోకి వెళ్ళేవాడు. ఈ వెళ్ళడంలో మొట్టమొదట ద్వేషం చూపించినా, క్రమేణా ఓవిధమైన ఆసక్తి కలగడం నాకు సంతోషంగానే వుంది.

ఆ రోజుల్లోవచ్చి, 'ఈనాడు నేను సముద్రంలో ఉండే జంతుజాలాన్ని అంతాచూచివచ్చేను' అనో, 'వాళ్ళు కోత కోస్తున్నారు, వీళ్ళ ఆవు ఈనింది, వాళ్ళు తమ తగాదాలను పెద్దల దగ్గర ఇల్లా తీర్చుకున్నారు. నన్నుకూడా మధ్యవర్తిగా వుండమన్నారు' అనో చెప్పేవాడు. ఆ చెప్పడం, నేను ఇంకా వినాలనే ఉండేది.

ఇవన్నీ నాకు తెలియని సత్యాలుకావు. ఈ పట్నంలో పుట్టి, మురికిరాజకీయాల్లో నాయకుల్కి, ఆనామకులుగా ఆస్థి పాస్తుల్ని అమ్ముకునే జీవనానిక్కి, అలవాటుపడ్డ వ్యక్తుల్కి, అసలు జీవనం అంటే ఏవిధంగా వుంటుందో తెలుసుకోడం కూడా వింతగానే వుంటుంది. ఈ పల్లెలు అంటే ఏం దాచుకున్నా యెక్కడా తెలియక ఉండడం మూర్ఘత్వం అవుతుందేమో!

రోజులు గడుస్తున్నాయ్! తనకి తీరుబడి లేకుండానే పనిచేస్తూవుండేవాడు. అందులోతృప్తి—కళ్ళక్రింద నలుపు, ఎముకలు కప్పడం, రక్తపు ఎరుపు మార్పు తెచ్చింది. ఆ మొఖంలో ఆలోచన ఇప్పుడు మాయమైంది. ఆధారం, జీవితం అన్నది ఇప్పుడు తెలుసు కున్నాడా అనిపించేది.

ఆరాత్రి ఇద్దరమూ ఏదో చర్చించు కుంటున్నాం. వాదోపవాదాలు ఎక్కువగానే జరిగేయి. కానీ నాకే ఉండుండి నవ్వు ఆగిందికాదు. కారణం మే మిద్దరం ఒక్క పంథాను గురించే దెబ్బలాడుతున్నాం.

"ఎందుకు నవ్వుతావ్"

"మనం ఇద్దరం చాలా విషయాల్లో ఏకమైపోతున్నాం."

ఆతను ముఖం వంచుకునే "నీ పల్లెటూరి ప్రపంచకాన్ని నామీద రుద్దుదామనుకున్నావా?"

"నేను ఒక్కవిషయం మీమీద పెట్టలేదు. చెప్పలేదు. మీరే మారేరు. ఆ మార్పు ఎంత పెద్దదైనా, చిన్నదైనా నే నెల్లా కారణం"

"అందుకే నువ్వు నన్ను మీవూరు తీసుకువచ్చేవా?"

"మీ ఆరోగ్యంకు వచ్చేం."

ఆతను కళ్ళల్లోకి చూచేడు. కిటికీలో నుంచి బయట గులాబీలు తలలూపుతున్నై. మెట్లు ఎక్కుతున్న పెద్దకాపు కిర్రు చెప్పులు శబ్దం చేస్తున్నాయ్ తంబురా లా!"

* * * *

ఆ వేసవి ప్రారంభలోనే మశూచికం వచ్చింది. ఆ రోజుల్లో మాకు నిద్రే ఉండేదుకాదు. ఇద్దరం, ఈ పల్లెలో చాకిరీచేసేం. నిజంగా అది హృదయాల్లోనించివచ్చిన త్యాగమేమో! ప్రేమ...

ఈ అస్పృశ్యుల ఇండ్లలోకికూడా మేం వెళ్ళడం ఆశ్చ

ర్యంగా ఉండేది. వాళ్ళు భయపడేవారు. ఆనాడు నాకు నవశక్తిని పోసినవాడు రాజా ఏమో అనిపించింది. మాఫలం అన్నా, దైవఇచ్ఛ అన్నా ఆరోజులు మాకు దక్కాయి.

ఆ జాతర్లో, రాజాకూడా పాల్గొన్నాడు. నాకే ఆశ్చర్యం కల్గుతోంది. ఊరవతల కుంభంపోసి దేవతని సాగనంపి ఇంటికి వచ్చేం.

ఆ రాత్రి, చల్లని వెన్నెట్లో, నక్షత్రాలు మిణుక్కు-మంటున్నాయ్. నా ప్రక్కగా కూర్చున్నాడు రాజా, పడినశ్రమని, చల్లటి గోదావరిగాలి ఆరుస్తోంది.

నడుంమీద చెయ్యి వేస్తూనే 'సుందరీ! నేనే పొరపాటు పడ్డానేమో! ఫలితంలేని జీవనం నాపట్నుం ఆశలు భగ్నమయ్యే త్యాగం అది. కాని ఈపల్లె జీవితాన్ని మెరుగులే పెడుతుంది. నేనే పొరపడ్డానేమో రాజకీయాల్ని గురించి. ఈ మానవసేవలోనే దైవం తనకృపల్ని కలిపి వున్నాడేమో! ఇదేనా నిజమైన జీవితం," అన్నాడు.

కళ్ళమ్మటనీళ్ళు ఆనందంలో క్రమ్ముకున్నై.

"లక్ష్మి చెప్పినమాటలు జ్ఞాపకం ఉన్నాయా?"

"నిజంగా!" సిగ్గుపడ్డా. ఆ కండలు తిరిగి, శాంతతలో ఉన్న ఛాతీమీద ఆనుకునే, ఆతని కౌగిలిలో కరిగిపోయే.

కన్నీళ్ళు, ముత్యాల్లా బుగ్గలమీద పడ్డాయి.

"రాజా! అమరంలో ఉన్నావా?"

"సుందరీ!"



# కాలవాహిని

తరుణి రాతిరి కురులలో నిరుల సారిది
ప్రీతి నిదురించు పసిమది పీడ కలలు
కాలుకీలల కార్చిచ్చు కాల మిపుడు
నానిపోయిన పొరటల నాటిమాట

మొగ్గతొడుగదు చిగురించి మొండిమ్రాను
గొంతు సవరించి పాడదు కోకిలమ్మ
నిదురవదలదు; కదులదు నిదురమత్తు.
నిదుర కంకిత మయ్యెనే నేడు వీడు?

తెలుగు వెలుగుల విలసిల్లి యలరు నాడు.
తెలుగు కోకిల క్షీరాబ్ధి చిలుకు నాడు
తెలుగు చెట్లన్ని చిగిరించి చెలగు నాడు
రేపెవచ్చెడి నానాడు ప్రియసఖుండ.

శ్రీ గుంటపల్లి రాధాకృష్ణమూర్తిగారు



# జ్యోతిర్మయి

శ్రీ పొత్తపి సుధేష్ణగారు.

అవును. ఆ మూర్ఖపువెధవ దామోదరానికి తగినశిక్షే ప్రాప్తించింది. యౌవనగర్వం కాకపోతే మరేమి?—ఏగాలి కాతెర నెత్తక, బీదవాళ్ల నుద్ధరించాలట-వర్గభేదాలు నిర్మూలించాలట-ధనికవాదాన్ని దగ్ధంచేసి, దాని స్థానమున 'కష్టే ఫలే' అనువాదం వ్యాపింప చేయాలట-అప్పుడేనట మన చదువు సార్థకం పొందేది...ఆ, ఏడ్చాడు! నే నెంతో చెప్పిచూచాను "నీకీ రాజకీయాలలో జోక్యంవద్దు. ఇంటిదగ్గర సేద్యంచూచుకోరా" అని. మిత్రునిమాట వినని ఫలితం ఈ నాడైనా బందిఖానాలో గుర్తించియుంటాడు దామ. శిక్ష తప్పించాలని నేను ఎంత ప్రయత్నించినా సాగలేదు. "పబ్లిక్ ప్రాసిక్యూటరుని—కాబట్టి ప్రభుత్వం చర్యలు అసంబద్ధంగా కనుపించినా, సమర్థించవలసిన బాధ్యతనాది—అని ఒక క్షణం-మరుసటి క్షణం—"నేనుకూడా కమ్యూనిష్టునేమో! అందరు తమ హృదయాలలో సామ్యవాదులే-కాని దాన్ని బహిరంగంగా చెప్పడానికి వలసిన గుండెధైర్యం అందరిలో యుండదు"—అని ఆలోచించాను.

నేను, దామోదరం కళాశాలలో సహాధ్యాయులము. నేను చట్ట పరీక్షలలో ఉత్తీర్ణుడనై న్యాయశాఖలో ప్రవేశించాను-అతడు దేశసేవకు డయినాడు.

మా ఇల్లు, మా గ్రామమైన పెంటపాడులో రాజభవనం. మాకు అంత గొప్ప భవనాలే ఆ ఊళ్లో నాలుగైదున్నాయి. చెరకుపల్లెవారు ఆ పరిసర గ్రామాలలో దాతృత్వానికి ఖ్యాతి చెందిన రెడ్లవంశము.

దసరా పండుగకు కోర్టునకు సెలవగుటచేత పెంటపాడు వెళ్లాను. మామేడపైనుంచి తిలకింపదగిన ప్రకృతిశోభను, కాళిదాసు, పోతనవంటి మహానుభావులే అనుభవించి ఉద్ఘోషింపగలరని భావిస్తాను. ఇంట్లో నా నివాసం మేడ. కాఫీతో సహా అచ్చటికి రవాణా కావలసినదే.

అది సంధ్యాసమయము. నక్షత్రాలకు గగనంలో పందెములు జరిగాయేమో. విజయాన్ని పొంది గమ్యస్థానాన్ని చేరగలిగినకొద్ది తారామణులు మాత్రం గోచరిస్తున్నాయి. ఉదయాన వనపంచను వదలి వెళ్లిన పిట్టలను ఆహ్వానించడానికి, వృక్షాలు నృత్యగానాలలో మునిగి యున్నాయి. (ఇంకా ఎంతో గొప్పగా వర్ణించవచ్చు-నాకూ, కవితకు చాలా దూరము సుమండీ!) నేను ప్రేక్షకుడను మాత్రమే. చూచిన దృశ్యాన్నిగురించి ప్రశ్నలొస్తే, జవాబివ్వడానికి మాటలురావు. డాబామీద తిరుగుతూ, చుట్టుపట్లనున్న చెట్లు, పక్షులు, పువ్వులు, ఆకాశం, మార్పుచెందినాయేమోనని గమనిస్తే, అంతా తారుమారే. మొగ్గ తొడిగియుండిన చెట్లు పుష్పించాయి. పుష్పించియుండిన చెట్లు ఫలించాయి.

ఈవిధంగా పచారుచేస్తూ నేనాలోచించిన విషయాలేమీలేవు. ప్రకృతి సౌందర్యోపాసకుడనయినాను. ఇట్టిపరిస్థితిలో మా రంగయ్య బండి ఇరుసుల 'కిఱ్ఱు', 'కిఱ్ఱు' శబ్దము నా చెవులలో పడినది. ఆ ఒంటెద్దుబండి మా మేడముందు క్షణకాలమాగినట్టుంది—మరుక్షణమే ముందుకు సాగింది. నాన్నగారి కోసరం ఎవరైన వచ్చి వెళ్తున్నారేమో అని-దాన్నిగుఱించి మరి ఆలోచించడం విరమించాను.

బండి నే నూహించినట్లు వీధిమలుపుతిరుగలేదు. (డాబా నుంచి మా వీధి, మొదటినుంచి చివరదాక అగుపిస్తుంది.) ఇంతకూ, నాకు మొదటిలో ఏదో వంగపూరంగు అంచు కనిపించితే, బండిలోనున్న వ్యక్తి స్త్రీయేనని సులభంగా తేల్చగలిగాను. మా ఊళ్లో బండిరావడమేకదా వింత. అందువల్ల వీధినున్న పిల్లలందరు బండిచుట్టుమూగి, అందలి వ్యక్తిని తేరపారి చూచారు. కొద్దిగ చీరరంగు అగుపించింది. "నీలిరంగు-బ్లూబెల్ పూరంగు-అవును-తెలిసింది-నా ముద్దురంగు-వంగపూరంగు, బ్లూబెల్‌పూరంగు ఎవరి అత్యంత ప్రియమైన వర్ణములో-ఆమెకు ఈ రంగులంటే ప్రాణంకదూ?"—నా ఊహాలహరి, బండి వీధికొననుంచి వెనుకకు మరలి మావీధి మరల ప్రవేశించిన చప్పుడుచే చెదిరిపోయింది.

ఈ పర్యాయము, బండిలోని వ్యక్తి వెంట్రుకలు జీడి

గింజలాగ నల్లగ ఉన్నాయనీ, జడ త్రాచులాగ పొడుగుగ నున్నదని గ్రహించాను ..సందేహములేదు...ఆ వెంట్రు కలు, ఆ చీర ఆమెవే...కానీ వ్యక్తిని పోలిన వ్యక్తులెంద రుండడము లేదు ?—అంతేకాక-ఆమె ఈ పల్లెటూరికెందు కొస్తుంది-బంధువులుకూడ లేరాయె-రైలుస్టేషన్ కాదు-మోటార్లుపోయే మార్గంలోనులేదు..." ఈలాగ నా ఊహలు ఎన్నో దిక్కులకు పోయినవి.

బండి మళ్లీ మా ఇంటిముందాగింది. మా ఇంటికే చుట్టా లెవరో వచ్చియుంటారని ధృఢీకరించాను. మేడ దిగవలెనంటే స్వాభావికముగ నాకు చాల బద్ధకము. నా సందేహనివృత్తి కోసరం, తిన్నగదిగి, అనేక గుమ్మాలుదాటి అవతలనున్న వరండా ప్రవేశించి చూచిన దృశ్యము కలయా అని పించింది.

నా జ్యోతిర్మయియే ఆమె-నిస్సందేహంగా నే-అదేనవ్వు అవే చూడ్కులు-ఆమెపట్ల కాలఘాతం తన ఔద్ధత్యాన్ని ప్రదర్శింపలేక పోయింది. తలవని తలంపుగ మా ఇంటికే తెంచింది. అట్టి నా జ్యోతి కేలాగ స్వాగత మివ్వాలి-ఆమె పట్ల నేను చాలాఅన్యాయ మాచరించాను. (అది ఒకరామా యణ మవుతుంది-ఇంకొక పర్యాయము సావకాశముగ విన్న విస్తాను.)

నానోట మాటవెలువడలేదంటే మీరునమ్మాలి. వరండా కంబమును ఆనుకొని నిల్చున్నాను. నా వకీలు వాచాలత, సమయస్ఫూర్తి అప్పుడు మాయమైనాయి. ఆమెకు సామా నేమీ ఉన్నట్లు కనుపించలేదు.

కడపట—" జ్యోతీ ! "...అనిమాత్రం నా నోటినుంచి వెలువడింది. అప్పుడే అయస్కాంతమువలె ఆమె కంఠ మం దలి నల్లపూసలపేరు నా నేత్రాలను ఆకర్షించింది. నా అను మానమును ఈ సంఘటన మరింత బలపరిచింది—జ్యోతి నా మాటపాటించి పెళ్లిచేసు కొన్నదికదా అను విషయము-మరొకవైపు నిస్పృహ అదేస్థలాన్ని ముట్టడించింది.

" జ్యోతీ "— అని పిలవగనే ఆమె ముఖములోని వికాసం ఇనుమడించింది—" నేనే "నంటూ ఆమె విస్ఫారిత నయనాలతో బదులు పలికింది.

" ఎక్కడనుంచి రాక ? ఎప్పుడొచ్చావు ? మా ఇంట్లో ఉంటావా ?..." మొదలగు ప్రశ్న పరంపరలచే ఆమె మన స్సును నింపాలనిపించింది—ఎంత ప్రయత్నించినా, వాక్కులు నోట్లోనే అంతరించేవి. వివాహమైనదని ఎఱిగినంతనే, 'నీవు' అని సంబోధించాలా, 'మీరు' అనవలెనా- అన్న మీమాంస తేల్చడానికి కొన్ని క్షణాలుపట్టింది.

ఇంతలోపుగ బండివాడికి కిరాయిచ్చి పంపేసివచ్చి తన స్థానంలో-వీధి అరుగు ఆనుకొని నిలబడింది జ్యోతి.

" లోపల నాగదికిపోదామురండి "-అని తడబడేమాటల్తో వణికే కంఠంతో, కంపిత హృదయముతో, గద్గదస్వరముతో పలికాను.

" నే నేనాటికి 'నీవు' కానీ 'మీరు' కాదండీ— అని ఆమె నవ్వుతు జవాబిచ్చింది. మునుపటికంటె మనిషి సన్నగించి నట్లుగుపించింది.

మేడపైకి దారితీసాను. నౌకర్లందరు తలొక పనిలో నిమగ్నులైనందువలననో-మరెందుచేతనో, ఆమె రాకని గమ నించినట్లు కనుపించదు. వీధిలో మూగినట్లు, మా ఇంట్లో ఎవరికి ఆమె అడుగుల సవ్వడియైన తెలిసినట్లులేదు. ఆమె నా వెనకాలే వచ్చింది. మెట్లు ఎక్కుతున్నంతసేపు ఏమని పలుకరించడానికి పాలుపోలేదు.

నాగది ప్రవేశించాము. ఒకకుర్చీలో ఆమెను కూర్చుండ నియమించి, మరొకదానిని ఆమె కెదురుగ లాగి, నేనం దులో కూర్చున్నాను. అనిర్వచనీయమైన, దురవగాహమైన బాధనా హృదయాన్ని కలతపెట్టింది. ఇదివరకు గంటలతర బడి మాట్లాడుచుండిన నేను, ఆమెను గుఱించిన మధుర భావాలతో మనశ్శాంతి పొందుచుండిన నేను, ఈ రాత్రి ఎదుట కూర్చుని ఆమె కళ్లలోకి నిర్దోష చూడ్కులతో పరికించాలంటే జంకు కలిగింది. ఆమెతో సంభాషించడమే, ఆ రోజులలో మహాపుణ్యంగ భావించేవాణ్ణి. ఆమె సమీ పంలో నున్నంతసేపు తన్మయత్వము పొందేవాణ్ణి. ఈనాడు ఆనంద తెమ్మెరలు మాటు మణిగాయి.

నా ప్రకనున్న రౌండుటేబిల్ మీద, 'ఉమర్ ఖయాం' పద్యసంపుటము, 'ఏకాంతసేవ'- కొన్ని వార్తాపత్రికలు పడి

యున్నాయి. ( మా గ్రామములో గ్రంథలోకమే నా సన్నిహితులు)

ప్రణయమా! నీవు నేనును విధితో గలిసి,
సృష్టివిధానము నెల్ల వశముగాంచ .....

అను పద్యం గోచరించింది. ఒకప్పుడు జ్యోతీ నేను ఆ విధంగ తలపోసిన వాళ్లమే. విధి మమ్మల్ని వేరు చేసింది. మా ఆశాభవనం పునాదితో సహా నేలవాలింది.

"ఎన్నాళయింది జ్యోతీ నిన్ను చూచి-ఈ విధంగా మా గ్రామాని కొచ్చావెందుకు?—నా హృదయం గడచిన నాలుగేళ్ల నీ ఇతిహాసాన్ని వినడానికి ఆత్రపడుతున్నది-" అన్నాను గ్రంథంలో మరొక పుటను తిరగవేస్తూ.

నా మచ్చిక హోరి పిచ్చుక, గదిలో నూతన వ్యక్తిని గాంచి తుఱ్ఱున ఎదుటి కిటికీగుండ పారిపోయి, సమీపములో దేవగన్నేరు చెట్టుకొమ్మపై కూర్చుని నన్ను పిలువసాగింది.

"అవును—నాలుగు దీర్ఘ సంవత్సరములు గడిచాయి. మీలో ఎంతో మార్పు కలిగినట్టున్నదండీ,"—అని జ్యోతి జవాబు.

"లేదు. నేను పాతకాలము వాడినేనుమా-బాగా పరికించు"—అన్నాను ఏమి బదులివ్వడానికి తోచక.

మరు నిమిషమే "నీవు వస్తున్నట్లు ఉత్తరమైన వ్రాయ లేదేమి జ్యోతీ"—నా కుర్చీని మరికొంచము సమీపానికి లాగుతూ ప్రశ్నించాను.

నే ననుకొనిన బదులే వచ్చింది జ్యోతి నోటి వెంబడి—"మీ రిక్కడే ఉంటారని కలగన్నానా? లేక మీ బాగోగులను గురించి నాకేమన్నా తెలిపారా?"—ఇది నా తప్పే అవమానముతో తల వంచాను.

తరువాత ఐదునిమిషాలు మాలో ఎవరు మాట్లాడ సాహసింపలేదు. జ్యోతి కిటికీలోనుంచి వెలుపలి నిశ్చల గగనములోనికి చూస్తూ, తారకలతో నిస్తబ్ధహృదయంతో సంభాషిస్తున్నది.

జ్యోతీ ఎవరు-ఆమెకు నాకుగల సంబంధమెట్టిదని—మీమనసులలో ఒక సవాలు కలుగవచ్చు. క్లుప్తంగా ఆమె చరిత్ర చెప్తాను.

జ్యోతి—పూర్తి నామధేయం, జ్యోతిర్మయి. కళాశాలలో మొదటి పర్యాయము పేరు విన్నంతనే, ఆ పేరు గల వ్యక్తితో పరిచయము కలుగ చేసుకోవాలనిపించింది. కానీ నే నందరి విద్యార్థుల లాగ ఊరుణ్ణి కానందు వలన—ఈ అవకాశము కోసరము రెండు సంవత్సరాలు వేచియున్నాను. (అంతా నగ్న సత్యం సుమండీ!)—ఏలాగో మా ఇరువురిమధ్య క్రమంగా సుహృద్భావ మేర్పడింది. ఒక ఏడాది గడిచే టప్పటికి, నేను ఏదో అపవాదాలను జ్యోతిర్మయిపై మోపి-ఆమె సున్నిత హృదయాన్ని గాయపరచాను. రక్తచారలు నేటికిని మాయలేదనుకుంటా. (గతించిన దానికి ఇప్పటికిని వితర్కిస్తున్నాను-పశ్చాత్తాపపడుచున్నాను.) మా ప్రణయ నౌకను చేతులారా జలధిని ముంచి, సురక్షితంగా నేనుమాత్రం గట్టెక్కినానని సంతోషించినాను. కొద్దిరోజులు మాత్రమే ఉన్నదీ ఆనందం. (ఇంత సులభముగ జ్యోతి ప్రేమ బంధాలనుంచి విముక్తి పొందానన్నది.) ప్రపంచములో వస్తువ విలువ దానిని గోల్పోయినప్పుడు గానీ, స్పష్టంగా తెలియదు. జోతిర్మయికి క్షమాపణ వేడుతు ఉత్తరాన్ని వ్రాస్తామనుకొన్నాను. కానీ ఆమె పోకడ తెలియలేదు. ఆమెని కలసికోవాలన్న ఉబలాటం రోజుకు రోజుకు ఎక్కువగుచుండెను. జీవితములో నే నెఱిగిన స్త్రీ ఆమె ఒక్కతే—'జ్యోతి' సార్థక నామధేయ-నా జీవనజ్యోతి-మరల ఈ రాత్రి నా గృహములో సహజదీప్తితో ప్రకాశించడాని కేతెంచినది.

ఇంత సేపటికి బయట వీధులలో మినుకు మినుకు మంటున్న దీపాలు వెలిగింపబడినాయి. నౌకరొకడు నా గదిలో దీపాన్ని పెట్టి, జ్యోతిర్మయిని చూచి, ఏమో ఆలోచిస్తూ దిగిపోయాడు. చాల చీకటిపడింది. దీన్ని నౌకరు దీపం తెచ్చేంతవరకు గుర్తించలేదు. (నా జ్యోతి యుండెకదా—గదినికాదు, భవనాన్ని కాదు- నా జీవిత ధాత్రినే జ్వలింప చేయడానికి)

"జ్యోతీ, నీకుపెళ్లిఅయి ఎన్నాళ్లయింది. ఆహ్వానమైనా లేదే"—అని అడిగాను. ఈప్రశ్న వేయడానికి నాకుగల అర్హతను తర్కింప ప్రారంభించాను. ఆమె ప్రసాదించిన

ప్రేమరసాన్ని-కలికతోసహా విసరివేసిన పిదప నాకు అర్హత ఎక్కడిది ?

"ఏదో ఆ తంతూ ముగిసింది. మా తలిదండ్రులు ధన్యులైనారు. అప్పుడే ఏడాదయింది."-ఇంతవరకు గంభీరముద్ర దాల్చిన జ్యోతి వదనములో విషాదరేఖలు కనిపించాయనుకున్నాను. ఒకటి రెండు జలబిందువులు మృదువైన చెక్కిళ్లనుంచి జారి-అప్రయత్నముగ-చేతులలో యుండిన "ఆంధ్రపత్రిక"పై పడినాయి. వాటిని నిరోధించడానికి జ్యోతి బ్రహ్మప్రయత్నముచేసి విఫలమైనట్టు కనుపించింది.

ఒకనిమిషమాగి మరల ప్రారంభించింది.

"మీ జ్యోతికికాదు అయినది పెళ్లి—జ్యోతిర్మయికి—పెళ్లైన పిదప నాకు శాంతిలభించిందా-అనేది మీ తరువాతి ప్రశ్న కావచ్చు. ప్రేమకు, పెళ్లికి వున్న తేడా మీకు తెలిసినదే. అలాంటిదే నా పెళ్లి"—పైటచెంగుతో చెక్కిళ్లు తుడుచుకొనెను.

"నాభర్తపేరు-కేశవచంద్రుడు. ఢాకాలో పట్టుబట్టల వ్యాపారము చేస్తున్నారు. నేనంటే అమిత విశ్వాసమాయనకు-కానీ నేనెంత ప్రయత్నించినా, మన మానసిక వలపును విస్మరింప లేకున్నాను."

వంటవాడు వెంకయ్య—"పెద్దయ్యగారు మిమ్మల్ని భోజనానికి రమ్మంటున్నారు, రామయ్యా"—అని వార్త తెచ్చాడు. చేతిగడియారముచూస్తే ఏడున్నర అయినది. మా నాన్నగారికి, ప్రొద్దుగ్రుంకగనే భోంచేసి, తరువాత ఇతర పనులు చూచుకోవడము అలవాటు. నేను ఇంట్లో వున్నట్టయితే, నేను పంక్తిలో లేకుండ అన్నంతినరు. నాకూ అలాగేఉండేది. జ్యోతి సమీపంలో ఉంటే ఆకలేలేదు. ఈ రాత్రి అన్నంపై ధ్యాసేలేదు.

"జ్యోతీ, భోంచేస్తావా ?" అని అడిగాను.

జ్యోతికి నేను చాలా ఋణపడి యున్నాను. అంటే-ఆమె దగ్గరనుంచి ఎన్నోవస్తువులను పుచ్చుకున్నాను. ఆమె మాత్రం చిల్లిగవ్వకూడ అంగీకరించలేదు. ఈ పుచ్చుకోవడాలు అనవసర బాధ్యతలు కల్పిస్తాయని ఆమె భావన.

"మీ ఇంట్లో భోంచేయడానికి రాలేదండీ నేను—మా ఊరు పోతూ (అమ్మా నాన్నని చూడడానికి) ఢాకా వెళ్లిపోతే జీవితములో మరియొక పర్యాయము మిమ్మల్ని చూడ తటస్థించుట అసంభవమేమోనన్నభయం నా హృదయాన్ని అనేక దినాలుగా వ్యాకుల పెడ్తున్నది. మొదట్లో ఒంటరిగ వస్తున్నానే అని జడిసాను. కానీ అదృష్టవశాత్తు మిమ్మల్ని కలిసికొన్నాను. అంతేచాలు."

ఇక భరింపలేక టేబిల్‌పై తలపెట్టి వెక్కి వెక్కి ఏడ్వ ప్రారంభించింది. ఆమె మాటలు నాకు అంకుశ పోట్లలాగున్నాయి.

"జ్యోతీ—జ్యోతీ—ఏడ్వకు నిన్ను సంతోష పరచడానికి ఏంచేయమనినా సిద్ధుడనే"—అంటూ ఆమె తల నిమిరి కూర్చోబెట్టాను. (నేను జ్యోతి శరీరాన్ని స్పృశించడం ఇదే మొదటిదఫా—మాది నిష్కళంక, నిర్వికార, నిర్విశేష ప్రేమ.)

ఆమె నవ్వింది-స్వచ్ఛంధ దరహాసం కాదది-హేళనతో మిళితమైనది—"ఇంతదాక మీరు చూపిన దయయేచాలు, మరెట్టి సహాయము చేయనవసరము లేదు"—అని జవాబిచ్చింది. ఈ మాటలు దుర్భరంగా యుండినవి. కప్పను మ్రింగిన పామువలె మాట్లాడక జ్యోతి ముఖంవైపే చూస్తూ కూర్చున్నాను.

"ఇక వెళ్తానండీ రామనాథంగారు"—(మొదటిసారి ఆమె నన్ను పేరుపెట్టి పిలవడము) అంటూ లేవబోయింది.

"ఈ రాత్రి మా ఇంట్లోనే ఉండరాదా"—అని ప్రశ్నించాను.

"అంత ప్రయాస మీకివ్వడం నాకిష్టములేదు. సత్రంలో నా పెట్టె ఉన్నది. రాత్రి కక్కడ విశ్రమించి, రేపుదయాన్నే బయలు దేర్తాను."

"అయితే మా ఇంట్లో ఏమీ తినవన్నమాట"—అని కటువుగ ప్రశ్నించాను.

"రామనాథంగారూ మన్నించండి. మీరు ఇష్టపడియున్నట్లయితే-ఒకానొక కాలములో ఈగృహములో నాకు అన్నమేకాదు, సర్వాధికారములు లభించియుండేవి .. ఈనాడిచ్చట నాకెట్టి హక్కులులేవు—మీ సౌఖ్యానందాలను

నేనునిరంతరము కోరుచుంటానని నమ్మండి-అంతేచాలు...” జ్యోతి ఇక మాట్లాడ లేకపోయింది. దీపపు వెలుగులో, ఆమె నేత్రాలు ఎఱ్ఱబారి యుండడము గమనించాను.

“రామనాథ్—ఎన్నిసార్లురా నిన్ను పిల్చేది భోజనానికి ప్రొద్దుకాలేదా?” అంటూ నాన్న గదిగుమ్మందాటి లోన ప్రవేశింప బోయారు. జ్యోతినిచూచి రెండడుగులు వెనుకకు తగ్గారు.

“నాన్నారండి, ఈమెను మీకు తెలియ పరుస్తా” నని ఆయన కుడిచేతినిపట్టి లాగుకొచ్చాను. (మా నాన్న దగ్గర నాకున్నంత చనువు మరెవరికి లేదు మా ఇంట్లో)—“ఈమె కాలేజీలో నాసహాధ్యాయిని నాన్నా. పేరు జ్యోతిర్మయి”

నాన్న గది ప్రవేశించడంచూచి, జ్యోతి లేచి అతనికి నమస్కరించింది

అప్పుడు మానాన్న ముఖములో అమితానందము తాండవించింది-ఎందు కంటారేమో-జ్యోతిని నిరాకరించి నప్పటినుంచి, నేను జన్మాంతం వరకు బ్రహ్మచారిగ నుంటానని శపథం పుచ్చుకున్నాను. వచ్చిన సంబంధాలు వెనుకకు మరలినాయి. జ్యోతి మా ఇంట్లో ఉండడంచూసి, ఆయన ఈమె నాభావి అర్ధాంగి అని ఊహించి ఉంటారు. అతని అపోహల పోగొట్టడానికి—“నాన్నా, జ్యోతిర్మయి భర్త ఢాకాలో ఉన్నాడట. పుట్టినింటికివెళ్తూ, దారిలో నన్ను చూడవచ్చింది”—అని రాయి పగుల కొట్టినట్లు చెప్పాను. పాపము-అతనిముఖం కాంతి విహీనమైనది.

రాత్రి మా ఇంట్లో ఉండమని నాన్నకూడ అడిగారు. జ్యోతి-“వీలులేదు నాన్నగారూ-మరియొక పర్యాయమువచ్చినప్పుడు తప్పక ఆగుతాను”—అని చెప్పింది. నాన్న మరి బలవంత పెట్టలేదు. ‘మరియొక పర్యాయం’-అన్న మాటలలోని నిఘూడ రహస్యాన్ని నేను మాత్రమే అర్థము చేసుకున్నాను.

“రామనాథ్, ఆమె వెళ్లినతరువాత నీవుభోంచేయి”-అనిచెప్తూ గదివిడచి వెళ్లారు. మానాన్న ఎప్పుడూమితభాషి.

“ముఖ్యమైన ఒకసంగతి నీకు చెప్పమరిచాను. జ్యోతీ-మనదామోదరం—కమ్యూనిష్టు—ఈ రోజు అతనికి ఖైదు విధించారు. నేను ప్రభుత్వం చర్యను సమర్థించాను.”

“ఘనకార్యము చేశారను కున్నారా?-సిగ్గులో క్రుంగిపోవలసినదానికి మీరు-మీ కుత్సితబుద్ధిని ప్రశంసిస్తున్నారే-” అని గుమ్మములో నిల్చుని జ్యోతి అడిగింది.

“నా తప్పుకాదు......” వాక్యం పూర్తికాక ముందే జ్యోతి-“ఇక చాలించండి మీ సమర్థనలను. స్నేహితునికే ద్రోహంచేశారు.”

ఇక మాట్లాడితే తగవు తప్పదని తలవంచుకున్నాను.

“ఇకసెలవు—నమస్తే”-అన్నది, గుమ్మందాటి డాబా ప్రవేశించిన జ్యోతి. జ్యోతిర్మయి ఆ రాత్రి అగుపించినంత అందంగా ఎప్పుడు కనుపించలేదు.

ఆమెను హృదయానచేర్చి, నాబాహువులలో బంధించాలనిపించింది. మరుక్షణం-నాకూ—‘నా’ జ్యోతికి మధ్యనున్న అగాధం స్ఫురణకొచ్చింది. ముందుకు చాచిన నా బాహువులు, ఆమె నమస్కరించడానికి ఎత్తిన హస్తాలను మాత్రమే తాకగలిగినాయి. నా కందులోనే ఏండ్లు పూండ్లు తపించినా ప్రాప్తించని సుఖం లభించింది. నిర్మల ప్రేమలో పరవశత్వము పొందేసమయం ఒక క్షణమైనా అమూల్యము, అమోఘము.

“నా జీవితములో మిమ్మల్నితప్ప ఎవరిని మాడ నభిలషింపలేదంటూ”-మరుక్షణం-మేడమెట్లు దిగి, హాలువరండా దాటి జ్యోతి వీధిని ప్రవేశించింది.

జ్యోతిర్మయి, దూరపు అంధకారంలో మిళితమై పోవడమును నేను, నిర్జీవ ప్రతిమవలె డాబాగోడ నానుకొని నిరాశతో తిలకించాను.

కాలచక్రంలో పది గ్రీష్మఋతువులు తిరిగాయి. జ్యోతిర్మయి జాడ నేటికిని నే నెరుగను.



# ప్రధానాంధ్ర కేంద్రములలో!

# త్వరలో వచ్చుచున్నది!

## పక్షిరాజా వారి







# "పవళక్కొడి"

**(తమిళం)**

డైరెక్టరు: శ్రీరాములునాయుడు

* టి. ఆర్. రాజకుమారి * మహాలింగం * వరదన్ * సరోజిని

* కృష్ణన్ * మదురం * లలిత * పద్మిని

DISTRIBUTORS FOR ANDHRA CEDED AND NIZAM

**RAJSHRI PICTURES LTD.**

**VIJAYAWADA—GUNTAKAL—SECUNDERABAD**

# సరళ ★ శ్రీ చల్లా సత్యేంద్రశంకర్‌గారు

సరళ సహజంగా అందమైనది. శారీరక అందాన్ని మించినదామె మనసు మెలగే 'మంచితన'మనే అందం. ఆమె అందమైనదని ప్రపంచాన్ని మోహ పరచగలనని ఆమె గర్వించినట్లెప్పుడూ తెలియదు. ఇదే ఆమె నిరాడంబరతను నిరూపిస్తుంది.

ఆమె ఒక వున్నత కుటుంబానికి ఏకైక కుసుమం. ఏకైక ప్రతిబింబం. కష్టమనే మాట, కష్టమనే కాళ పిశాచం మానవ లోకాన్ని ప్రతిక్షణం వెంటాడుతుందని, కలిమిలేములు తప్పని సరియని ఆమె బాల్యావస్థలో ఎరుగదనే చెప్పాలి. సుఖాల్లో సోలిపోతూ ఆనందంలో అలసిపోతూండే పరిసరాల్లోనే ఆమెనివాసం.

రోజులు కదిలిపోతున్నాయి. ఆమెలో 'బాల్యం' సడలిపోతూంది. ఏదో నూతనత్వం ఆమె జీవితద్వారంలో కొంటెగా, చిలిపిగా, ఓరగా నిలిచిచూస్తూంది అదే ఆమె జీవితంలో తొలిమెఱుపు. యౌవనోదయానికి ఉపోద్ఘాతం.

బాధ్యత నెరుగని యా 'బాల' బరువుగా నడుస్తూంది. అదే ఆమె జీవితములోని మొదటి గిలిగింత: జీవిత సోపానానికి తొలిమెట్టు. పూవు పూసింది. తీగబరువుగా వూగింది.

సరళ తలితండ్రులు ఎరుగుదురు పూవులోని పరిమళం పరిసరప్రాంతాన్ని తనవైపు కాకర్షిస్తుందని. పూవున్ని దాచగలరు. పరిమళాన్ని ?

ఇప్పుడామెలో ఒక కోరిక, జీవితంలో ఒక ఆశయం జనించాయి. కదలేకాలంలో పురోగమించే ప్రపంచంలో ఆమె ఒకవ్యక్తి, ఒక సభ్యురాలు. ఈ తలంపు నామె ఎప్పుడూ విస్మరించలేదు. మానవ సంఘంలో తనసభ్యత్వానికి రాజీనామా దాఖలుపరచి ఏకాంత జీవనానికి అంకిత మవుదామనే వుద్దేశ మామెలో కలిగినట్లు ఆమె చేసేపనిలో కాని, ఆచరించే ఆచరణలో గాని ద్యోతక మవలేదు. పుష్పాన్నలంకరించుకొనే వారు దాన్నిచ్చిన వ్రేళ్లను మరచినట్లు, తనకీ సుఖాల నిచ్చిన కష్టజీవి నామె ఎన్నడూ మరువలేదు.

వికసించిన ఆమె మనస్సనేక సుగంధాలను గుబాళించుతోంది. మానవ లోకంలోకి ఆమెదారులు కనుక్కో నవసరంలేక పోయింది. మధుర భావాలు మార్గాలై ఆమెను ప్రజానీకపు హృత్సీమలలో ప్రవేశ పెట్టాయి. కష్టజీవికి, పేద ప్రజకి, 'మరవబడ్డ మనిషి'కి ఆమె ఒక దేవత. దారిద్ర్యానికి, బానిసత్వానికి పాశ బద్ధులైన వారికి విముక్తికి దారిచూపే మార్గదర్శి!

ప్రజలలో ఆమె, ఆమె పేరు, ఆమె ఆదర్శాలు చిర పరిచితములు. ఆమె వాళ్ల 'మనిషే' అయిపోయింది. వాళ్లామె పాశబద్ధులు.

ముందుచూస్తే కష్ట జీవికన్నీళ్లు, పేద ప్రజ ఆర్తనాదాలు. వెనుకచూస్తే ఆటంక పడే తలితండ్రులు. ఈ సందిగ్ధస్థితిలో ముందా వెనుకా ఆమె చేపట్టవలసినది ?

తను, బ్రతికిన 'వ్యక్తు'ల కొరకా లేక బతకబోయే 'ప్రజ' కొరకా అనేది ఆమెను కలవరపెట్టక పోలేదు. కొన్నినాళ్లామె కుమిలిపోయింది.

బెదరింది. బేలయైపోయింది. కృసించిపోయింది. అబలలా అల్లాడిపోయింది. ముందు కార్యమేమో ఆమెచిత్రించుకొని చూచింది. అబ్బా! అని నిట్టూర్చింది. కన్నీరు కార్చింది. ఇదేకదా తను బ్రతుకబోయేలోకం అనుకుంది. కదలిందామె మనస్సు. తల్లడిల్లిందామె హృదయ కమలం ప్రజకామె ఒక ఆశ. ఒక ఆరనిజ్యోతి. ఈ విషయం ఆమె యెప్పుడు మరువలేదు. ప్రస్థుతాన్ని గూర్చి భవితవ్యాన్ని పోగొట్టుకో నిచ్ఛగించలేదు.

మాతాపిత లెదురు తిరిగెదరని ఆమెకు తెలియకపోలేదు. వాళ్లు ఖేదిస్తారని తనకై బెంగతో కృంగి కృశించి పోతారని ఆమె బాగా ఎరుగు. అయినా త్యజించింది. ముందు కార్యక్రమానికి ప్రణాళిక నేర్పరచుకుంది. ఆకలితో అట మటించే ఆర్త జీవుల ఆకాంక్షను ఆచరణలోకి తెచ్చుటకై ఆమె ఆనిశీధిలో లీనమయింది. ఆటంక పడే అల్పసంఖ్య గుర్రు పెడ్తూంది. నీరస ప్రజ ఆమెకై నిక్కి చూస్తూంది.



# 'శ్రద్ధాంజలి'

స్వాతంత్ర్యం సిద్ధించినది మొదలు మన భారత దేశం అమూల్య రత్నాలను పోగొట్టుకొనుచున్నది పూజ్య బాపూజీ వియోగానికే బావురుమనుచున్న భారత ప్రజలను నారీశిరోరత్నమగు శ్రీమతి సరోజినీదేవి నిర్వాణ వార్త "గోరుచుట్టుపై రోకలి పోటు" వలె కంపింప జేసినది అయ్యో, భారత నారీమణుల దురదృష్ట రేఖయా! జగన్నాటక రంగమున విషాదాంత సంఘటనమా! అజ్ఞాన మేఘరాసియలము కొని యున్న నారీ లోకమున తళుక్కున మెఱసి విజ్ఞాన ప్రభల వెల్గారిన దివ్యతార రాలిపోయినది మహిళా లోకము అంధకారావృతమైనది. అజ్ఞానావస్థ నున్న స్త్రీ జాతిలో విజ్ఞాన తృష్ణను బురికొల్పి స్త్రీ శక్తి నుద్దీపింపజేసి స్వాతంత్ర్య పథమునకు పురోగమింప జేసిన మాతృదేవత, మన సరోజినీదేవి, స్త్రీల నావరించియున్న "అబలా" త్వమును రూపుమాపి కేవలము స్త్రీ స్వాతంత్ర్యమునకే గాక స్త్రీ పురుష సమానత్వమునుద్ఘాటించిన మహా వ్యక్తి మన సరోజినీదేవి. వీను మిగిలిన విజ్ఞాన ప్రతిభతో కవితాకన్యకేలుబట్టి కళావినోదినియై దేశదేశముల తన కవితా ఝరుని ప్రవహింపజేసి కవికోకిలయై విహరించి స్త్రీల కవితా కౌశలమునుద్దీపింపజేసిన కళా మూర్తి ఆమె. ఆమె సంస్మరణ లేఖిని కందదేమో

"భారత పిత" బాపూజీ ఆశయ నిర్వహణలో మత విద్వేషాలను రూపుమాపి శాంతి స్థాపనకై శాంతి బోధనలతో ఆమె జూపిన ఓర్పు, సౌభ్రాతృత్వమే యు. పి. గవర్నరుగ నాహ్వానింపబడుటకు కారణము చక్కని పరిపాలనతో కల్లోలముల నణగింపజేసి ప్రజా హృదయాలను చూరగొన్న అకమనీయ మూర్తి కివే జోహారులు ఆమె నిర్యాణము భారత స్త్రీల దురదృష్టము· ఆమె అంతరించిననూ ఆమె ఆత్మ శక్తి భారత స్త్రీలకు రక్ష యగుగాక! భారత మహిళలు ఆమె అడుగు జాడల్లో ఆమె అందజేసిన సందేశములు శిరసావహించి ఆచరించి ఆ ధన్యజీవి ఆత్మశాంతికై శ్రద్ధాంజలు లొసంగుదురు గాక!

—డి యస్. రాజేశ్వరీపట్నాయక్

రామ: పిల్ల దొరకకేం! కావలసినంతమంది పిల్లలున్నారు. నా మనస్సుకు నచ్చిన, నా యుద్దేశములకు తగిన, నాతో సరిసమాన భావాలు కలిగి నాకు అన్నిటిలోనూ తోడునీడయై సంచరింపతగిన, ప్రస్తుతపు సంఘంలో తిరుగగల పిల్ల దొరకవద్దూ. అట్టి పిల్ల ఇంతవరకూ నా కెక్కడా కనబడలేదు. నీ కెవరినైనా తెలిసియుంటే చెప్పెదవా?

ప్రసా: ఎక్కడికో వెళ్లుటెందుకు? నీ కోరికలకు తగిన పిల్ల నా చెల్లెలేయున్నది. కాని ఆమె యొక పిల్లవానిని ప్రేమిస్తోంది. అతను కుఱ్ఱవాడు. అందంగా ఉంటాడు. సామాన్య స్థితిపరుడు. ఇంకా అతను నాలుగేళ్లు చదువవలసియున్నది. ఆ తరువాత ఉద్యోగం సంగతి ఎలాయుంటుందో. ఈ రోజుల్లో ఉద్యోగం దొరకడం ఒక గొప్ప సమస్య కదా. అతను పెద్ద యుద్యోగస్తుడయితేనే తప్ప లేకపోతే మా చెల్లెలు చాలా కష్టపడవలసియుంటుంది. దానిదంతా అతి దర్జా. కంచం కడుక్కోమంటే చేయి కందిపోతుందంటుంది. ఆరవేసిన బట్ట తీసికోవే అంటే పని మనిషియుండగా నేనెందుకు తీసికోవాలంటుంది. సినీమాలు, సంగీతసభలు, నాటకాలు మొదలైన వాటికి వెడితే మొదటి తరగతి టిక్కెట్టేగాని మరియొకటి కొనటానికి వీలులేదు. రైలులో సెకండ్ క్లాసులోనే తప్ప ప్రయాణం చేయనంటుంది. మాకు ఆమె ప్రేమించిన కుఱ్ఱవానికిచ్చుటలో మరియొక ఆక్షేపణ యేమీ లేదుకాని అతని భవిష్యత్తు ఏలాయుంటుందో తెలియక పోవుట చేత ఈమె తరువాత కష్టపడి పోతుందేమోనని సందేహిస్తున్నాము

రామ: ప్రసాదరావూ! నీవు చెప్పిన లక్షణాలన్నీ చూస్తే ఆ అమ్మాయి నాకు తగినట్లున్నదే. ఆమె ఆ అబ్బాయి నెవరినో ప్రేమించకుండా ఉంటే తప్పకుండా నేను చేసికొందును. ఆ అమ్మాయిని గురించి చెపుతోంటేనే నా మనస్సంతా ఆమె వైపుకు మరలింది. ఆమెను చూస్తే ఏలాయుంటుందో!

ప్రసా: నీవు తప్పకుండా చేసికొంటానంటే ఆమెనునే నేలాగో ఒప్పిస్తాను. తప్పకుండా చేసికొనే యుద్దేశ్యమేయుంటే రేపొకసారి మా యింటికి వచ్చి ఆమెను చూడు.

ప్రసా: లీలా! నీకొక మంచి శుభవార్త. నీవు చాలా అదృష్టవంతురాలివి. నీ యుద్దేశములు, దర్జా సాగే లక్షణాలు కనబడుతున్నాయి.

లీల: ఏమిటది? చెప్పరాదు త్వరగా.

ప్రసా: ఆహా! అప్పుడే అంత ఆతురతగా ఉన్నదీ? ఇక చెప్పాక నన్నసలే నిలువ నీయవు కాబోలు. చెప్పాక ఇక నాతో మాట్లాడతావా? ఇక మేము కనబడతామా ఆ హోదాలో. అమ్మగారి దర్శనానికి వచ్చామని తెలియ బరుచుకోవాలి కాబోలు. విజిటింగు కార్డు పంపాలా?

లీల: ఏమిటీ గొడవంతా? ఏదో చెప్పరాదూ. నాకు పరీక్షలు దగ్గర కొచ్చాయి. పోయి చదువుకోవాలి. టైమంతా వేష్టు చేయక ఆ చెప్పేదేదో త్వరగా కానీయి బాబూ.

ప్రసా. చెపుతానుగాని నీవు నాకో వాగ్దానం చేయాలి.

లీల: ఏం వాగ్దానం? విషయం తెలియకుండా వాగ్దానాలు చేయటానికి ఇది కృతయుగం, త్రేతాయుగం కాదు. కలియుగం. ఈ యుగంలో అంత అమాయకులు లేరు. నేనంత వెఱ్ఱిబాగులదానినను కొన్నావా ముందు వాగ్దానంచేసి తరువాత విచారపడడానికి?

ప్రసా: నీవు వెఱ్ఱి బాగులదానివని ఏలా అనుకొంటానే! పెద్దవాళ్లం మా కెవరికీ తెలియకుండా చిన్నప్పటినుండీ వస్తోపోతో ఉన్న ఆ అబ్బాయిని ప్రేమిస్తో మాటలలోగాని, చేష్టలలోగాని మొన్నటివరకూ మా కెవరికీ తెలియకుండా అతి గుట్టుగా నున్నదానిని? దానికేంగానీ పోనీ యిక చెప్పేస్తా ఆ పయిని నీవే ఆలోచించవచ్చును. మరి, అంతక్రితము చెపుతో ఉండేవాడ్నే నాకో ఐ. సి. ఎస్. ఆఫీసరు స్నేహితుడున్నాడని, అతను వచ్చాడు ఈ యూరు. అతను, నేను పార్కులో కలసికొన్నాం. అతని కింకా పెండ్లికాలేదు.

**లీల :** చాలులే. ఇక చెప్పక్కర్లేదు. ఇందుకా ఇంతసేపు ఊరించావు.

**ప్రసా :** కాదే. పూర్తిగా వినుమరి. మాటలసందర్భంలో ఇంకా పెండ్లి చేసి కొన్నావు కాదేమని అడిగాను. తన యుద్దేశాలు చెప్పాడు. నీ సంగతి చెపుతే అన్ని విధాలా తనకు తగియున్నదని, ఆమెను చేసికొంటే బాగుంటుందనీ అన్నాడు.

**లీల :** నీవు చెప్పలేకపోయావా ? ఆమె ఒకర్ని ప్రేమించి యున్నదనీ, ఇక మరెవ్వర్నీ పెండ్లియాడదనీను.

**ప్రసా :** చెప్పలేదు మరి. మళ్లీ మనకి రహస్యం ఎందుకు ? నీ సంగతి చెపుతే నిన్ను చూడాలని బుద్ధిపుట్టింది అతనికి. మన యింటికి వస్తానన్నాడు. నీవు మాత్రం పారిపోక కొంచెం కనపడు అతనికి.

**లీల :** నా సంగతి, నా నిశ్చయము తెలిసిన నీవు అసలు అతనిని ఎందుకు రమ్మనాలి ? ఎవరైనా సరే నేను మరి యొకర్ని చెసికోను. అసలు నాకు పెండ్లే అక్కరలేదు. ఈలాగే యుంటాను.

**ప్రసా :** లీలా ! కలెక్టరుగారు మన యింటికి వస్తానంటే రావద్దని చెప్పమంటావా ? ఏమి మర్యాదే !

**లీల :** నీ స్నేహితుడు కాబట్టి నీవు పిలిచావు బాగానే యుంది. నాతో పనేమి ? నన్ను చూడడం ఎందుకు ?

**ప్రసా :** ఎఱ్ఱగా బుఱ్ఱగా, అందంగా, ఉంటావనీ, కాలేజీ చరలువనీ, టెన్నిసు అదీ ఆడతావనీ, మగవాళ్లతో మాట్లాడడానికి అభ్యంతర లేని దానివనీ, ఇంకా ఏవో ఏవో ఉద్దేశాలతో నిన్ను చూస్తానన్నాడు. చూసినంత మాత్రాన అరిగి పోతావా యేమిటి ? ఇష్టమైతే చేసికొందువుగాని లేకపోతే మానేస్తువుగాని. పెద్దమనిషి యింటికి వచ్చి చూస్తానంటే కనపడకుండా ఉండడం మాత్రం మంచిది కాదుసుమీ. నాకు కాస్త మాట దక్కించమ్మా నిన్ను బతిమాలు కొంటాను.

**లీల :** సరే నని వప్పుకొంది.

ప్రసాదరావు, అతని సోదరులు కృష్ణారావు, చంద్రశేఖరుడు, లీల, ఆమె అక్కగారు సూర్యప్రభ రామచంద్రరావును, అతని మిత్రుని ఆహ్వానించారు. అంతా టీ టేబిలు వద్ద కూర్చున్నారు. ప్రసాదరావు తక్కినవారిని తన మిత్రునకు ఎరుక పరచాడు. అల్పాహారాలు తీసికొంటూ ఏవో కొన్ని యితర విషయములను గూర్చి, స్త్రీ సంస్థలను గూర్చి, సరోజనీనాయుడు, బీగమ్ షానవాజ్, రాజకుమారీ అమృతకౌరు, కమలాదేవి మొదలైన వారిని గురించీ మాట్లాడారు.

**రామ :** ప్రసాదరావు ! మీ చెల్లెలు ఇప్పుడేమి చదువుతోందనీ చెప్పావు ? బి. ఎస్. సి. (లీల వైపుకు తిరిగి) మీ తరగతిలో ఎంత మంది బాలికలు చదువుతోన్నారు ? మీ కక్కడ హాస్టలు సదుపాయంగా ఉంటుందా ? మీ ప్రిన్సిపాలు ఎటువంటి వారు ?

మొదలైన ఏవో కొన్ని ప్రశ్నలు ఇంగ్లీషులో అడిగాడు. లీల అన్నిటికీ సిగ్గుపడుతో సమాధాన మిచ్చింది. మొదట ఏర్పరచుకొన్న ప్రకారం వచ్చిన అతిథులకు కొంచెం ఎంటర్టైనుమెంటుగా ఉంటుందని టీ తీసుకోవడం అయిపోగానే లీల వీణ తీసుకొని మూడు పాటలు వాయించింది. రామచంద్రరావు హృదయం అపహృతం అయి పోయింది. పూర్వపు ధైర్యం, బింకం సన్నగిలాయి. ఇక ఆమెతో మాట్లాడడానికి ధైర్యంలేదు. పరధ్యాన్న మెక్కువయింది. వారియొద్ద సెలవుతీసికొని వెళ్లిపోయాడు.

**ప్రసా :** ఏమిటే లీలా ! ఆలా తయారయావు ? రోజూ ఎంతో చక్కగా టాయిలేటు అయేదానివే. ఈ వేళ లోలక్కులు తీశేశావు. కళ్లకు కాటుక లేదు. ముఖానికి పౌడరు లేదు. మెళ్లో హారాలులేవు. ఆ చీర క్కడ దొరికింది ఈ వేళ కట్టుకోటానికి ? ఆయన అడిగిన దానికి ఒక పట్టాని సమాధానంరాదే !

**లీల :** (మాట్లాడలేదు. మూతి బిడాయించుకొని కూర్చుంది.)

నాలుగు రోజులు గడచాయి. ప్రసాదరావుకి కలకత్తా నుండి ఉత్తరం వచ్చింది. అతి ఆతురతతో ఆ వుత్తరం విప్పి చూసుకొన్నాడు. అతి సంతోషంతో తన వాళ్ల నందఱను పిలిచి ఉత్తరం చదివి వినిపించాడు. ఉత్తరం ఈలా యున్నది.

# అమాయకపు ప్రేమ

ప్రియమైన ప్రసాదరావు,

మీ యింటిలోని వారందఱూ నా విషయంలో చూపిన ప్రేమకు, ఆతిథ్యమునకు అనేక వందనములు. మీ చెల్లెలు నన్ను పూర్తిగా ఆకర్షించింది. ఆమె నన్ను వివాహ మాడుటకు వప్పుకొన్న యెడల నాకే యభ్యంతరము లేదు. చాలా సంతోషిస్తాను. నా మనస్సులోనున్న యాదర్శములకన్నిటికీ ఆమె తగియున్నది. వచ్చే సంవత్సరము మళ్లీ వస్తాను. ఈ లోపుగా ఆమె మనస్సుమారితే నేను వచ్చి వివాహము చేసికొని తీసికొని వెడతాను.

చెల్లెలితో ప్రసాదరావు, "చూడు నీ వెంత అదృష్టవంతురాలవో. కలెక్టరుగారి భార్యవవుతావు. నీ దర్జా అంతా నడుపుకోటానికి వీలుంటుంది. కష్టపడ నక్కర లేదు. ఈ రోజులలో ఆడపిల్లలెంత చదువుకొన్నా, ఎంత చక్కని వాళ్లైనా పెండ్లి దగ్గరకు వచ్చే సరికి పెండ్లి కొడుకు వారు బోలెడేసి కట్నాలు, లాంఛనాలు ఎన్నో అడుగుతున్నారు. ఆ పెండ్లి కొడుక్కి ఆస్తియుండ నక్కరలేదు, విశేష విద్య కూడ నవుసరములేదు. మగవాడైతే చాలు. అలాంటప్పుడు ఇంత హోదాలోనున్న మనిషి నిన్ను కోరి చేసికొంటానంటే వద్దంటావేమిటి ? నీవు ప్రేమిస్తానన్న పిల్లవానికింకా చదువు పూర్తికాలేదు. పూర్తయాక ఉద్యోగము దొరుకునన్న నమ్మకమేమిటి యీ నిరుద్యోగపు రోజులలో ? ఆస్తా యేమీలేదు. తరువాత నీ వెంత కష్టపడవలసి వస్తుందో ఆలోచించుకో. ఇప్పుడు దర్జాగా కూర్చుని అతనితో కలసి బొమ్మలు వ్రాసికొంటోన్నట్లు, కేరమ్సు, టెన్నిసు ఆడుతోన్నట్లు, షికారు వెళ్లినట్లు ఉండదు, పెండ్లయి జీవితంలో ప్రవేశించాక. ఏడాది టైముంది ఆలోచించుకో. ఇక అతనితో ఉత్తర ప్రత్యుత్తరాలు కట్టిపెట్టు. అతను నీకొక బాల్య స్నేహితుడనుకో. మీ స్నేహమును విడిచి పెట్ట నక్కర లేదు. ఎప్పటియట్లు వస్తో పోతో ఉంటాడు. మేమందఱము అతనిని ప్రేమిస్తోన్నట్టే నీవూ ప్రేమించవచ్చు. స్నేహానికీ, వివాహానికీ చాలా తారతమ్యముంది. ప్రేమప్రేమ అని ఈలా వెఱ్ఱిభ్రమలోపడి అనేకమంది దొరలూ, దొరసానులు రెండేసి మూడేసి యేళ్లు ఒకర్నొకరు బాగా తెలిసికొని వివాహమైన కొద్ది రోజులకే విడాకు లిచ్చుకొంటూ ఉంటారు. ఈ Love అనేది పాశ్చాత్య అనుకరణ. పాశ్చాత్య విద్యవలన కలిగే ఒక విధమైన అంటువ్యాధి. ఉద్రేకం. మోహం. అంతేకాని నిజంగా ప్రేమ అనేది లేనేలేదు. ఎవరిని పెండ్లిచేసికొంటే వాళ్లమీదే కుదురుతుంది ప్రేమ. అమ్మకీ నాన్నగారికీ ప్రేమ లేదా ? మా కందఱికీ ప్రేమలేదంటావా ? జీవితంసౌఖ్యంగా గడచిపోతోఉంటే అంతా ప్రేమే. అది లేనప్పుడు కనపడాలి ఆ ప్రేమ. ఇప్పుడు నీవు శ్యామప్రసాదుని చేసికొంటావనుకో. అతని కుద్యోగముండదు. అతని తల్లీతండ్రీ తనమాట వినకుండా ఎంతెంతో కట్నాలిస్తామన్న వాళ్ళ పిల్లల్ని చేసికోకుండా నిన్ను నమ్మి చేసికొన్నాడనే కోపంచే వాళ్లేమీ సహాయం చేయరు. మేముకూడా అంతే. అప్పుడు డబ్బులేక అతను, పనిపాటలు చేయలేక నీవు బాధపడుతో ఒకరి నొకరు విసుక్కొంటో ఉన్నప్పుడు తెలుస్తుంది ఈ ప్రేమ. ఈ పెండ్లి యెందుకు వచ్చిందా అని విచారిస్తారు."

లీల గదిలో కూర్చుని పరీక్షలు దగ్గరకు వస్తోన్నాయని ఆతురతతో పుస్తకం తీసింది చదువుకోటానికి. చదివిందేమీ తలకెక్కటం లేదు. మనస్సంతా చెదిరి పోయింది. ఏమి చెప్పటానికీ ఏమి చేయడానికి తోచడం లేదు. తన జీవిత సమస్య ఏలా విడుతుందో అర్థం కావడం లేదు. తన మనస్సును శ్యామప్రసాదునుండి మరలించుకోవడం తనకసాధ్యం కాని పని. మరలించుకోటానికి తగిన కారణం కనపడదు. "ఇదేం హఠాత్తుగా ఏ రైలులోనో, ఏ పార్కులోనో, ఏ పార్టీలోనో పై వేషభాషలను, కనుగీటులను చూచుట వలన కలిగిన ఉద్రేకమా, వ్యామోహమా తరువాత మారడానికి. చిన్నప్పటినుండి యేర్పడిన ప్రేమ. చిన్నప్పుడేదో అతని అందం చూచి నేను, నా అందం చూచి అతనూ ఆకర్షింపబడ్డాము. ఆ లేత వయస్సులో మా యిరువురికీ చిత్రకళ, సంగీతములలో గల అభిలాష, ఏకాభిప్రాయాలు, సమాన కోరికలు మొదలైన లక్షణములు నానాటికీ మా స్నేహాన్ని బలీయం చేశాయి. అది క్రమేణ వయస్సుతోబాటు వృద్ధియై ఒకరి నొకరు విడిచి పెట్టి యుండలేనంత గాఢమై జీవిత కాలమంతా విడిచి పెట్టకుండా ఉండే

సంబంధమును సాధించు నిశ్చయమును కలిగించింది. పదేళ్ల నుండి చూస్తోన్నా నతనిని. అతనితోకలసి ఆడుతోన్నాను. షికారు వెడుతోన్నాను. అతని లక్షణాలు జాగ్రత్తగా పరిశీలిస్తోన్నాను. అతనిలో ఏ లోపము కనపడదే. నన్నింతగా ప్రేమిస్తోన్నాడు. ఏకాంతంగా కూర్చుని ఎన్నోకబుర్లు చెప్పుకొంటో ఉంటాము. ఎంత గంభీరము? ఎంత మనో నిగ్రహము! నిన్ను ప్రేమిస్తోన్నాను, ప్రేమిస్తోన్నానని కాలేజిలోని కుర్రవాళ్లు చూపే వెర్రిచేష్టలు, మాటలు ఇతనిలో నేమీ కనపడవే. నేనంటే అతనికెంత ప్రేమో అంత భయంకూడా ఉంది. ఎంతసేపూ దూరంగా ఉండి మాట్లాడుతాడేగాని దగ్గరకురాడు. అతనియొక్క మనోనిబ్బరము, గంభీరభావములు, ఒకరి కొకరు లోకువ కాకుండా ఉండాలనే పౌరుషము, స్వాతంత్ర్య పిపాస మా వాళ్లకు కూడా బాగా తెలుసు. కాబట్టే మా మీద యే విధమైన అనుమానమూ లేకుండా మమ్ములనుస్వేచ్ఛగా ఉండనిస్తున్నారు. అతనిలో ఏ మాత్రం బలహీనత కనబడినా వాళ్లు కాదు అసలు నేను మళ్ళీ మాట్లాడుతానా అతనితో" ఈలా ఆలోచిస్తూ కూర్చుంది. ఇంతలో తల్లి వచ్చింది. "అమ్మాయీ! లీలా! ఏమి చేస్తోన్నావే? అన్నయ్య చెప్పిన సంబంధం చూశావా? అతను నీకు బోధించిన బోధలు విన్నావా? ఈ పాటికి నీ మనస్సు కొంత మారి యుంటుందనుకొంటాను ఇన్నాళ్ల స్నేహం ఒకసారి మారుతుందా మరి. నీకీ పెండ్లి కొడుకుతోను, అతనికి వాళ్లవాళ్లు తీసికొనివచ్చిన మరియొక పిల్లతోను పెండ్లిండ్లు అయి పోయాక క్రమంగా అదే మారి పోతుంది."

లీల: అలా మారి పోయే ప్రేమ కాదమ్మా యిది. ఇది యెప్పటికి మారదు. అమ్మా! నిన్ను నే నొకటి అడుగుతాను చెప్పు. నీవు చిన్నప్పటి నుండీ నాకు సావిత్రి, దమయంతి, చంద్రమతి, సీత మొదలైన పతివ్రతలకథలు చెప్పుతున్నావు. వాళ్లు ఎన్ని కష్టాలు వచ్చినా ఏమయినా మొట్టమొదట తన మనస్సులో ప్రేమించిన పురుషుని తప్ప మరి యొకరిని ప్రేమించక పోవుట చేతనే వాళ్లు మహా పతివ్రతలు, ఆదర్శ స్త్రీలు అయారని చెప్పావు. ఇప్పుడు నా విషయంలో ఏం చెప్పుతోన్నావు? అమాయకంగా బాల్యదశలో నున్నప్పటి నుండి నాకు తెలియకుండానే ప్రేమిస్తోన్న పురుషుని విడిచిపెట్టి ముక్కు మొగము తెలియని క్రొత్త వానిని మీరు చెప్పిన వానిని పెండ్లి చేసుకోవాలా? ఈలా చెప్పడం నీకు ధర్మమేనా? ఆ క్రొత్తఆయన ఎటువంటి వాడో మనకు తెలియదు. పెద్ద యుద్యోగి, గొప్ప జీతగాడు ఒకటే చూస్తున్నారుగాని అతడెట్టివాడో యెవరికైనా తెలియునా? సాధారణంగా మన యూరు వచ్చే పెద్ద యుద్యోగస్తులను గురించి వింటున్నాము. చూస్తున్నాము. వాళ్లు దిట్టంగా సిగరెట్లు కాలుస్తారు. త్రాగుతారు. ఇష్టమైన స్త్రీలతో సరదాగా తిరుగుతో ఉంటారు. అట్టి వేమీ అతనిలో లేవని మీరు చెప్పగలరా? అట్టివే యున్న వో అవేవీ యిష్టము లేని నా జీవితమెంత దుర్భర మౌతుందో ఆలోచించు. శ్యామ ప్రసాదుని యందేమి లోటున్నదని నన్ను మనస్సు మార్చుకోమంటావు?

తల్లి: నీవు చెప్పినదంతా నిజమే. కాని శ్యామ ప్రసాదు భవిష్యత్తు ఎలాయుంటుందో తెలియదు. నీవు శ్రమపడి పోతావని. అంతే. అంతే కాకుండా ఇతను ఒక వేళ పెద్ద యుద్యోగి అవుతాడనుకో అప్పు డితను సిగరెట్టు కాల్చకుండా, త్రాగకుండా, ఇతర స్త్రీలతో మాట్లాడకుండా ఉంటాడని నిశ్చయ మేమిటి? అతనే అలా అయితే అప్పుడేమి చేస్తావు?

లీల: అలా యెప్పటికీ కాడు. ఆ ధైర్యము, అతనిలో ఆ నమ్మకము నాకున్నాయి. తాను స్వతహాగా కాకపోయినా స్నేహితులయొక్క ప్రోద్బలం చేతనైనా ఒక వేళ అతను కొంచెం ప్రారంభించినా నేను వద్దని చెప్పగానే మానేస్తాడు. అతనికి నాయందట్టి భయంవుంది."

తల్లి: అమ్మా! లీలా! నీవు చిన్నపిల్లవైనా పెద్దవాళ్లం మాకు బుద్ధి చెప్పుతున్నావు. పోనీ నీవు చెప్పినవన్నీ బాగానే యున్నాయి. పెండ్లి కొప్పు కొందామంటే శాఖా భేదం వచ్చిందే. మనది ప్రథమ శాఖ. వాళ్లు నియోగులు. పోనీ అది కూడా పాటించడం ఎందుకీ రోజులలో అనుకొంటే గోత్రం ఒకటి. దానికి మనం

(64-వ పేజీ చూడుడు.)

# తోచిందల్లా – – – –

శ్రీ కొనకళ్ల వెంకటరత్నంగారు



ఆమె అంటే నాకెంతో భక్తి ప్రపత్తులున్నాయి. ఆమె కాంగ్రెస్‌వాది. చాలాసార్లు జైళ్లకి వెళ్లింది. ఆమె అంటే నాకేకాదు, చాలామందికి పూజ్య భావం. ఆమె మనస్సు వెన్నలాంటిది. ఆమె పెనిమిటికి మళ్లీ వూరూ పేరూ లేదు. ఆమె ఏకాన్ఫరెన్సుకు వెళ్లినా ఆయన కూడానే వుంటాడు. కొంతవరకూ ఆయన ఇచ్చిన స్వతంత్రంవల్లనే ఆమె స్త్రీ లోకంలో వొక మణిపూసగా తయారయింది. అయితే ఆమె కొకనాడు తీరని అవమానం కలిగింది నా యెదుట. ఒక సేవాసదనానికి శంఖుస్థాపన చేశేందుకు ఆహ్వానించారామెని. ఆమె, ఆమెతో ఆయన వెళ్లారు. ఇట్లాంటి పురుష పుంగవుల్ని 'పక్షీంద్రు'లని పిలవటం వాడుకలో వుంది. కాని ఆ నామధేయం మాత్రం నాకు రుచించదు చెప్పొద్దూ. వొక స్త్రీని వున్నతమైన శ్రేణిలో నిలిపి తాను నిమిత్తమాత్రంగా వుండిపోయే పెద్దమనిషిని హేయంగా చూస్తాము మనం. అది తప్పు. వొకనాడు మా శంకరానికి సిగరెట్టివ్వబోయాము. పుచ్చుకోనన్నాడు. మానేశానన్నాడు. "ఎప్పటినించిరోయ్!" అని నిగ్గదీశాము. "మా ఆవిడ శత పోరు పెట్టింది - నిన్నటినించీ మానేశా నన్నాడు" అమైన అందరమూ వేటకుక్కల్లా మీద పడ్డాము

"ఓరి వెధవ!—చచ్చు సన్యాసి!" అని వొకడు.

"ఇంటిదగ్గర ఆడముండ శాసించిందీ?" అని మరొకడు.

"నువ్వు మొగుడు మంటున్నావా?" అని ఇంకొకడు.

"ఇక నువ్వెందుకు పనికొస్తావురా?" ఐక్య కంఠంగా.

"ఆడంగి వెధవ!" అని నా వుపసంహార వాక్యం!

అదే వొక స్త్రీ తనభర్త కిష్టమయిన ప్రియురాలి దగ్గరకు అతన్ని నెత్తినమోసికెళ్లి దిగవిడచిందనుకోండి. ఆమెకి పతివ్రత అని తక్షణం నామకరణం చేస్తాము. దాన్ని వో పురాణ కథకింద అల్లిపారేస్తాము; అల్లి మంచి డైరెక్టరుచేత ఫిలిము తీయిస్తాము. మన ఫిలిములన్నీ ఇప్పుడు పురాణయుగంలో వున్నాయిగా. ఆ ఫిలిముకి ముఖ్యంగా స్త్రీలే ఎక్కువ హాజరవుతారు, జనం తండోప తండాలుగా వొచ్చి చూస్తారు. ఫిలుముకి మొట్టమొదటి విడుదలలోనే తయారీ ఖర్చులు పోను లక్షా ఏభైవేలు మిగులుతాయి.

"అసలు విషయానికి రావేమిటి?" అంటుంది పాపాజీ. అసలెక్కడెత్తుకున్నానూ? ఆఁ... వొస్తున్నా—వొస్తున్నా. సేవాసదనమూ, శంఖుస్థాపనా... అప్పుడు నేనూ వున్నానక్కడ. తతంగమంతా అయిపోయింది. ఆమె కాంగ్రెస్ వాది. అందుచే చాలమంది కాంగ్రెస్ వాదులు వొచ్చారా సమావేశానికి. అదిసహజం. సాయంత్రపువేళ వారంతా వొచ్చిన్న తేనీటివిందు ఏర్పాటు చేసుకున్నారు తోటలో. ఆమెకూడా వెళ్లవలసివుంది. బయలుదేరవలసిన టైము కావచ్చింది. వాళ్లంతా కిందహాల్లో తొందర పడుతున్నారు. ఆమె ఎంతయినా స్త్రీ—కొడుకులూ, మనుమలూ కూడా వున్నారామెకి-అయినా "Woman's love of beauty is something sacred" అన్నాడొకనాడు మా సచ్చిదానందంపిళ్లె కాలేజీలో. ఆమె అలంకరించుకుంటోందనిఅనను. కాని స్త్రీ, అందునా, నలుగుర్లో మెలగవలసిన దేశసేవిక, అందుచే శుభ్రంగా వుండాలన్న తాపత్రయంలో కొంత కాలయాపన చేసినమాట నిజం. ఇంతట్లో ఆయనొచ్చాడు! ఎక్కణ్ణించో-ఆదరా బాదరా వొచ్చి ఫెఢేమని అన్నాడొక మాట "వెధవ ముండా—ఇంకా తయారు కాలేదా?— వాళ్లంతా తొందర పడుతున్నారక్కడ" అన్నాడు చట్టున-నా యెదట! నే నున్నానన్న జ్ఞానమైనా లేకుండా!! పెద్ద గలాటా జరుగుతుందనుకున్నాను నిజంగా. అంతమాటు సహిస్తుందా అనుకున్నాను. వెనక వో సాహితీసభలో కృష్ణశాస్త్రిగారు వుపన్యసిస్తూ టాగూరునీ, మహాత్మాగాంధీనీ దేశానికెట్లాంటివాళ్లో వివరించడంలో గాంధీజీని తమయింట్లో ఎప్పుడూ బుద్ధులు చెబుతుండే వితంతు పిన్నితో పోలుస్తూ స్త్రీలని గురించీ, చాదస్తపు వితంతువుల్ని గురించీ హేళన పూర్వకంగా స్పృశించి నట్టనిపించింది. తారాజువ్వలా లేచిందీమె. ఆపళంగా వోదణ్ణంపెట్టి యుక్తిగా తప్పుకున్నాడంత పెద్ద కవీను. ఆట్లాంటి ఆమె ఏమీలేదు "ఇదిగో వచ్చే... అయిపోయింది—అయ్యో . ..." అన్నదంతే-చిరునవ్వు

నవ్వుతో-కుచ్చిళ్లు సరిచేసుకొంటో-అచ్చంగా మా ఆవిడకి మల్లేనే! నాకు చిన్నతనమయిపోయింది చెప్పొద్దూ-మధ్య నాకు బావుంది కాదు.

"మరి నీకు ఆవిడంటే పూజ్యభావమన్నావు. భక్తి భావమన్నావు. అట్లాంటి ఆమెని పెనిమిటయితే మటుకు అంతమాట పెళ్లమని అనేస్తుంటే చూస్తో చెవులప్పగించి వూరుకున్నావా?" అంటుంది పాపాజీ.

కొంపమునిగింది. ఇట్లా ఇరుక్కున్నానేమిటి? అనాలిసిందే ఆయన్ని. "ఏమిటయ్యా-ఆమె అంటే మేమెంతో వున్నతంగా, పవిత్రంగా చూచుకుంటున్నాము. నువ్వేమో ఆవిడలో సహస్రాంశం చెయ్యవు. ఆమెను పట్టుకుని, ఇంత అనాగరికంగా, ఇంత అసభ్యంగా అనరాని మాటలంటావా?" అని ఝాడించాలిసింది. కాని, వెధవ మతిమరుపు! నాకీ వంక వకటున్నదిగా-ఆ సమయానికి ఆయన, ఆమె భర్తగారు అన్నమాటేగాని ఆమె నా దేశంకోసం, దేశ స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్న వొక వీరవనిత అన్న గుర్తేలేదు. ఆ సంఘటన తర్వాత నేననుకొంటో వుంటాను-ఈ మంత్రిత్వాలు వెలిగిస్తున్న స్త్రీలు, చైర్‌మన్లు చేసిన విదుషీ మణులు, మహిళామండలి సెక్రటరీలు, జెండా లెగరేశే దేశసేవికలు, వుద్యమాలు నడిపే వీరాంగనలు వీళ్లంతా మా ఆవిడికి మల్లేనే ఇంటో మాటలు పడుతూవుంటారా అని సందేహం నాకు. వీళ్లందర్నీ స్వతంత్రులననా, అస్వతంత్రులననా ఏమనాలీ అని?

"సర్కస్ సింహాలు" అంటుంది పాపాజీ. నిజమే ఆట వేళకి ఎరీనాలోకి రావడం, ఆటయిందాకా, ఎరీనాలో వొళ్లు విరుచుకుని స్వేచ్ఛగా నటించడం, ఆటయి పోగానే హంటరుముందు బోనులో దూరి నిశ్శబ్దంగా పడుకోవడం. ఇంతేనా?

"సరేలే-పోస్టుమేన్ వొచ్చాడు చూడు" అంటోంది పాపాజీ. శుభలేఖ. నాగేంద్రుడుగారబ్బాయికి మళ్లీ పెళ్లి కుదిరిందట. అసలు ఆ మొదటిభార్య చచ్చిన మర్నాటినించే సంబంధాలొచ్చాయట. పైగాపరమపదించినధర్మపత్ని చితిమీద దగ్ధపటలమయిపోతూ వుండగనే అక్కడ సమావేశమైన బంధుకోటి మాట్లాడుకోవాలట! ఏమనీ?

"అక్కడాపిల్ల వున్నది. ఇక్కడీపిల్ల వున్నది. ఆ పిల్లయితే ఈడూ, ఈ పిల్ల సాంప్రదాయం మంచిది-"ఈ ధోరణిలో. ఎంత క్రూరమైన ఆచారం.

"పురుషుడికి అనుకూలమైన ఆచారం" అంటుంది పాపాజీ. కాదుమరీ? అట్లా మాటలు జరుగుతుంటే, అక్కడికి చచ్చినావిడ అంతరాత్మ తృప్తిపొందుతుంది-అమ్మయ్య-ఇక మా ఆయనికి అట్టే నాగాలు లేకుండా సంసారం అవిచ్ఛన్నంగా సాగిపోయే సదుపాయమమిరింది అని శాంతి పొందుతుంది. ఆయన మళ్లీ పెళ్లిపీటలెక్కేదాకా ఆవిడగారి ఆత్మ అట్లా ఆవేదన పొందుతో వుంటుందన్నమాట పాపం. ఈఆచారానికి పునాదిరాళ్లు వేసిన ఋషులు ఎవరోగాని పురుషుడికి ఇబ్బందంటే ఎంత సానుభూతి! ఇకను, మొగుడు చచ్చీచావగానే స్త్రీకి ఎక్కణ్ణించో వొక విధవకళ రాంబందులా వొచ్చి వాలుతుందట మొహాన్ని. అసలు పెనిమిటి హరీ అంటాడనగానే పుణ్యస్త్రీకళ ఆమె ముఖారవిందంమీద ముందరగానే తొలిగిపొయ్యే సూచన్లవుపిస్తాయట స్పష్టంగా. అది మూటాముల్లె సర్దుకోవడము గట్టా ఆ చప్పుడుగూడా వినిపిస్తుందట. ఇహ చావగానే టుపీమంటో రెక్కలు గట్టుకుని ఎగిరిపోతుందంతే. ఇప్పుడిప్పుడు మాత్రం ఆ పుణ్యస్త్రీకళ అట్లా హడావిడిగా లేచిపోకుండా నాలుగు రోజులు పస్తాయించి అట్టేవుంటోంది. లేకపోతే ఆపిల్ల తీరా రెండోపెళ్లి చేసుకుందుకు సంకల్పించిందంటే మళ్లీ వెనక్కి తిరిగి రావాలసొస్తుందిగా!

ఆరోజు ప్రొద్దుట తెలిసింది నాకు, చంద్రంగారు రెండోపెళ్లిచేసుకుందుకు వొప్పుకున్నదట, భార్య కనకమ్మ. ఆయనకి సంతానంలేదు పాపం. 3 వేల ఎకరాలు వున్నది. అటు విశాఖపట్నంనుంచీ ఇటు మెడ్రాసుదాకా ఫ్యాక్టరీలేనా, కార్ఖానాలేనా వందలున్నాయాయనకి. ఆమె మొన్నటిదాకా పెనిమిటి రెండోపెళ్లి చేసుకుందుకు వొప్పుకోలేదట; పొలాలూ అవీ చేస్తున్న రైతులకీ, ఫ్యాక్టరీలు గట్రా, అవినడుపుతున్న పనివాళ్లకీ, రాసిచ్చేదామంటుంది తమ అనంతరం-ఆయనకీ, ఇహ సరేసరి—ఆయన తల్లీ, మరి ఇతర బంధువర్గానికీ "పుత్" అనే నరకం నోరు తెరుచుకుని కనబడుతోంది గడియ, గడియకూను! అందులోనూ ఆ సిష్టా

వారి మేనగోడల్ని చూచిందగ్గర్నించీ ఆయనకి ఆ నరకం తాలూకు, నోట్లో కోరలుకూడా మొలచినట్లు భీతావహంగా వుంటోంది. అందుచే, ఇక ఫైసలయిపోతుంది ఆ సంబంధం. ఆవిడ తన భర్త ద్వితీయ వివాహానికి అంగీకరించలేదని ఆమెనితిట్టనివాళ్లు లేరు ఇంతవరకూ.

"ఇంతకీ ఆమె వొప్పుకున్నమాట నిజమేనా ?" అంటుంది పాపాజీ. కాకపోవచ్చుకూడా. ఒప్పుకోకపోతే ఆగుతుందా ? వొకవేళ లోపల ఇష్టం లేకపోతేమటుకు సరే ననిపించేందుకు అదో బ్రహ్మప్రళయమా ? ఆమె ఏదో కొరకరాని కొయ్య గనక సరిపోయింది గాని మామూలు కులకాంత అయితే రెండు రోజులలో అవుననిపించి ఇంటి ముందు పెళ్లి పందిరి లేపెయ్యాదూ ? ఆయనకి మటుకు గట్టి నమ్మకమే, సిష్టావారిసంబంధంతో సంతానప్రాప్తి కలుగుతుందని. ఆ నమ్మకమట్లా వుంటుంది లెండి. కంటికి నదరుగా మరోపిట్ట కనిపించేదాకా అసలు సంతానప్రాప్తికి లేని కారణాలు, మద్రాసు మింటువీధిలోనుంచీ, బొంబాయి సఫేదు గల్లీనించీ, వొంట్లోకి దిగుమతయిన కారణాలు తన దగ్గిర పెట్టుకుని పున్నామనరకానికి భయపడుతున్నట్టు నటిస్తుంటే నవ్వొచ్చేదినాకు.

"ఇట్లాంటి నరకం ఆడదాని కోటి లేదుకాబోలు" అంటుంది పాపాజీ. వుంటే బాగానే వుండును. అప్పుడిహారోగం కుదురును "ఏమయ్యోయ్—నీతో పదేళ్లనుంచీ కాపురంచేస్తున్నాను. సంతానంలేదు చట్టు బండలులేదు. నేనింకొకర్ని కట్టుకుని బిడ్డలు కంటాను. మరి ఏమంటారు ?" అని అడిగేది. అన్నన్నా ! ఎంతమాటంది అని ముక్కుమీద వేలేసు కుందుము.



(61 వ పేజీ తరువాయి)

ఒప్పుకున్నా మన ధర్మ శాస్త్రాలు ఒప్పవు. పోనీ మన ధర్మశాస్త్రాలు ఎప్పుడో వాళ్లకాలంలో ఆ నాటికి సరిపడ్డట్లు వాళ్లు వ్రాసికొన్నారు. ఇప్పుడు మనం వాటిని పాటించడ మెందుకు, ఈ కాలము ననుసరించి మనం వెళ్లాలికాని అనుకొంటే ఇప్పటి ఈ బ్రిటిషు 'లా' కూడా ఒప్పదట. ఏలాగే యీ పెండ్లి ?

లీల : అమ్మా ! భగవంతుడేర్పరిచిన ప్రేమను మానవ నిర్మితములైన ఈధర్మశాస్త్రములు, ఈ బ్రిటిషు 'లా'లు ఇవేవీ అడ్డలేవు. ఒకవేళ పెండ్లి పనికిరాదంటే మాది ఆత్మ సంబంధమైన ప్రేమగాని భౌతిక సౌఖ్యముల కొఱకు మాత్రమే యేర్పడిన ప్రేమ కాదు. కాబట్టి మాకు పెండ్లితో నిమిత్తమేలేదు. ఇరువురము పెండ్లి లేకుండా బ్రహ్మచారులముగానే యుంటాము. నాకు డబ్బుతో పనిలేదు. మనిషిని, మనిషియొక్క యోగ్యతను ప్రేమించానుగాని ధనమును ప్రేమించలేదు. ఒకవేళ బలాత్కారముగా నా శరీరమును మరియొకరి కంటు గట్టవలెనని మీరు ప్రయత్నించినా అది మీకు సాధ్యముకాదు. నా మనస్సును మీరు మార్చ లేరు. ఆనక విచారించి లాభంలేదు. నేను గట్టిగా చెబుతోన్నాను.

ఇంట్లో ఎవరికీ కలెక్టరుగారి సంబంధం విడిచి పెట్టడం ఇష్టంలేదు. ఏవో ఇవన్నీ పుస్తకాల్లో చదువుకొన్న మాటలనీ ఊరికే అలా అంటుందేగాని పెండ్లయాక యేమి చేస్తుందనీ మహా చక్కగా ఉంటుందనీ అనుకొన్నారు. అందులోనూ ప్రసాదరావు పట్టు మరీ యెక్కువగా నున్నది. తన స్నేహితుడు, పెద్ద ఆఫీసరు, కుఱ్ఱవాడు, తన చెల్లెల్ని బాగా ప్రేమిస్తొన్నాడు. అలాటి వానిని వదులుకోటం ఏలాగా ?

అతను వచ్చేరోజులు సమీపిస్తొన్నాయి. ఇక వచ్చాక పెండ్లిచేసికొని వెళ్లి పోవడమే. వ్యవధియుండదు. లీలఇంట్లో వెల్లలు వేయించడం, రంగులు వేయించడం, పెండ్లి పనులు చేయించడం హడావిడిలో నున్నారు. శ్యామ ప్రసాదు స్నేహితులెవరో అతనికి వ్రాశారు. లీలకు కలెక్టరుతో పెండ్లి అవుతుందని. అతనికి పరీక్షలయి పోయాయి. ఇక యింటికి రావాలని ప్రయాణ మవుతోన్నాడు. లీల కీయడానికి ఒక చక్కని ఫౌంటెన్ పెన్, మంచి చెమికీ వేసిన కాలిజోడు, బెనారెసు జాకెట్టు గుడ్డ కొన్నాడు. పోష్టు బంట్రోతు ఉత్తరం ఇచ్చాడు. ఉత్తరం విప్పుతో ఉంటే ఎందుచేతనో అతనికి చేతులు వణికాయి. మనస్సు గాబరా చెందింది. ఉత్తరం చదువుతో ఉంటే కళ్ళ నీళ్లు క్రమ్మాయి.

* * *

(సశేషము).



# కామాక్షి కల్యాణము

: ఇందువచ్చు పాత్రులు :

| | | |
|---|---|---|
| పరబ్రహ్మసాస్త్రిలు | — | చరిత్రోపాధ్యాయుడు |
| పార్వతమ్మ | — | పరబ్రహ్మశాస్త్రిల భార్య |
| కామాక్షి | — | పరబ్రహ్మశాస్త్రిల కుమార్తె |
| శ్రీనివాసులు | — | పరబ్రహ్మశాస్త్రుల కుమారుడు. |
| | | ఇంకా, అల్లుడు, అతని స్నేహితుడు, |
| | | పాలమ్మ్మ గొల్లవాడు. |

[ఉదయవేళ : పరబ్రహ్మశాస్త్రిలు, ఏదో ఆలోచిస్తు వాలు కుర్చీలో కూర్చుని యున్నాడు. పార్వతమ్మ కామాక్షీ వంటఇంట్లో కాఫీ తయారుచేస్తున్నారు. శ్రీను, వాళ్ల నాన్నగదిలోనే ఒకమూల కూర్చుని పాఠాలు చదువుకుంటున్నాడు.]

శ్రీను : అరేరే, ఈవేళ శుక్రవారంకదూ! ఫస్ట్ పీరియడ్‌లో ఆ శుక్రాచార్యులు వచ్చి ప్రాణాలు కొరికేస్తాడు. హోమ్‌వర్క్ లెక్కలు ఒకటికూడా ఇంకా చేయలేదే.

పరబ్రహ్మశాస్త్రిలు : చీనూ, ఈవేళ శుక్రవారమా? నిన్న బుధవారం గదట్రా! నిన్న బుధవారమైతే ఈవేళ శుక్రవారమెలా గైందిరా? మొద్దురాచ్చిప్పా!

శ్రీను : నాన్నా, నీకు రోజుకు రోజు మరుపు ఎక్కువౌతున్నది. నేను చెప్పాలనుకుంటు న్నాను నిన్న బుధవారంకాదు, గురువారం. బుధవారం, శుక్రవారం మధ్యనున్న గురు వారాన్ని మ్రింగేశావు అలాగే నిన్న చరిత్ర పాఠం చెప్పినప్పుడు చంద్రగుప్త మౌర్యుని పిదప షాజహాన్ రాజ్యాని కొచ్చాడని చెప్పావు. పిల్లలంతా నవి అల్లరి చేశారు. ఆ గోలకు హెడ్‌మాష్టరు కూడ వచ్చేశాడే. నీవు ఏమిపాఠం చెప్పావో, పిల్లలెందుకు నవ్వారో కనుక్కోలేదు నీవు. ఎందుకు చెప్పవచ్చానంటే నిన్న గురువారం కదూ!

పర : ఔనౌను. ఈవేళ శుక్రవారమే, జ్ఞాపకం వచ్చినది. అమ్మాయ్, అమ్మాయ్.

పార్వ : (లోపలినుండి) ఏమండీ

పర : అమ్మాయ్, ఈవేళేనమ్మా.

పార్వతి : అమ్మాయికాదు, నేను పలుకత. ఏమిటి ఈవేళ ?

పర : ఈవేళనే ఆ ప్రొద్దుటూరి అబ్బాయి మన కామక్షిని చూడడానికి రావడం.

పార్వ : (బయటికొచ్చి) ఏమిటండీ! పై శుక్ర వారం కదా వస్తాడని వుత్తరంవచ్చినది.

పర : అయ్యయ్యో, ఏమి మతిపో, పాడు మరుపు. మొన్న ఆ అబ్బాయి మేనమామ బడికివచ్చి చెప్పిపోయాడు. ఆ అబ్బాయి

మాత్రం నేడు అమ్మాయిని చూడ మన ఇంటికి వస్తాడట.

పార్వ : బాగుంది వరస. ఆరంభంలోనే "అయ్యయ్యో" యని ఆరంభించారు. ఈ మాట, ఇంక రెండురోజు లాగి చెప్పలేక పోయారా? కానీండి, ఆ అబ్బాయితో కూడా ఇంకెవరు రారా? పెద్దవాళ్లు, ఆడ వాళ్లు ఎవరు రారా? మనము ఆ పిల్లవాని ముక్కు, మొగమెరుగమే, ఎలాగా?

పర : పిల్లవాడు ఈ కాలపు అబ్బాయి చదువు కున్నవాడు. అన్నీవాడే చూచుకుంటాడట. వాడే తీర్మానించుకుంటాడేమొ?

పార్వ : ఔను. ఏమి పిల్లలో, ఏమి కాలమో. పెద్ద వాళ్లక్కరలేదు. వాళ్లమాటామంతి, వీళ్లకు లక్ష్యమా. పాడుకాలం వచ్చినది. వాళ్లను అన నక్కఱలేదు. రోజులలావు న్నాయి.

పర : నీ సొద ఏమిటి మధ్య

పార్వ : మీకు నన్నాడి పోసుకోవడం తప్ప రెండో పనిలేదు. అమ్మాయ్, అమ్మాయ్, ఇటురా. (కామాక్షీ ప్రవేశం) వెళ్లి త్వరగా తల దువ్వుకుని, బాగా డ్రెస్ చేసుకో. ఆపౌడర్ కొంచెం పూచివేసుకో. రోజూలా పాముకోకు, దోసెపిండిలో పడ్డ ఎలుకలాగ.

కామాక్షి : (విచారముతో) నా అందానికి పౌడరు తక్కువైనది కాబోలు. ఈ పాడు పెళ్లి ఎవరిక్కావాలి? నేను రెండునెలలుగా ఒక రిబ్బన్ కావాలని ఏడుస్తున్నాను. కొని పెట్టేవారులేరు. దానికి దారి, తెన్ను అగు పడదు. పెళ్లి కొచ్చింది కాబోలు తొందర. వెధవపెళ్లి.

పర : మొదలుపెట్టావూ, నీసణుగుడుకు ఇదా సమయం? ఇలాగే నైజాముల్ముల్క్ పట్టం కట్టు కొన్న వెంటనే—

శ్రీను : అక్కయ్యా, నామాటవిను, నాన్న పట్టం అనగానే జ్ఞాపకం వచ్చినది. నిన్న సాయంత్రం, గాలిపటం చేసి వదిలాను కదూ, ఆ పటంతోకకు ఫస్ట్‌క్లాసయిన పట్టు చీర చింపికట్టాను. అది కావలిస్తే తీసుకొని రిబ్బన్‌గా వాడుకో

పర : ఏమిట్రా పాడెగట్టా, పట్టుచీర చింపావా?

పార్వ : బాగుంది పెళ్లి, అయ్యయ్యో, పాడుగట్టా యని మీరు ఆరంభించారు. వెధవ పెళ్లి, పాడుపెళ్లి యని అమ్మాయ్ మొదలెట్టినది. అవాచ్యములతో ఆరంభ మైన పెళ్లి ఎలా తెల్లారుతుందో. నాప్రార బ్ధము.

పర : నీవేమి, నాజూకుగా మాటాడుతున్నా వనుకుంటున్నావు కాబోలు

శ్రీను : అక్కయ్యా, ఆరిబ్బన్ కావాలా వద్దా. చిరిగిపోయిన పట్టుచీర నాన్నా. మన ఇంటి చీర కాదు. నాస్నేహితుడున్నాడే రాముడు, వాళ్ల అమ్మది.

పార్వ : అంత భాగ్యమా, నా మొహానికి పట్టు చీర కూడనా!

పర : సరే ఇదా సమయము, నేను పట్టుచీర కొనలేదని సాధించటానికి.

శ్రీను : అక్కయ్యా, ఆ రిబ్బన్ కావాలా వద్దా. త్వరగా చెప్పు.

పార్వ : పోరా, అధికప్రసంగీ. అది జాగ్రతపరచి నీపెళ్లాంవస్తే ఇయ్యి. వెళ్ళమ్మా, అమ్మాయి, మంచిదానివు కదూ. మొహం ముడుచుకోవడానికి ఇదా సమయము. పోయి త్వరగా తలదువ్వుకో. (భర్తనుచూచి) ఏమండీ, గంట ఎనిమిదౌతున్నది. ఇంకా ఆపాల వెధవరాలేదు. కొంచెం వెళ్లి చూడండి. వస్తే కేకలువేయండి.

పర : అలాగే, నీవువెళ్లి ఏదో సూక్ష్మంగా టిఫిన్ చేసి, కాఫీ కొంత ఎక్కువగానే కాచేయి. ఒక కప్పు ఎక్కువగా కాచు.

కామా : నాన్నా, ఇప్పుడే చెప్తున్నాను. వాళ్లంతా వచ్చి కూర్చున్నప్పుడు, 'ఆ పాటపాడు, ఈ పాటపాడు' యని నన్ను చంపొద్దు. ఎవరన్నా వస్తే నాప్రాణాలు కొరికేస్తావు. నాకీవేళ గొంతు రాసింది. బాగులేదు.

శ్రీను : నాన్నా, అక్కయ్యకు, తన సంగీత పాండిత్యం వచ్చేవారికి చూపాలని వున్నది. అది చెప్పడానికి ఇలాచుట్టు త్రిప్పి చెప్పు చున్నది. (కామాక్షి వంకతిరిగి) ఔనా, కాదా, అక్కయ్యా

కామా : పోరా, పెంకి వెధవా, (తండ్రివంకచూచి) నాన్నా, నా హార్మోనియం పెట్టెలో రెండు రీడ్లు పోయినవి. పెట్టె బాగులేదు. గొంతు రాసింది. కనుకనే పాడను. అందుకే ముందే చెప్పాను. శృతిలేకుండా ఎలాపాడడం ?

శ్రీను : నీ పాటకు శృతికూడానా ? నీ పాటకు హార్మోనీ శృతికలవదు. హార్మోనియం ఏమిటి, ఏవాద్య శృతీకలువదు. నీ గొంతుకకు సరియైన శృతినే కనిపెట్టాను.

కామా : కొలంబస్ ఏమిరా అది ? ఏమిటి కనిపెట్టావ్ ?

శ్రీను : మనవంట ఇంటితలుపు, తెరచేటప్పుడు, మూసేటప్పుడు చప్పుడౌతుంటుంది విన్నావా ఎప్పుడన్నా ? అదే నీ గొంతుకకు సరియైన శృతి.

(పాలవాడు ప్రవేశం)

పర : ఏమిరా, ఎందుకురా ఆలస్యం ?

పాల : ఆలస్యం అయిందండీ.

పర : (బడి జ్ఞాపకంమీద) ఆలస్యమైందా, సరే, బెంచిమీద నిలబడు.

(పార్వతి ప్రవేశం)

పార్వ : బాగుంది వరుస. వచ్చే అల్లున్నికూడా బెంచిమీద నిలపెట్టారా ఏమిటి ? (పాలవానితో) ఒరే, గోవిందూ ఎందుకురా ఇంత ఆలస్యం ? ఎన్నిమార్లు చెప్పినా, మానోరు నొప్పిపుట్టవలసినదే కాని, నీ గుణం నీవు మానవుకదా ? ఊ, పోయి, ఏమిరా ఈ అన్యాయం, నీళ్లల్లో పాలు చూపిస్తున్నావు కదామరీని !

పాల : నేనేమి చేయనమ్మా, ఎండలుమండి పోతున్నవి కదా. ఆవు తిండికూడా తినక నీళ్లతోనే పొట్ట నింపుకుంటున్నది. అదేనమ్మా, మరేమి కాదు.

[పాలవాడు నిష్క్రమించును]

(ఒక క్రొత్త వ్యక్తి ప్రవేశం)

క్రొత్త వ్యక్తి: స....స....స స సార్, ప ప ప ప. పర....పర....పర....పర.

పర: ఎవరయ్యా, స స, ప ప యని సంగీతం పాడుతున్నావు. పర పర యని పర పర లాడిస్తున్నావు

క్రొత్త: నే....ను....ప్రొ....ప్రొ....ప్రొ.

పర: త్వరగా చెప్పి ఏడవరాదు. నేను పరదేశిని. ప్రొద్దుటినుండి వస్తుఉంటున్నావా?

క్రొత్త: మిమ్ములను చూ....చూ....చూడ

పర: నన్ను చూడడానికా, చూచి అయింది కదా, పోయిరండి. మీబోటి వాళ్లను సింపథైజ్ చేయకూడదు. పొండి పొండి. నాకు పనుంది.

(కామాక్షి శృంగారించుకొని ప్రవేశం)

కామా: నాన్నా, వాళ్లంతా వచ్చేవేళైంది. ఎవరో పిచ్చివానితో బాతాఖానీ పెట్టుకొన్నావే. మంచి వేళకేవచ్చాడు ఎవడో కాని. ఆవెర్రాడితో మాటలేమిటి? లోపలికొచ్చి చొక్కా తొడుక్కో, కాఫీ పుచ్చుకో.

క్రొత్త: ఈ....ఈ.....ఈమె....మీ....మీ.. .. మీ....మీ....అ....మ్మాయా?

పర: (కోపముతో) కాదు. మా అమ్మమ్మ. మీ రెవరండీ? ప్రొద్దున్నే మా ఇంటికొచ్చి వాగుతున్నారు. మీకు ముష్టేమిటి? ఏ హోటేలులోనో పిండి రుబ్బిబ్రతుకవచ్చునే, సాండోలావున్నావు. పరదేశిని, వస్తుని, మా ప్రాణాలు తీయకుంటే! ముష్టికొచ్చిన వాడికి చలవ పంచేమిటి, సిల్కుజుబ్బా ఏమిటి? అబ్బాయి, ఈయనను బయటికి పంపించు (లోపలికొచ్చును).

శ్రీను: మిస్టర్, జావ్, కదలండి, ఎన్నిమార్లు చెప్పాలి వెళ్లమంటుంటే

క్రొత్త: అ . . బ్బాయి.... నే....ను....ప్రొ....ప్రొ ప్రొద్దు.

శ్రీను: ప్రొద్దుటి నుండి ఏమి పుచ్చుకోలేదా? ఆకలికి మందువస్తే. ఈ వేళ మా ఇంట్లో విశేషం. క్రొత్తవాళ్లంతా రాపోతారు. మీరు త్వరగా దయచేయండి.

(క్రొత్త మనిషి నిష్క్రమించును)

పార్వ: పాపం, ఎవరో నత్తివాడు అమాయకుడులా వున్నాడు. అతనేమి చెపుతున్నాడోకూడా వినకుండా. తండ్రి కొడుకులిద్దరు, ఎందుకిలా ఆర్భాటం చేస్తున్నారు?

పర: సరే, అల్లుడొస్తే ఎలా మరియాద చేయడం ఎలా పలుకరించడమని నేను తీవ్రముగ ఆలోచించే సమయంలో పానకంలో పుల్లలా వచ్చాడు. వాడిమాటలు వింటుంటే నాక్కూడా నత్తి వచ్చేటట్టున్నది.

పార్వ: ఒకవేళ ఇతనే అల్లుడేమొ!

పర: ఛీ, పో, అప్రాచ్యురాలా, నీ కేమన్నా పిచ్చా? మరేమన్నానా? పిల్లవాడు వాచాలకుడు. బుద్ధిలో బృహస్పతి. మాటాడితే ఈ వేళంతా మాటాడగలడు. కాలేజిలో నాటకాలువేసి మెడల్సు కూడా పుచ్చు కున్నాడని పిల్లవాని మేనమామ చెప్పాడు.

పార్వ : ఇప్పుడొచ్చినతనుకూడా ఈ వేళంతా మాటాడగలడు. ఒక మాట చెప్పడానికి తొమ్మిదిగంట లౌతున్నది కదా. ఇలా మాటాడితే ఒక సంగతి చెప్పడానికి, ఒక రోజంతా అవదూ ?

పర : ఏమిటే, మతి పోతున్నదా ఏమిటి, అల్లుని కాలిగోరు సాటికైనా ఇతడి డౌనా ? అటామిక్ బాంబుకు అమ్మవారి గుడి అదిరు వేట్‌కు భేధంలేదూ ? ఎవడో ముష్టి వాన్ని అల్లుడని మొదలు పెట్టావ్.

(కొంత సేపటికి)

పార్వ : ఏమండీ, ఇంకా ఎవరూ రాలేదే ?

పర : వస్తారు, రాకేం చేస్తారు. ఈ వేళ తప్ప కుండా వస్తామని కబురు చేసారు.

శ్రీను : అక్కయ్యా, బావ వచ్చే వేళైంది. ఇంకా ఒక కోటింగ్ పౌడర్ పూసుకో.

(టాకు టీకుగా వస్త్రాలు ధరించుకొని ఒక వ్యక్తి ప్రవేశం ?)

క్రొత్త : సార్, పరబ్రహ్మశాస్త్రి గారిల్లిదేనా ?

పర : ఔనౌను. దయచేయండి. నేనే, నేనే పర బ్రహ్మశాస్త్రిని. రండి, కూర్చోండి. ఇప్పు డేనా రావటం ?

క్రొత్త : ఔను. ప్రొద్దుటూరినుండి,

పర : (ఆయన మాటకు అడ్డు తగిలి) ఇప్పుడు ప్రయాణాలు చేయడం బహు కష్ట మండీ. ప్రయాణాలు, ప్రాణాంప కాలే. ఉండండి. కాఫీ తెప్పిస్తాను. పుచ్చుకొని సావకాశంగా మాటాడొచ్చు. (కుమారుని వైపుతిరిగి) అబ్బాయ్ మీ అమ్మతో చెప్పి, కాఫీ, ఫలహారం కామాక్షి చేత ఇచ్చి పంపమను.

క్రొత్త : వద్దండీ. నేను త్రాగి వచ్చాను. శ్రమ పడకండి.

పర : ఫరవాలేదు. శ్రమేమిటి మీ కోసం ఎదురు చూస్తున్నాం తయారుగానే వున్నది. మోమాట పడకండి. మా అమ్మాయి గొప్ప అదృష్టవంతు రాలండి. నేనే చెప్పుకో కూడదుకాని, గుణాలకుప్ప. యోగ జాతక మని ప్రతి జోస్యుడు చెపుతున్నాడు. ఆ అమ్మాయిని చేపట్టడం వల్ల మీరు అదృష్ట వతుంలే. మీ జాతకం కూడా యోగ జాతకమే అయివుండాలి.

క్రొత్త : చిరునగవుతో ఒక చిన్న మనవి.

పర : ఏమిటది. మోమాట పడకుండా చెప్పండి

క్రొత్త : నేను మీ రనుకొన్నట్లు మీ అల్లున్ని కాను.

పర : (ఆశ్చర్యముతో) ఆ మీరు కారు, మీ తమ్ముడా ?

క్రొత్త : కాదండి. మా వాళ్లెవ్వరూ కారు. కొంతసేపటి క్రిందట, ఇక్కడికొచ్చి వెళ్లాడే, ఆయన. సరియైన మర్యాదలే జరిపారట. ఇక్కడ జరిగినదంతా వెంటనే నాతోవచ్చి చెప్పాడు. నే నాయన స్నేహితుణ్ణి.

పర : (ఆలోచించి) ఇక్కడి కెవరూ రాలేదే.

క్రొత్త : మా వానికి కొద్దిగా నత్తిలెండి. మీరు అదలించేటప్పటికి ఆ భయములో మాట పెగలలేదతనికి. ఆ సమయంలో అతనికున్న నత్తి అందుకున్నటున్నది. వాడి తెలివలా

వుంది. వెంట ఎవరిని తీసుకరాకుండా వచ్చిన ఫలం వెంటనే దొరికింది.

పర : (తెల్లపోయి) అయ్యయ్యో, అతనా, నేను పొరబాటు పడ్డాను, ఎవరో అనుకున్నాను. ఎంత ఓర్పు! బంగారు వంటి గుణం. దివ్యమైన తేజస్సు 'నేనే మీ అల్లుణ్ణి' అని ఒకమాట వెనుక, ఎంతసేపు నత్తిగా మాటాడినా ఈ పొరబాటు జరిగి వుండక పోను. ఏదో అయినదయి పోయినది. నేను మీతోవస్తాను. ఇద్దరముపోయి, ఆయనను క్షమాపణ కోరుకొని, సమాధాన పరచి పిలుచుక వస్తాము.

క్రొత్త : నేనుక్షమాపణ కోరవలసిన అవసరము లేదే.

పర : లేదు లెండి. నేనే కోరుకుంటాను లెండి. ఎలాగో ఆయనను ఇక్కడికి పిలుచుక వస్తాము. మీరు సాయంచేయాలి.

క్రొత్త : ఎందుకూ ? ఆయన మరల ఇక్కడికి రావలసిన అవసరము లేదే. ఆయన మీ అమ్మాయిని చూడడం అయినదిగా.

పర : (ఆశతో) ఆ. .ఆయన కిష్టమేనా, ఈ నెలలోనే ముహూర్తం పెట్టొచ్చా ?

క్రొత్త : ఆయనకు, ఒకే ఒక్క సందేహమట.

పర : (ఆత్రముతో) ఏమిటది ?

క్రొత్త : ఏమీలేదు. పెళ్లికిముందే పిచ్చివాడన్న పిల్ల పెళ్లైన వెనుక ఏమంత లక్ష్యపెట్టుంది అన్న అనుమానం ఒకటి. అదికాక ఆయనకు జీతం 100 రూపాయిలే. అది మీ అమ్మాయి ఫేస్.పౌడరుకు చాలునా యని. ఇవన్నీ ఆలోచించుకొని ఈ సంబంధం చాలించుకున్నాడు. నాతో చెప్పాడు. నే మీతో చెప్పాను. ఇక సెలవు పుచ్చుకుంటాను. (నిష్క్రమించును)

పర : (విచారముతో) అయ్యయ్యో, మంచి సంబంధం, చేయిదాటి పోయినది.

పార్వ : మంచి సంబంధమా ? ఏ విషయాన మంచి సంబంధం ?

పర : పిచ్చిదానా, మన కామాక్షేమన్నా అతను తటాలున జవాబు చెప్పడు. అతనొక మాట చెప్పే లోపున, అమ్మాయి ఒక లెక్చర్ కొట్టేయవచ్చు. ఎక్కువ మన స్తాపములు రావు. చిల్లికయ్యాలు లేవు. కామాక్షికి లొంగివుంటాడు. ఇవన్నీ మంచివి కావూ ?

పార్వ : చాలు, చాలు. ఆ అబ్బాయి ఒకమాట చెప్పేటప్పటికి ప్రొద్దు గూకుతుంది. ఇష్టముగ మన అమ్మాయిని చేరదీసి, ముద్దుపేరు పెట్టి పిలిచేలోపల, అమ్మాయి అవ్వ అయి పోతుంది. ఏమో చెప్పవచ్చారు. చాలు వేరే ఏదైనా చూడండి

"అక్క"



# తమాషాకి

శ్రీ మంత్రిప్రగడ వేంకటరమణారావుగారు

అవి
శ్రావణమాసపు
శోభనదినాలు!
ఎచ్చటచూచిన
నోములువ్రతాలు!
పేరంటాళ్లు
గలగల్లాడే
పిల్లలతో
బజార్లన్నీ
నిండారు!
నాజూకుచీరలు
నగిషీరవికలు
బంగారునగలు
బంతిపూలతో
యెంతోయింపుగ
వున్నారు!

* * *

ఆరోజుల్లో
మాయింటికి
పిలవాలని
పిల్లలతో
మాఆవిడకోసం
మాలతికూడ
వచ్చింది!
అప్పుడునే
కర్మంజాలక
వాకిట్లోనే
కుర్చీవేసుక
కూర్చున్నా!
బలేతీరిగ్గా
పత్రికచూస్తూ
కూర్చున్నా!
వచ్చినఆమె
వూరికెవెళ్లక
నన్నే 'ఏమండీ' అని
పలుకరించింది—
లోపలవుందేమో!
చూడండంటూ
చెప్పేనామెకు!

* * *

యింటావిడ
అటుప్రక్క
వాళ్లింటికెందు
కెళ్లిందోమరి!

* * *

ఆవిడలోపల్లేదు
అందాకాకూర్చుంటా
నంటూఅక్కడే
నాదగ్గిరసా
కూర్చుందామె!
నిజానికిమాకు
మాటామంతీ
యేమీజరగలే.
అయితేమటుకు
ఆమెతల్లో
జాజిపూలు
పరిమళించి
నన్నెంతో
ఆకర్షించాయ్!
ఆమెపైటను
అలదుకొన్న
పరిమళాలు
గుప్పుమంటూ
పల్కరించాయ్!
ఆమెజరీచీరపై
జిల్కులతలపై
వ్రాలినచిలుకలు
పలుకులెన్నో
వొలకబోసాయ్!

* * *

ఇంకేముంది!
కొంపమునిగింది!
మాఆవిడ
లోపల్నుంచే
నిప్పులుగ్రక్కే
చూపులతో
నన్నిట్టే
కాల్చేస్తూ
చూచింది!
బొట్టెట్టిఆవిడ
బంగారపుబొమ్మ
మాలతీదేవి
అలావెళ్లిందేమో!
యింకచూచుకోండి!
ఎక్కడలేని
కోపంవచ్చిఆ
కోపంతో
అనేసింది.

* * *

ఎందుకోఆమె
కింతకోపం
అనుకుంటూ
వుంటాను!
కాని,
నవ్వుతూన్న
నా 'రాణీ' కంటే
కోపంతోమెరిసే
నా 'వేణీ' పై
నాకెంతోయిష్టం.
ఎందుకంటారా?
ఆమెకుకోపంవస్తే
మరింతఅందంగా
మరింతచక్కగా
కానొస్తుంది!
కాదండిమరీ!



బాలానందము — చిరంజీవి మ. సుభాషిణి.

# తెలివిగల రాజకుమార్తె

[పూర్వకథ—అమరావతి అనే పట్టణాన్ని వీరసింహుడనే రాజు పాలిస్తూండేవాడు. ప్రజల కోర్కెలను తెలుసుకోవాలని వీరసింహుడు, అతని మంత్రి రాత్రిసమయంలో మారువేషాలతో పట్టణంలో తిరుగుతూవుండేవారు. ఒకరాత్రి ఒక బీద బ్రాహ్మణుని యింట్లో ముగ్గురక్కచెల్లెండ్రు తమ వివాహవిషయమై వారి అభిప్రాయాలను చెప్పుకుంటూ వుంటారు. రాజు అది విని మరుసటిరోజున వారిని వాని కోరికల ప్రకారం, పెద్ద ఆమెను వంటువానికి, రెండవ ఆమెను సేనాపతికి యిచ్చి మూడవ ఆమెను తానే వివాహం చేసుకుంటాడు. అక్కలిద్దరు చెల్లెలి వైభవానికి ఓర్వలేక ఆమెను అవమానించాలని యెదురుచూస్తూ వుంటారు. కొన్ని సంవత్సరాల తరువాత రాణికి ఇరువురు మగపిల్లలు, ఒక ఆడపిల్ల కలిగారు. కాని, ఆమె అక్కలిద్దరూ ముగ్గురు పిల్లలనూ పుట్టినవెంటనే ఒక పెట్టెలోపెట్టి నదిలో వదిలివేస్తారు. మూడుసార్లు, ఆరాణి పక్కలో పందిపిల్లను, కుక్కపిల్లను పెట్టి ఆమెను అవమానపరుస్తారు. ఈ ముగ్గురు పిల్లలు నదిలో కొట్టుకొనిపోయి ఒక వనపాలాధిపతికి దొరుకుతారు. అతడు వారి ముగ్గురనూ పెంచి పెద్దలనుచేసి ఒక భవనంలో వుంచుతాడు. కొంతకాలానికి అతడు చనిపోతాడు. ఒకరోజున వారింటికి ఒక ముసలి అవ్వవచ్చి వారి భవనాన్ని చూసి ఆ పిల్లతో భవనం చాలా బాగుంది, కానీ ఆ భవనంలో ఒక మాట్లాడే చిలుకవుంటే ఇంకా శోభిస్తుందనీ చెప్పి ఆ చిలుకవుండే స్థలాన్ని చెప్పి వెళ్ళిపోతుంది. ఆ పిల్ల తన అన్నలు రాగానే ఆ విషయం చెపుతుంది. ఆమె పెద్దన్న ఆ అవ్వచెప్పిన మార్గంగా వెళ్ళి ఒక మునిని కలుసుకుంటాడు. ఆ ముని రాజకుమారుడు వెళ్ళవలసిన మార్గాన్ని చెప్పి, అలా వెళ్తూంటే నవ్వినట్లు, పిలిచినట్లు వినిపిస్తుందనీ, ఆ సమయంలో వెనక్కిచూస్తే రాయిగా మారుతాడనీ, అందువల్ల చాలా జాగ్రత్తగా వెళ్ళాలనీ బోధిస్తాడు. రాజకుమారుడు వెళ్తాడు. తరువాత కథ చదవండి.] —సం॥

రాజకుమారుడు వెళ్తున్నాడు. పాపం! సగం దూరం వెళ్లేటప్పటికి ఎవరలా అరుస్తున్నారని వెనుకకు తిరిగిచూచాడు. ఇంకేముంది. రాజకుమారుడు రాయి అయిపోయాడు.

ఇక్కడ మన రాజకుమారి ప్రతిరోజు, ప్రతి నిమిషము పువ్వులదండను చూస్తూ ఉండేది. ఆరోజుకూడా మామూలుగా పువ్వులదండ తీసి చూసింది. అది నల్లగా వాడిపోయింది. రాజకు

మారి విచారపడింది. అప్పుడు చిన్నన్నయ్య ఆమెను ఓదార్చి "చెల్లీ ! నీ వేమి విచార పడ నవసరములేదు. నేనువెళ్లి ఎలాగైనా ఆ చిలుకను, అన్నయ్యను తీసుకువస్తాను" అని చెప్పి ఒక కత్తిఇచ్చి, అది గనుక త్రుప్పు పట్టితే తాను చనిపోయినట్లు అనుకోవాలి అని చెప్పి ముని దగ్గరకు వెళ్లాడు. ముని అతని అన్నకు చెప్పిన విధంగానే ఇతనికికూడా చెప్పాడు. ఏమి దుర దృష్ట మోకాని ఇతడు తన అన్నయ్య మాదిరే వెనుకకు తిరిగిచూచి శిల అయి పోయాడు.

'గోరు చుట్టుపై రోకటి పోటు' అన్నట్లు అసలే రాజకుమారి తన పెదన్నయ్య చనిపోయాడని ఏడ్చి ఏడ్చి అలసిపోయింది. ఇప్పుడు తన చిన్నన్నయ్య కూడా చనిపోయాడని తెలియగానే ఇంకా ఏడ్చి యేడ్చి మూర్ఛిల్లింది. కొంత సేపటికి తెప్పరిల్లుకొని ఏమైనా సరే తానేవెళ్లి తన అన్నయ్యలను, చిలుకను తీసుకొని రావాలను కొన్నది. వెంటనే ఒక వీరుని లాగవేషము వేసుకొని వెళ్ళి మునికి నమస్కరించి సంగతి అంతా తెలిపింది. ముని వాళ్లిద్దరికి సమాధానం ఇచ్చినట్లే యీామెకు కూడా ఇచ్చాడు. మన రాజకుమారి తెలివైనది కనుక చెవినిండ దూది పెట్టుకొని ఎవరెన్ని కేకలు వేసినా కూడ లెక్క చేయకుండ వెళ్లి పంజరంతో సహా చిలుకను పట్టుకుంది. వెంటనే ఈ శబ్దాలు, అరుపులు అన్నీ అణిగి పోయినవి. ఆ పంజరం దగ్గరనే ఒక పాత్రలో అమృతం వున్నది. ఆమె ఆ అమృతాన్ని అక్కడ వుండే శిలలపైన చల్లింది. ఆ శిలలు తక్షణమే రాజకుమారు లయ్యారు. వారిలో ఆమెకు తన ఇద్దరు అన్నలు కూడ కనుపించారు వారిద్దరు తమ చెల్లెలిఘన కార్యానికి మెచ్చుకొని చిలుకతో కూడ సంతోషంగా వాళ్ల భవనం చేరు కున్నారు. అప్పటి నుండి వాళ్లు ముగ్గురు చిలుకతో కబుర్లు చెప్తూ వాళ్లు ఏమి చెయ్యాలన్నా దాన్ని అడిగి చేస్తూ సంతోషంగా కాలం గడుపుతూ వున్నారు.

ఒకరోజు వీరసింహుడు వేటాడటానికి వీళ్లున్న అడవికే వచ్చి చాల అలసి పోయాడు. ఎక్కడైనా కాసిని మంచినీళ్లు దొరుకుతాయేమో అని నాలుగు ప్రక్కల చూచాడు. అతనికి ఒక మూల ఒక పెద్ద భవనం కనబడింది. అక్కడికి వెళ్లి తలుపు తట్టాడు. వెంటనే మన రాజకుమారి తన అన్నలకు ఎవరో క్రొత్త అతిథి వచ్చాడని తెలియపరచింది. వాళ్లు వీరసింహునికి తగిన మర్యాదలుచేసి భోజనంచేసి వెళ్లమన్నారు. రాజుకి అసలే ఆకలిగా ఉండటం వలన సరే అన్నాడు. అలవాటు ప్రకారము రాజకుమారి చిలుకను ఆరోజువంట యేమిటి చేయాలని అడిగింది. దానికి చిలుక రవ్వల అన్నం, ముత్యాల కూర, పగడాల పులుసు చేయమన్నది. రాజకుమారి కూడ సరేనని అలాగే తయారు చేసింది.

రాజకుమారి తన అన్నయ్యలకు, అతిథికి విస్తళ్లు వేసి వడ్డించింది. అప్పుడు రాజు "ఇదేమిటి అమ్మాయి! ఇలాగ వీటితో వండితే ఎలా తినడం ?" అని అడిగాడు. అప్పుడు పంజరంలో వున్న చిలుక, "ఓ వెర్రిరాజా ! నీకుపంది, కుక్క మొదలగు పిల్లలు పుట్టి నప్పుడు ఈ అన్నంతి నటంకష్టమా ?" అని ప్రశ్న వేసింది. రాజుకి

ఆశ్చర్యంవేసి "అయితే నాకునిజంగా పిల్లలున్నారా ?" అని అడిగితే అపుడు చిలుక "వీళ్లు ముగ్గురు నీ పిల్లలే. తమ చెల్లెలు రాణి అయినదన్న అసూయతో ఆ తుంటరి అక్కలిద్దరు ఇంత వరకు తెచ్చేరు" అని సంగతంతా మొదటినుంచి చెప్పేసింది. రాజుకి సంతోషం, కోపం రెండూ ఒక్కమాటే వచ్చాయి.

వెంటనే తన రాజ్యానికి వెళ్లి ఆ ఇద్దరు మోసకత్తెలకు వురిశిక్ష వేయించి, తన భార్యను చెఱసాలనుండి విడిపించి, క్షమార్పణ అడిగి, జరిగిన కధంతా పూస గ్రుచ్చినట్లు ఆమెకు చెప్పాడు. తరువాత తమ పిల్లలతో కూడా సుఖంగా రాజ్యాన్ని వెయ్యేండ్లు పాలించాడు.

కథ కంచికి, మనమింటికి.



# మాటకారితనం

శ్రీ చల్లా సత్యనారాయణశర్మగారు

ఒక వూరిలో రామశాస్త్రి అనే పండితుడు వుండేవాడు. ఆయనమంచి మాటకారి. కాని, ఆయన నిరుపేద.

ఆ వూరిలోనే వీరయ్య అనే ధనికుడు వుండేవాడు. అతను ఎంత ధనికుడో అంత మూర్ఖుడు. అతను ఎందరినో పండితులను అవమానించెడివాడు. ఒకసారి రామశాస్త్రి వీరయ్య యింటికి వెళ్ళాడు. అప్పుడు వీరయ్య ఒక సోఫాలో కూర్చుని వున్నాడు. శాస్త్రి వీరయ్యకి నమస్కరించి, సోఫాలో అతని ప్రక్కన కూర్చున్నాడు. శాస్త్రి లాంటి నిరుపేద తన సోఫామీద, తన ప్రక్కన కూర్చోవటం వీరయ్యకి ఎంతో అవమానంగాతోచింది. అతను తనలో యిల్లా అనుకున్నాడు." ఇల్లాంటి దరిద్రుడు నా ప్రక్కన కూర్చోవటంనాకెంతో అప్రతిష్ట. చూడగా వీడెవడో పశువులా కనపడుచున్నాడు. వీడిని నాలుగు తిట్లు తిట్టి పొమ్మంటా." ఇల్లా అనుకుని శాస్త్రితో యిల్లా అన్నాడు.

"ఏయ్ ! నీకు బుద్ధిలేదూ ? నాలాంటి వాడి ప్రక్కన కూర్చొన గలిగే అదృష్టం నువ్వు కొన్ని జన్మాలు తపస్సు చేసినా నీకు పట్టదని తెలియదూ ? నీకు, పశువుకు తేడా ఏమిటీ ?"

ఈ మాటలు వినగానే రామశాస్త్రి ఎంతో విచారించాడు. తన పాండిత్యాన్ని చూపి వీరయ్య వద్ద ఏదైనా బహుమతి పొందు దామనే ఆశతో వచ్చిన రామశాస్త్రికి ఈ మాటలు ఎంతో విచ్చారాన్ని కలుగ చేశాయి ! ఇంతలో ఆయనకి ఒక ఆలోచన తట్టి, వీరయ్యకి, తనకి మధ్య వున్న దూరాన్ని చేతితో కొలిచాడు. మాటకారి అయిన రామశాస్త్రి ధనికునికి యిల్లా జవాబిచ్చాడు. "అయ్యా! నాకూ, పశువుకూ ఎక్కువ తేడా లేదు ! కేవలం. ఒక మూరెడు దూరం మాత్రమే వుంది ! నేను పశువుకి ఒక మూరెడు తేడాలో మాత్రమే వున్నాను.

ఈ సమాధానం వినగానే ధనికుడు సిగ్గుతో తల వంచుకున్నాడు.

చూచారా, రామశాస్త్రిమాట కారితనం ?

(హిందీ ఆధారం)



# కొంటె కుఱ్ఱవాని విజ్ఞాన పరిజ్ఞాన అజ్ఞాన పర్యవసానములు

రచన· కవికొండల వెంకటరావుగారు

ఉపాధ్యాయుడు: చెట్టునుండిపండు పడుతూంటే న్యూటన్ ఏమిచేశాడు? సరిగా జవాబు చెప్పే వానికి బహుమతి.

ఒకమగపిల్లవాడు: నోరుపట్టాడు.

ఒకఆడపిల్ల: వొడిపట్టాడు.

కొంటెపిల్లవాడు: పండుపట్టాడు.

ఉపాధ్యాయుడు: అసలుసంగతి భూమి యొక్క ఆకర్షణశక్తిని కనిపెట్టాడు. అయినా బహుమతి మీలో మూడోవానికే: ఎందుకో తెలుసా?

ముగ్గురు: తెలియదండీ.

ఉపాధ్యాయుడు: ఏదిపడిందో అది పట్టినట్టు సరిగా చెప్పాడుగనుక తెలిసిందా పారం?
"పండుపడటం: పండుపట్టటం"

*  *  *  *  *  *

"చిన్నపిల్లికి చిన్నకన్నం - పెద్దపిల్లికి పెద్దకన్నం చేసినాడేగాని న్యూటన్ - గండుపిల్లిని మఱచినాడు"

అని, ఒకానొకప్పుడు గోడపడగొట్టూ, కొంటెపిల్లవాడు,

"అతనుగొప్పా, నేనుగొప్పా"

అని, తల్లిచేతతానే గొప్పవాడ ననిపించుకున్నాడు.

*  *  *  *  *  *



## కొంటె కుఱ్ఱవాని విజ్ఞాన పరిజ్ఞాన అజ్ఞాన పర్యవసానములు

కొంటెపిల్లవాడు :—

"వంటయింటి గూటినుండే
చిన్న భగవద్గీతపాత్రము
అట్టపోగ మారింది కాబోల్
బెల్లపచ్చని నేనుదీయ
ఇల్లువాకిలి చీమలేనే."



తల్లి : చూచినావా బెల్లంముక్కను.

పిల్ల : దాచినావా బెల్లంముక్కను.
నీవుగొప్పా ? నేనుగొప్పా ?

అంటూతల్లి నెవ్వెర పోతూఉంటే తానుబెల్లం ముక్కనోట్లో వేసికున్నాడు.

* * * * * *

"అత్తరో నీకోక అంచుకు
తోగరులేదేం ? దొడ్డదానవు !"
అంటు ఆమె తలుగుదుంపను
నగిషిదొలిచి నవ్వొశిష్యుడు,
మేనయత్త మేనుమీద,
అద్దెనాడెల అద్దకంబు !
ఆమెవాని వీపుమీద
వేసినాదొక వీశెగుద్దు ;
"అమ్మదగ్గఱ పోవుగొప్ప.
అత్తదగ్గఱ పనికిరాదోయి.
వెఱ్ఱిపిల్లడ ! కుఱ్ఱపిల్లడ !"

అంటేమన కొంటెపిల్లవాడు కళ్లనీళ్లుగార్చేడు.



# వజ్రాలకథ

*** శ్రీ పాన్యం అన్నపూర్ణాదేవిగారు ***

స్త్రీల చెవులలో కమ్మలు లోలాకులు తళతళ మెఱియుచున్నవి. ఆ ప్రకాశమెక్కడిది? వజ్రములలోనిదే. వజ్రములు మనకెట్లు లభించెనో ఆ విషయమునుగూర్చి ఒక చిన్న గాథగలదు.

డాక్టరు పర్కినీసు అనునొక ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు 18 వ శతాబ్ధములోని వాడు. అతడు ప్రకృతి పరిశోధన కొఱకై ఆ కాలపు నావల మీద ఫ్రాంన్సుదేశమునుండి హిందూదేశమునకు వచ్చుచుండెను. ఆరోజులలో ఇప్పటివలె నావలు ఆవిరియంత్రములవలన వెళ్లెడివికావు తెరచాపల వలన ఋతుపవనముల ననుసరించి ప్రయాణము చేయు చుండెడివి. అప్పటికే కొన్ని సంవత్సరముల క్రిందట వాస్కోడిగామా అను పోర్చుగీసు దేశస్థుడు దక్షిణాఫ్రికా మార్గముగ గుడ్‌హోపు అగ్రమునుచుట్టి ఐరోపానుండి హిందూదేశమునకు సముద్రమార్గమును కనిపెట్టి యుండెను. పర్కినీసు దొర ఆ మార్గమున ప్రయాణము చేయుచు దక్షిణాఫ్రికాలో కొన్ని రోజులు ఋతుపవనము కొఱకు వేచియుండవలసి వచ్చెను. అతఁడు సముద్రతీరము నుండి మిట్ట ప్రదేశమునకు వెళ్లి పరిశీలించెను.

ఆ దేశపుజనులను నీగ్రోలని పిలుతురు. వారు నల్లని శరీరముకలిగి పెద్ద పెదవులతో చూచుటకు తోకలేని కోతులవలె కురూపులై యుందురు. ఆ నీగ్రోపిల్లవాండ్రు గోలీ లాడుచుండుటను మన దొరగారు చూచెను. ఆ గోలీలు గుండ్రని గులక రాళ్లు. ఆటలో ఆ గోలీలు పగిలిన, క్రొత్తరాళ్లను తీసికొని పాతవానిని పార వేయుచుండిరి. పగిలిన రాళ్లు తళతళ మని మెరయుచుండెను. ఆ నీగ్రో పిల్లవాండ్రు వానిని కూడ లెక్క చేయక పాఱవైచుట పర్కినీసు దొర చూచి ఆ రాళ్లను పరిశోధించెను. అవి వజ్రములని గ్రహించి ఆ పిల్లవాండ్రకు తనవద్దనుండు బిస్కత్తులను, పెప్పరమెంటు బిళ్లలిచ్చి ఆ రాళ్లనన్నింటిని సేకరించెను. పెంట కుప్పలలోని గింజల నేరుకొని తిను కోడికి ఒక కెంపుదొరికిన సంతోషముగ నుండునా! దానికి కావలిసినది ధాన్యపుగింజయేకదా. అట్లేయీ నీగ్రో బాలురకు బిస్కత్తులే ప్రధానమైనవి. వారికి ఆ రాళ్ల విలువేమియు తెలియకుండెను. పర్కినీసు దొర తనకు కావలిసినన్నిరాళ్లను ప్రోవుచేసి హిందూదేశప్రయాణముమాని మరలివెళ్లెను. ఆ వజ్రములలో పెద్దదైన దానిని ఫ్రాంన్సులో ప్రాపంచక వస్తు ప్రదర్శనమున పెట్టగా 15000 ఫ్రాంకులకు అనగ 600 పౌనులు విలువ కట్టిరి. అటుపైన వజ్రములు కనబడిన ప్రదేశములలో గనులున్నవని నిశ్చయించి ఆ ప్రదేశమునకు కింబర్లి అని పేరు పెట్టిరి. కొన్ని సంవత్సరముల తర్వాత ఆ ప్రదేశములను బ్రిటిష్ వారు స్వాధీనము చేసికొనిరి. వజ్రములను సానపెట్టు వ్యాపారము ఐరోపాలో ఆమ్‌స్టరుడమ్ రాటర్‌డమ్‌లలో వృద్ధి పొందెను.

మనదేశములో కూడ వజ్రములున్నవి. పూర్వము కోహినూరు అను వజ్రము మొగలాయి చక్రవర్తియగు షాజహాను నెమలి సింహాసనము నలంకరించి యుండెను.



# పిల్లల శిక్షణ - శాస్త్రీయ దృక్పథం

❋ శ్రీమతి దరిశి సుభద్రమ్మగారు ❋

"ఈ నాటి పిల్లలే రేపటి పౌరులు" అన్న విషయం అందరికీ విదితమే. నేడు తల్లిమీద అనుక్షణం ఆధార పడుతున్న చంటి పాపలు రేపు కుటుంబం, సమాజం, దేశం యొక్క పురోభివృద్ధికి బాధ్యతల్ని వహించే భావి పౌరులవుతారు. పిల్లలయొక్క సర్వతో ముఖాభి వృద్ధి ననుసరించి దేశంలో, సమాజంలో, సర్వసంపదలూ, శాంతిసౌఖ్యములూ పెంపొందుతవి. అంచేత, మనపిల్లలు, ధృఢ గాత్రులు, సద్గుణ సంపన్నులు, ప్రతిభా శాలులు, కళా ప్రపూర్ణులు, విజ్ఞాన వేత్తలు, వీరపుంగవులు, ప్రజారంజకులయిన భావి పౌరులగుట అత్యవసరమన్న మాట.

ఇట్టి భావి పౌరులనుగా చేసే బాధ్యత ప్రప్రథమంలో తల్లులపైవుంది. అలాంటి అభివృద్ధి, ఆదినుంచీ శాస్త్రీయ దృక్పథంలో తల్లి పిల్లల కిచ్చే సుశిక్షణపై ఆధారపడి వుంటుంది. అంటే, తల్లికి, ఆరోగ్యశాస్త్రం, శరీర ధర్మ శాస్త్రం, మనస్తత్వశాస్త్రం (ముఖ్యంగా పిల్లలకు సంబంధమైన), మొదలైన శాస్త్రపరిజ్ఞానం అవసరం. నూతన విద్యావిధానంలోను, ప్రవేశంవుండాలి. కాని, ఈ విషయాల్లో, ఈ నాటికికూడ మనదేశం పశ్చిమ దేశాలకన్న ఏ వందయేళ్లో వెనకబడి వున్నదని చెప్పవచ్చు. ముఖ్యంగా, అమెరికా, ఇంగ్లాండు, సోవియట్ యూనియన్, అపూర్వమైన అభివృద్ధిని చెందినవి. ఇంతేగాదు, ఈ నాటికి కూడా, ఆ దేశాల్లో, గొప్ప గొప్ప మనస్తత్వ శాస్త్రజ్ఞులూ, నవీన విద్యావిధాన ప్రవీణులూ పిల్లల మనస్తత్వాన్ని పరిశీలించుతూ, వాళ్ల వయస్సునుబట్టి నూతన విద్యా విధానాల్ని కనిపెట్టుతూ వున్నారు.

విద్యా విజ్ఞానాల్లో, మనదేశం కన్న ఆ దేశముల అభివృద్ధి అత్యధికం అని చెప్పటంలో అతిశయోక్తి లేదు. ఆ దేశాల్లో అక్షరాస్యులు కానివారు అరుదు. ఉన్నత విద్య, వృత్తి విద్యలు పూర్తి అయిన వెంటనే, యువతులు, శిశు మానసిక శాస్త్రంలో, నవీన విద్యా బోధక విధానంలో, విధిగా శిక్షణపొందుతారు. ఈలాంటి శిక్షణ, ముఖ్యంగా సంపన్న స్త్రీలందరికీ అందుబాటులో వుంటుంది. ఇక సామాన్య ప్రజానీక పిల్లల విషయంలో, ఆ దేశాల ప్రభుత్వాలే శ్రద్ధ పుచ్చుకొంటారు. సోవియట్ రష్యాలో సమస్త ప్రజానీకపు పిల్లలయొక్క అభ్యున్నతికి, సర్వవిధములైన సదుపాయాలూ, సంస్థలూ, స్థాపింపబడి యున్నవి. అనగా, శిశుపోషణ, శిశు శిక్షణశాలలు (క్రెషీలు, నర్సరీలు) నవీన విధానాల్లో విద్యగఱిపే పాఠశాలలూ (కిండర్ గార్టన్, మాంటిసోరి, డాల్టన్‌ప్లాన్ మున్నగు విధానములలో) పిల్లల యొక్క సర్వతోముఖాభివృద్ధి విషయంలో ఈదేశం తక్కిన వానికన్న అత్యధికంగా కృషిచేస్తున్నదని వినికి.

ఇక మనదేశ విషయం :—ఇతర దేశాలకూ మన దేశానికి ఎంతమాత్రం సామ్యంకనబడదు. అసలు మన జనాభా ప్రకారం నూటికి 13 గురు అక్షరాస్యులు. అందులో మహిళలు 100 కి 5 గురు మాత్రమే. అక్షరాస్యులయినంత మాత్రాన విజ్ఞానవంతులనుటకు వీలులేదు. ఈ విషాదానికి కారణం, మనదేశ ఆర్థిక, సాంఘిక రాజకీయ పరిస్థితులే అని చెప్పక తీరదు.

దాదాపు 200 ఏళ్లుగా సామ్రాజ్యవాదానికి భారతదేశం బానిసగా వున్నది. ప్రజల అభివృద్ధి పర ప్రభుత్వానికి, (అందులో సామ్రాజ్యవాదులకు) అవసరం లేదు. అందువల్లనే మధ్యయుగంనాటి ఆర్థిక సాంఘిక పద్ధతులను ప్రజలు పూర్తిగా తొలగించుకో లేక పోయారు. కాబట్టే, వైజ్ఞానికంగా అందరూఅంత అభివృద్ధి చెంద లేక పోతూరన్నమాట.

## పిల్లల శిక్షణ-శాస్త్రీయ దృక్పథం

అయితే, ఈ నాడు, మన దేశంయొక్క దాస్య శృంఖాలు సడలి పోయినవి. స్వాతంత్ర్య సౌభాగ్యం లభించింది. కనుక, దేశం, సమాజంయొక్క పునర్నిర్మాణమునకు పునాది అయిన పిల్లలయొక్క సర్వతో ముఖాభివృద్ధికి ప్రభుత్వమే పూనుకోవాలి. అందుకోసం మనం ప్రయాస పడాలన్న మాట. అయితే, అంతవరకు, కాలాన్ని వృధాపుచ్చకుండా మనం సాధ్యమైనంత శాస్త్ర జ్ఞానం సంపాదించుకొంటూ, శాస్త్రీయ దృక్పథంలో పిల్లల్ని పెంచుకోవాలి.

పిల్లలను పెంచటం అనేది శాస్త్రరీత్యా ఆలోచిస్తే అసలు గర్భంలో వుండగానే ప్రారంభమవుతుంది. ఆరోగ్య కరమైన ఆహార విహారముల విషయంలో తఱచుగా డాక్టర్ల సలహా అవసరమైనట్టే, శిశు మనస్తత్వ పరిజ్ఞానం కూడా అవసరం. శిశు పోషణ, శిశు శిక్షణ అనేవి శిశువు పుట్టిన నాటినుండే ప్రారంభమౌతాయి. అంచేత, అది మొదలుకొని పది ఏళ్ల వయస్సుదాక పిల్లలను శాస్త్ర రీత్యా పెంచే పద్ధతి తల్లులకు తప్పనిసరిగా తెలిసివుండాలి.



# అఖిలభారత బాల విద్యా విధాన వేత్తల ద్వితీయ సమావేశము

## మ ద రా సు

ఏప్రిల్ 2, 3 తేదీలలో యీ సమావేశము మదరాసులో రాజాజీ హాలులో జరిగినది. శ్రీ హార్ బాయ్ త్రివేదిగారు అధ్యక్షత వహించిరి. భారత దేశము నలుప్రక్కలనుండి ప్రతినిధులు యీ సమావేశమునకు వచ్చిరి.

ఈ సమావేశ సందర్భములో, చింతాద్రిపేట మాంటుస్సోరీస్కూలులో పసివారలకు విద్య గరుపుటకై, ఆధునిక పద్ధతులలో నుపయోగించు సాధనములు, పిల్లల చేతిపనులు మున్నగునవి ప్రదర్శింపబడినవి.

శ్రీ భావనగరు మహారాణీవారు సమావేశమును ప్రారంభిస్తూ, "భారత దేశపు భావి పరిస్థితులు ప్రస్తుతపు బాల బాలికలపై ఆధారపడియున్నవి. అందువలన వీరి విద్యా విషయములో తగు శ్రద్ధవహించి, ఉత్తమ పౌరులు గాగల మార్గములో శిక్షణ నిచ్చుట అత్యవసర "మని వచించిరి.

ఇంకా "పాశ్చాత్య దేశాలలో పిల్లల మనస్తత్వాన్ని ఆధారంగానుంచుకొని ఏర్పాటు చేసిన నూతన విద్యా విధానాలు యీ దేశములోకూడ మన పద్ధతుల ననుసరించి అమలుజరుపుట ఉత్తమము. ఈ విద్యావిధానము, పిల్లలో అంతర్లీనమైన శక్తులను విజృంభింపజేసి, తమ సహజప్రవృత్తులు వికసించే మార్గము కల్పించేదిగా ఉండాలి. అప్పుడే సక్రమమార్గములో విజృంభించిన నిజశక్తులతో తనకుసరియైన ఉపాధిని ప్రతివ్యక్తి ఏర్పాటు చేసికొనగలడు. ఇందులకై పిల్లలశిక్షణయను ఉత్కృష్ట బాధ్యత నవలంబించు ఉపాధ్యాయవర్గము సర్వవిధములా ఉన్నత శ్రేణికి చెందినవారై యుండుట సమంజసము" అని చెప్పిరి.

అధ్యక్షులైన త్రివేదిగారు తమ ఉపన్యాసములో యీ విధముగ జెప్పిరి :—

"విద్యా బోధనలో శిశువుయొక్క ప్రత్యేకత గమనించుట యవసరమను విషయము ఎల్లెడల చక్కగా గుర్తింపబడ్డది. జాతి నిర్మాతయగు శిశువు శిస్తైన శాస్త్రీయ దృక్పథంలో శిక్షణబడసినప్పుడుగాని, ఉత్తమ పౌరుడు గానేరడు. కేవలము బిడ్డలయందు గాఢమైన ప్రేమ కనపరచుటవలన మనము ఆశించు ఫలము దక్కదు. పిల్లల మనో ప్రవృత్తులను అవగాహనము చేసికొని తదను గుణముగ ప్రవర్తించుట అత్యవసరము. శిక్షణ సందర్భములో ప్రాచీన నిరోధన పద్ధతులను విడచిపెట్టి స్వచ్ఛందముగ, స్వేచ్ఛా వాతావరణలో ఉత్తమ ఆశయముల నవలంబించు అవకాశములను మనము కల్పించాలి." అని వివరించిరి.

*　　*　　*

ప్రతినిధులు కొందరు తాము నిర్వహించుచున్న శిశు పాఠశాలలు మున్నగు వానిని గూర్చి ఉపన్యసిస్తూ, ఇంకా పిల్లల విద్య కీయవలసిన ప్రాధాన్యత మన దేశములో పూర్తిగా గుర్తింపబడక పోవుటను గూర్చి తమ అసంతృప్తిని వెల్లడించారు.

సాయంకాలము, బాలోద్యాన వనము, వేపేరీ నర్సరీ ప్రాజెక్టు స్కూలు యింకా కొన్ని పాఠశాలల పిల్లల నృత్య, నాటక ప్రదర్శనములతో ఆనాటి సమావేశము ముగిసినది.



## గ్రంథ విమర్శ

# శ్రీ జయశంకర ప్రసాదుగారి "సాలవతి"

శ్రీమతి అచ్యుతుని గిరిజ

శ్రీ జయశంకరప్రసాద్ ఒక సుప్రసిద్ధ హిందీ సాహిత్య నిర్మాత. ఆయన ప్రతిభ సాహిత్యములో యే ఒక్క శాఖ లోనో కాక సర్వతోముఖముగా అన్నిటనూ వ్యాపించి యున్నది. ఆయన కవి, నాటకకర్త, నవలాకారుడు, వ్యాస రచయిత; సంస్కృత, ఆంగ్ల, వంగ, హిందీ భాషలలో ప్రవేశమే కాక పాండిత్యముగల దిట్ట. కాశీలో ఒక ధనిక వైశ్య కుటుంబములో జన్మించాడు. పన్నెండేళ్ల చిన్నతనము లోనే స్కూలుచదువుమాని తండ్రి వప్పగించి పోయిన వ్యాపారము చూసుకోవలసి వచ్చింది. ఆ దుకాణములోనే కూర్చుని తన స్నేహితులతో సాహిత్య గోష్టి జరుపుతూ వుండేవాడు. ఆ వాతావరణములోనే తన ప్రసిద్ధ రచనలను కొనసాగించాడు. కాళిదాసు, పాణిని, చాణక్యుడు, చంద్ర గుప్తుడు, గౌతముడు, అశోకుడు మొదలైన ధీశాలులు, మహాను భావులు జీవించి వున్న ప్రాచీన హిందూ యుగపు ఔన్నత్యాన్ని గురించి ఊహించుకుంటూ, కలలు కంటూ ఆనాటి వాతావరణాన్ని, విషయాలను తనరచనలలో వర్ణించేవాడు. అటువంటి రచనలలో సాలవతి కథ ఒకటి.

మగధరాజ్యానికి సమీపానవున్న ఒక చిన్నరాష్ట్రం వజ్జి రాష్ట్రం. ఆరాష్ట్రపురాజు ప్రజల అభిమతముతో, ప్రజాభి ప్రాయానుసారం రాజ్యము చేస్తూవుంటాడు. ధవళయశుకనే ఒక కులీనుడు సాలవనములో తనయేకైకపుత్రిక సాలవతితో వుంటూవుండేవాడు. నదీ గర్భంలోవున్న రాళ్లలో నుంచి బంగారము వేరు చేయుట ఆయన జీవనోపాధి. ప్రాప్తిం చిన దానితో ఆత్మగౌరవానికి భంగములేకుండ, మరొకరిని యాచించకుండ జీవించటమే ఆయన ప్రధాన ఆశయము. చిన్నప్పుడే సాలవతి తండ్రిఆశయాలను గ్రహించింది. రాళ్ల నుంచి బంగారము వేరుచేయుట కూడ నేర్చుకున్నది. అందువల్ల ఆమె తండ్రి చనిపోయినా దిక్కులేని అనాథ బాలికగా కష్టపడలేదు. తండ్రిమాదిరి కష్టించి సంపాదించిన దానితో స్వతంత్రజీవనము గడుపుతూ ఆ వనములోని ఆ కుటీరములోనే యేకాకిగా వుండేది.

వజ్జిరాష్ట్రములో వసంతోత్సవము చాల ముఖ్యమైన వేడుక. స్త్రీ పురుషులందరు నృత్యగానాలతో, సరస సల్లా పాలతో వసంతోత్సవము జరుపుతారు. చివరి రోజున అంద రిలోకి సుందరి అయిన ఒక స్త్రీని ఎన్నుకుని ఆమెచేత మన్మథునికి పూజచేయించుట వారికి అలవాటు. వజ్జి రాష్ట్రపు ప్రజాతంత్ర పరిపాలన, శాంత జీవనం, సిరిసంప దలు మగధకు మచ్చరం కలిగించినయ్. ఆ యేటి వసంతోత్స వాలను చూడాలన్న మిషతో మగధమంత్రి వజ్జి రాష్ట్రానికి వచ్చాడు. ఊరు నాలుగు మూలలా కలియదిరుగుతూ సాల వనమువైపు వెళ్లాడు. అక్కడ ఎనిమిదిమంది యువకులు ప్రశాంతముగా సంగీతగోష్టి జరుపుతూవుండటము చూశాడు. ఊళ్లో ప్రతిచోట స్త్రీ పురుషులందరు జట్లు జట్లుగా చేరి నృత్యగానాలతో సరస సల్లాపాలతో వుత్సవము జరుపు కుంటూ వుండగా యీ యువకులు యింత ప్రశాంతముగా సంగీతములో తన్మయులై వుండటము మగధ మంత్రికి ఆశ్చ ర్యము కలిగించింది. అందువల్ల అతనక్కడకు వెళ్లి వారితో సంభాషణ కుపక్రమించాడు. మాటల సందర్భంలో ఆ ఎని మిదిమంది యువకులు ఎనిమిది తెగలకు చెందిన బౌద్ధసిద్ధాంతా లను అనుసరించుతారని, అయినా ప్రాణస్నేహితులేనని, అందరు బ్రహ్మచారులేనని తెలుస్తుంది. అప్పుడు మంత్రి మీ ఎనిమిది మందిలోనే ఎనిమిది భిన్నసిద్ధాంతాలు, అభిప్రా యాలు వుంటే, ఇంత రాష్ట్రాన్ని ప్రజలు ఒక్కమాట మీద ఎట్లా పాలించుకో గలుగుతున్నారని ప్రశ్నించాడు. ఎవరికీ సమయానికి జవాబు స్ఫురించలేదు. మంత్రికి పూరు

చూపుతున్న ఉపరాజు, అభయకుమారుడికి కూడ జవాబు తోచలేదు. మంత్రి ముఖాన విజయగర్వం తాండవిస్తున్నది. ఇంతలో వెనుక వైపునుంచి "వ్యక్తిగతంగా ఎన్ని అభిప్రాయ భేదాలువున్నా దేశముపట్ల మా అందరిదీ ఒకే అభిప్రాయం, ఒకేనిర్ణయిం" అని ఒక స్త్రీ కంఠం వినిపించింది. అంతా ఒక్కసారి త్రుళ్లిపడి వెనక్కుచూశారు. నది నుంచి నీళ్లు పట్టుకువెళ్తున్న, సాలవతి సుందర విగ్రహం వాళ్లకు గోచరించింది. ఆమె సమయస్ఫూర్తికి, చొరవకు ఆశ్చర్యపడి అందరు ఆమెను ఆ సమావేశానికి ఆహ్వానించారు. వారి కోరికమీద సాలవతి పాడుతుంది. ఆపాటకు ముగ్ధుడై ఉపరాజు అభయకుమారుడు, తన హృదయముతోపాటు ఒక ముత్యాలహారంకూడా ఆమెకు యివ్వబోతాడు. కాని సాలవతి రోషముతో నాకు ఎవరి సానుభూతి, అనుభూతి, దయ అవసరములేదని వెళ్లిపోతుంది. సాలవతి విచిత్ర పకృతి అందరికి మరింత అగమ్య గోచరమయింది.

మర్నాడు అనంగపూజకు ప్రజలు సుందరిని ఎన్నుకునే రోజు. బహిరంగముగా జరిగే నిర్ణయము కాబట్టి ఎవరి ప్రోద్బలము, అనుభూతి వుండవని, పోటీలో పాల్గొంటే తప్పులేదని ఆ అష్టమిత్రులు సాలవతికి నచ్చచెప్ప కలుగుతారు. సాలవతి పోటీలో పాల్గొంటుంది. అందరు ఏకగ్రీవంగా ఆమెను అందాల రాణిగా నిర్ణయించారు. ఆ శుభ సమయాన అభయకుమారుడు సాలవతిని తాను పెండ్లాడ దలచానని, ఆమెకు తండ్రిలేని కారణాన రాజు, ప్రజలే అనుమతి యివ్వాలని కోరుతాడు. స్వచ్ఛందప్రియ అయిన సాలవతి ముఖం కోపంతో జేవురించింది. అక్కడేవున్న మగధమంత్రి కనుసైగతో, అభయ కుమారుని ప్రతిద్వంది మణిధరుడు "అందరిలోకి సుందరి అయిన స్త్రీని తాను పెండ్లాడి ఆనందించాలనుకోవటం చాలాస్వార్థం. మగధలో అంబాపాలి మాదిరి యీామెనుకూడ వేశ్యగా వుంచుదాము. మగధ అంబాపాలికి, వజ్జిరాష్ట్రపు సాలవతి దీటుగానిల్చి డబ్బు, పేరు గడిస్తుంది" అనిఅంటాడు. రోషంతో అభయ కుమారుడి ముఖం జేవురించింది. భయ, అవమానాలతో సాలవతి ముఖం కుంగిపోయింది. రాజు మీారేమంటారని ప్రజలను ప్రశ్నించాడు. అంతా మణిధరుడినే బలపరిచారు. మంత్రికుత్సితాన్ని గ్రహించిన అభయకుమారుడు 'నీ కోరిక తీరిందా?' అని అడుగుతాడు. అంతా ప్రజానుమతి ప్రకారమే జరిగింది అని చిరునవ్వు నవ్వసాగాడు మంత్రి. అంతకు ముందు వేశ్యా విధానములేని వజ్జిరాష్ట్రములో సంఘ ఆదేశానుసారం ప్రజాభిమతముతో తనకు యిష్టము లేక పోయినా కులీనకన్య సాలవతి మొదటివేశ్య అయింది. మణిధరుడామె ముఖ్యవిటుడు. అభయ కుమారుడు ఒక్కడే ఆవైపు కన్నెత్తి చూడనివాడు.

సాలవతి సంపదకు సాటిలేదు. మాత కాబోతున్నది. ఇంతలో వజ్జిరాష్ట్రానికి మగధతో యుద్ధము వచ్చింది. మణిధరుడు సేనానాయకుడుగా వెళ్లి యుద్ధములో చనిపోయినాడు. అతనికై విలపించితే తన మానసిక దౌర్బల్యాన్ని, అస్వతంత్రతను వెల్లడించినట్లవుతుందని సాలవతి దుఃఖము అణుచుకుంటుంది. ఆనాడు అభయ కుమారుని, సేనానిగా ఎన్నుకుని గౌరవించ బోతున్నారని విని సాలవతి అలంకరించుకుని రీవిగా వెళ్తుంది. కాని ఆమెనుచూడగనే అందరు "నీవు మా రాజ్యానికి తోకచుక్కవు; నీ సంపర్కంవల్లనే వీరుడైన మణిధరుడు చనిపోయినాడని" ఛీదరించుకుంటారు. ఆమె అవమానంతో ఆరోజునుంచి తిరిగి యెక్కడికి పోవటము మానివేసింది. కొద్దిరోజులకు సాలవతికొక కొడుకు పుడతాడు; తన స్వచ్ఛంద జీవనానికి ఒక అడ్డమని భావించి ఆ పసిగుడ్డును చెట్టుకింద వదిలి పెట్టించుతుంది. ఆమెదగ్గర లంచము తీసుకున్నా, వైద్యుడు ఆమెకు తెలియకుండ ఆ శిశువు బుజాన ఒక ముద్రవేసి చెట్టుకింద వదలివచ్చాడు. యుద్ధములో జయించి యింటికి తిరిగి వస్తున్న అభయ కుమారుడు దైవికముగా ఆ పసిపిల్లవానినిచూసి ముద్రవల్ల సంగతి గ్రహించి ఎంతోప్రేమతో ఆ పిల్లవానిని పెంచుతూ వుంటాడు.

ఎనిమిది సంవత్సరాలు జరిగి పోయినయ్. ప్రతి సంవత్సరం పోటీలు జరిపి సుందరిని ఎన్నుకోవటం, ఆమె వేశ్యగా జీవించటం జరిగి పోతూనే వున్నయ్. కాని సాలవతి మాత్రం ఇంతవరకు మళ్లీ బయటికి రాలేదు. ఆయేడు పోటీకి సాలవతి వచ్చింది. ఎనిమిదేళ్లయినా చెక్కుచెదరక పోగా ఆమె అందం ఇంకా హెచ్చింది. ఆమెను చూడ

గానే స్త్రీలందరు "పిశాచీ నీ మూలంగానే వేశ్యావిధానం వచ్చిపడ్డది. మా సంసారాలన్నీ నాశనమై పోతున్నయ్. తండ్రి ఆదరానికి దూరమవుతున్న యీ పసిపిల్లలను చూసి కూడ నీకు మనసు కరగటల్లేదా ?" అని అక్కసు పడ్డారు. ఆమె కప్పుడు అంతా అవగాహన అయింది. తాను ప్రశాంతముగా, ఏకాంతముగ యింతకాలం వంటరిజీవితము గడుపుతున్నా దేశములో ఎంత అనిష్టము తెచ్చిపెట్టిందీ గ్రహించుకుంది. వెంటనే పోటీలు జరుగుతున్న ప్రదేశానికి పోయింది. ముక్త కంఠముతో అందరు ఆమెను తిరిగి అందాల రాణిగా ఎన్నుకున్నారు. అప్పుడామె "నాదొక మనవి—మొదట దేశానికి పేరు, డబ్బు సంపాదించాలన్నవుద్దేశ్యంతో నాతో వేశ్యాప్రథ ఆరంభించారు. కానీ దేశానికి అపకారమే ఎక్కువ జరుగుతుండడంవల్ల యింక యీపద్ధతిని నిర్మూలించాలని సంఘాన్ని కోరుతున్నాను" అని అన్నది. దానికందరు సమ్మతించారు. రాజు, "మరియిప్పటి వరకు సంఘము కొరకు వేశ్యలుగా వుండటానికి అంగీకరించి వచ్చిన యీ యెనిమిదిమంది యువతుల భవిష్యత్తు యేమిటి" అని ప్రశ్నించాడు. మొదట సాలవనములో ప్రశాంతముగ వుత్సవము చేసుకుంటూ మగధమంత్రికి కనిపించిన అష్టమిత్రులు "సంఘము కోసం త్యాగం చేసిన యీ యువతులను సగౌరవముగ మేము ఎనిమిది మందిమి పెండ్లాడుతా" మని ఒప్పుకున్నారు. అప్పుడు అభయ కుమారుడు తాను పెంచుతున్న సాలవతి కుమారుని పైకి ఎత్తుగా ఎత్తుకుని "నాకు భార్య అవసరములేదు. కాని యీ పిల్లవాడి తల్లికోసం వెదుకుతున్నాను. ఎవరైనా గుర్తుపట్టగలిగితే తీసుకోవచ్చు" నని అంటాడు. ఆ పిల్లవాని ఆకృతి బుజంమీది గుర్తులను పట్టి సాలవతి, వాడు తన పిల్లవాడేనని గుర్తించ గలిగింది. అభయ కుమారుడి కాళ్లమీద పడి "వీడు నా కుమారుడే మీరు నాస్వామిగా నన్ను అనుగ్రహించరా ?" అని ప్రార్థించింది. అభయ కుమారు డామెను ఆదర పూర్వకంగా స్వీకరించాడు. ప్రేక్షకుల ఆశ్చర్యానికి మేరలేదు.

ఇది జయశంకర ప్రసాదు రచించిన సాలవతి కథ. చదువు తున్నంతసేపు యెంతో రసవంతముగాను, ముందు యేమి జరగ బోతుందోఅని జుగుప్సాకరముగాను వుంటుంది. కథలో చూపిన వాతావరణాన్నిపట్టి చాలకాలము క్రిందటి విషయమని తెలుస్తుంది. ఆనాడే వజ్జిరాష్ట్రములో వేశ్యాప్రథ అమలులో లేక పోవటము, ధవలయశానిలో గల స్వేచ్ఛాప్రియత్వము, దేశముపట్ల అంతా ఏక అభిప్రాయము కలిగివుండటము చాల మెచ్చతగిన విషయాలుగా కనిపించుతయ్. కాని మొదటినుంచి చివరివరకు ప్రతివాళ్లకు అనేక సందేహాలు కలుగుతయ్. ఆ సందేహాలకు జవాబులు యివ్వ దలచినట్లు రచయిత పోకడలను బట్టి తోచదు. సాలవతి పాత్ర మొదట యెంతో గొప్పగా కనిపిస్తుంది. ఆమె స్వాతంత్ర్యాభిలాష, సమయస్ఫూర్తి, చౌరవ ఆత్మగౌరవము మెచ్చతగినట్లువున్నా చివరవరకు ఆమెపట్ల అదేభావము నిలిచి వుండదు, మధ్యలో ఆమెప్రతిభ బొత్తిగా లోపించుతుంది. రాజు ప్రజాభిప్రాయానుసారం రాజ్యము చేయటము మొదట శ్రేయస్కరమని ఆరంభించినా, వెంటనే గొఱ్ఱెదాటుగా పరిణమించినట్లు తోస్తుంది. ఇటువంటి పరస్పర విరుద్ధవిషయాలు చాల కనిపించుతయ్. ఏది ఎట్లావున్నా సాలవతి కథ చదువగానే మరుపురాదు. అందులో సమస్యలు ఆ కథలో సన్నివేశాలకు మాత్రమే సంబంధించినవికాక మానవ సంఘానికి సంబంధించినవిగా వుంటయ్. అందువల్ల పాతకాలానికి సంబంధించిన కథే అయినా 'సాలవతి' ఎప్పటికప్పుడు చదువరులకు ఒక సమస్యగావుండి ఆలోచనలకు పురికొల్పుతుంది. చదివిన తర్వాత జాగ్రత్తగా ఆలోచించవలసివుండే కథలు, రచనలు ప్రజలకు విమర్శనాశక్తిని, విచక్షతను కలిగించుతయ్.



## సవరణ

ఏప్రిల్ నెల సంచికలో " ఇంకా కట్నాలెందుకు " అను వ్యాసము ఇంతకు పూర్వము ఆల్ ఇండియా రేడియోలో ప్రసారితము.

# బాలోద్యానవనము

## మదరాసు.

బాలోద్యానవనపు వార్షికోత్సవము శ్రీ విజయనగరం మహారాణీవారి ఆధ్వర్యమున ఏప్రిల్ నెల 5 వ తేదీని జయప్రదముగా జరిగినది. వివిధ తరగతుల బాలికలు నృత్య, నాటక ప్రదర్శనములతో సభా సదుల నానందింపజేసిరి.

ప్రిన్సిపాలుగారైన ఎలెన్ శర్మగారు పాఠశాలనుగూర్చి క్లుప్తముగ ప్రసంగించిరి. గతసంవత్సరపు కార్యనివేదిక సభాసదుల కందిచ్చిరి. మహారాణీవారు, పాఠశాలయొక్క సేవను గూర్చిప్రశంసిస్తూ, దీని యభివృద్ధికి, అందరూ యితోధిక కృషిచేయాలని హెచ్చరించిరి.

మదరాసులో తెలుగు, తమిళ, హిందీ, కన్నడములు నాల్గుభాషలవారి బిడ్డలను సమానదృష్టితో చూస్తూ, అందరూ తమ మాతృభాషలో ప్రాథమికవిద్య నభ్యసించగల అవకాశమును కలిగించుచున్నది యీ పాఠశాల యొకటే నని చెప్పవచ్చు. ఎంత తక్కువమంది పిల్లలు ఆ తరగతిలో నున్నాగాని, వారియొక్క మాతృభాషలో విద్య గరపుటకు ప్రత్యేక ఉపాధ్యాయ వర్గాన్ని ఏర్పాటుచేసి, దానికగు వ్యయమును ఎంత కష్ట నిష్ఠురముల కోర్చియైనను భరించ నియ్యకొనినారు యీ పాఠశాల నిర్వాహక వర్గము. 600 మంది పిల్లలకు సామాన్యంగా యితర పాఠశాలలో ఏ 15 మందో ఉపాధ్యాయులుండటము మహా గొప్పగా భావించబడుతుంది. కాని యిక్కడ 37 గురు ఉపాధ్యాయు లుండుటచే, భాష విషయములో నైతేనేమి, బుద్ధిశక్తులనుబట్టి కొద్దికొద్ది మంది విద్యార్థులను ఒక వర్గముగా విభజించి, ప్రత్యేక ఉపాధ్యాయుని ఏర్పాటు చేయుటలో నేమి, యీ పాఠశాలలో ఎక్కువశ్రద్ధ తీసికొన బడుతున్నదని ఒప్పుకోవాలి.

ప్రస్తుతము పాఠశాలయున్న భవనము 600 మంది పిల్లలకే చిన్నదగుటచే యింకా ఎందరికో స్థలము లేదని చెప్పి తిప్పివేయ వలసిన అగత్యము కలుగుచున్నది. పెద్ద స్థలమును సంపాదించి, అనుకూలమైన భవనమును, తగిన ఆటస్థలమును నిర్మించవలెనని, నిర్వాహక వర్గమువారు చేసిన ప్రయత్నము, తగిన విరాళములు సంగ్రహింపనేరమి, విఫలమైనది. అయినను ప్రస్తుత పాఠశాల భవనమే క్రయమునకు వచ్చుటచే, యిప్పటిలో దానిని స్కూలువారు స్వాధీన పరచుకొని, అవసరమైన కొద్దిమార్పులను చేసికొని, స్థలాభావమును ఒకరకంగా అతిక్రమించాలని అధికారులు ప్రయత్నించుచున్నారు. ప్రభుత్వపు సహాయముతో, ప్రజల విరాళములతో యీప్రయత్నము త్వరలోనే సఫలముకానున్నది. ఏప్రిల్ నెల 24 వ తేదీని మద్రాసులో శ్రీ రామకృష్ణ మఠాధిపులైన శ్రీ స్వామి కైలాసానంద జీ గారు, ఈ భవన ఆవరణలో క్రొత్త కట్టడములకు శంకుస్థాపన గావించిరి.



పిల్లల నృత్యము

ఈ పాఠశాల పరిముఖంగా నడిచే, పిల్లల వసతిగృహము ఉపాధ్యాయినుల శిక్షణ కేంద్రము, తల్లుల హిందీ, కుట్టు

తరగతులు సలక్షణముగ దినదినాభివృద్ధి నందుచున్నవి.

పిల్లలకు ఉత్తమమైన నవీన పద్ధతులలో విద్య గరపవలెనన్న ఉదారాశయముతో యీ పాఠశాలను 12 సంవత్సరముల క్రితము శ్రీ వి. యస్. శర్మగారు, వారిసతి ఎలెన్ శర్మగారు స్థాపించారు. అప్పటినుండీ, చాయశక్తుల యీ ఆశయాన్ని నెరవేరుస్తూనే, వారు స్కూలును యింత అభివృద్ధి లోనికి తేగలిగారు. అన్ని భాషల వారు యిందు చేరవచ్చు. యితర ఊళ్ల వారికి వసతి గృహాపు ఏర్పాటు



3 సంవత్సరముల వయస్సు పిల్లలు—విద్యా సాధనములతో స్వచ్ఛంద కృషి

లున్నాయి గనుక, దీనియొక్క అభివృద్ధి ఫలితాలు, అందఱకూ అందుబాటులో ఉంటాయి. అందువలన యీ మదరాసు వారే గాక యితర ప్రాంతములవారు గూడ భవన నిర్మాణ విషయములో నేమి, వసతి గృహాపు నిర్మాణ విషయములో నేమి, పాఠశాలకగు యితర విధములైన దైనందిన వ్యయములలో నేమి, యితోధికమగు ధన సహాయమును జేసి, దీనిని పోషించుట, ఒక సత్కార్యమగుననుట అతిశయోక్తి గానేరదు.



బాలురు నూలువడకుట



# ద్వితీయ అంతర్జాతీయ మహిళా మహాసభ సమీక్ష

## SECOND INTERNATIONAL WOMEN'S DEMOCRATIC FEDERATION.

ఈమధ్య రెండవ అంతర్జాతీయ మహిళా మహాసభ బుడాపెస్టులో డిశెంబరులో జరిగినది. 20 దేశాలనుంచి 50 జాతుల తరఫున 385 మంది ప్రతినిధులు హాజరయ్యారు. ప్రతినిధులలో మంత్రులు, ఉద్యోగస్థులు, శాస్త్రజ్ఞులు, మేధావులు, రైతు స్త్రీలు, విద్యార్థినులు, గృహిణులు వున్నారు. ఈసంస్థ మొదటి మహాసభనాటికి 33 దేశాల సంస్థలు మాత్రమే అనుబంధింప బడ్డాయి. తర్వాత 3 సం॥రాలకు క్రొత్తగా 23 దేశాలు చేరాయి. 56 దేశాలలో80 మిలియన్ల సభ్యత్వంవుంది. 1945లో మొదటి మహాసభ జరిగింది.

యుద్ధానికి వ్యతిరేకంగా పనిచేయుటే ఈ సంస్థ ప్రధమ ఆశయం.

మహాసభకు ఇజినీకాటన్ అధ్యక్షురాలుగా ఎన్నుకోబడింది. కార్యదర్శి నివేదిక నిచ్చిన పిమ్మట అధ్యక్షురాలు ఈ క్రింది విధముగా ఉపన్యసించింది.

“నేడు అమెరికన్ సామ్రాజ్యవాదులు మరోయుద్ధాన్ని రెచ్చగొడుతున్నారు. అమెరికా రాజకీయ వేత్తలుకూడా ప్రపంచాధిపత్యంకోసం, అమెరికాను బలపరుస్తున్నారు. రష్యా పేరు ప్రతిష్టలు నాశనం చేయడానికి చేసే ప్రయత్నాలు ఖండించింది. స్పెయిన్ రిపబ్లిక్, విముక్తగ్రీసులలో నేడు అభివృద్ధికరశక్తులు ముందుకు నిలిచి బలపడుతున్నాయి. వివిధదేశాలలో అభివృద్ధి నిరోధక వర్గాలకు యుద్ధ కాముకులకు వ్యతిరేకంగా, కష్టజీవుల కండగా నిలిచి ఏవిధంగా ఈ సమితి పనిచేస్తున్నదీ వివరించించింది. అభివృద్ధికాముకుల ఐక్యతద్వారా యుద్ధప్రేరేపకుల ఆటలు కట్టించ గలుగుతాము; శాంతిని కాపాడ గలుగుతాము” అని విశదించింది.

అంతర్జాతీయ కార్మిక సంస్థతోను, యువజనోద్యమంతోను పరిచయాన్ని, సహకారాన్ని, మనం పొందాలి. వలస దేశాలపై ఆధారపడిన దేశముల స్త్రీల ఆర్థిక, రాజకీయ, స్వాతంత్ర్యములకొరకు సహకారం చేయమని ఆ సంస్థలకు పిలుపిచ్చింది. ప్రతినిధులు ఇంకాకొన్ని దేశాలను సమితిలో చేర్చుకోవాలని తెలియ పరచారు.

సభ గౌరవార్థం అనేక వేలమందితో బ్రహ్మాండమయిన ఊరేగింపు బయలు దేరింది. బేనర్లు, ప్లేకార్డులు ప్రదర్శిస్తూ వూరేగారు. సభకు అనేక సందేశాలు పంపబడ్డాయి. సభాస్థలంలో అంతర్జాతీయ గీతము తర్వాత, బహిరంగ సభలో నైనా పపావా, టాసీ చాంగ్ మాట్లాడారు.

మరునాడు రిపోర్టులు, చర్చలు జరిగాయి. శాంతి ప్రజాసామ్యాలకొరకు జరిగేపోరాటాలలో అంతర్జాతీయ మహిళా సమితి భాధ్యతను చర్చించారు. స్త్రీల, ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యాల కొరకు, పిల్లలయొక్క రక్షణకొరకు ఆఫ్రికాలోను, ఆసియాలోను స్త్రీల అభివృద్ధిని ఏరకంగా తీసుకురావాలో చర్చించారు. చైనా, గ్రీసు ప్రతినిధులు అమెరికా సామ్రాజ్య వాదులచే బలపరచబడే ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ప్రజల పోరాటాన్ని గురించి తెలియ బరచారు. 2 లక్షల 50 వేల మెంబర్లకు ప్రాతినిధ్యంవహించే, మురైల్ డ్రేఫర్, (అమెరికా) ప్రజాస్వామిక శక్తులు బలపడి సామ్రాజ్యవాదాన్ని ఏరకంగా చావుదెబ్బ కొడుతున్నాయో చెప్పింది. పిమ్మట మహాసభ వైజ్ఞానిక ప్రదర్శనలతో ముగిసింది.

—శ్రీమతి పి సుశీల.





# ఆకెళ్ల సూర్యనారాయణ మహిళాసంఘము.

బురుజుపేట — విశాఖపట్నము.



మహిళా సంఘ కార్యనిర్వాహక వర్గ సభ్యురాండ్రు.

పై మహిళాసంఘమునకు శ్రీ పాండురంగి వెంకటరమణమ్మగారు కార్యదర్శిని. గ్రంథాలయ స్థాపనకై సభ్యురాండ్ర బిడ్డలు ఉచిత నాట్య ప్రదర్శనము నొసంగిరి. ఆసందర్భమున తీసిన ఛాయాచిత్రము.



కుమారి సూర్యప్రభ



## భారత ప్రభుత్వపు శరణార్థుల రక్షణ - స్త్రీల శాఖ

ఇండియా ప్రభుత్వపు శరణార్థుల రక్షణ శాఖలో, స్త్రీల విభాగము, యిటీవల, ఢిల్లీలో ఒక సమావేశము జరిపించిరి. అందు సై్రహా పండిట్ ప్రసంగిస్తూ, ఎన్ని కష్టనిష్టూరాలకైనా ఓర్చి, శరణార్థులైన స్త్రీలకు, పిల్లలకు వసతి పోషణలు సమకూర్చుట మన విధాయకమని నొక్కి చెప్పిరి. ముఖ్యముగా పిల్లలే దేశము యొక్క భావిసంపద యనునది పూర్తిగ గుర్తించి వారి రక్షణ విషయములో మనమంతా ఎక్కువ బాధ్యతవహించవలసినదని గూడ చెప్పిరి.

స్త్రీల విభాగముయొక్క కార్యదర్శిని శ్రీమతి మెధాయ్ సతి, నివేదికను చదువుచూ, 1947 నవంబరు నెలలో యిది స్థాపితమైనప్పటినుండి జరిగిన కార్యక్రమమును ఈ విధముగ వివరించిరి.

ఈ శాఖ తరపున ఏర్పాటుచేసిన వివిధ కేంద్రములలో 1100 స్త్రీలు శిక్షణపొందుచున్నారు. 2500 మంది స్త్రీలు పనులు చేసి వేతనములను పుచ్చుకొనుచున్నారు. 8 ప్రాథమిక పాఠశాలలు ఢిల్లీలో యీ శాఖచే స్థాపింపబడ్డాయి. ఇందు 3000 మంది పిల్లలు విద్య నభ్యసించుచున్నారు. 10086 మంది అపహృతులైన మహమ్మదీయ స్త్రీలు పిల్లలు తిరిగి పాకిస్థానుకు పంపబడిరి. 5683 హిందూ స్త్రీలు పిల్లలు పాకిస్థానునుండి రక్షింపబడిరి. ఈ శాఖచే నిర్వహింపబడుచున్న స్త్రీల ఎమ్ప్లాయ్‌మెంట్ బీరోలో 2000 మంది స్త్రీలు పేరిచ్చిరి. వీరిలో 500 మందికి ఉద్యోగములు లభించినవి. వివాహ శాఖ ఆధ్వర్యమున చాలామంది పడుచులకు వివాహములు జరిగినవి. ఇంకా చాలా వివాహములు జరుగనున్నవి. 150 మంది విద్యార్థులకు ఉన్నత విద్య నిమిత్తము విద్యార్థి వేతనము లీయబడినవి. 250 కుట్టు యంత్రములు, నిరాధారులైన స్త్రీలకు స్త్రీ సంఘములకు, తక్కువ ధరలకు సమకూర్చబడ్డవి.





ఈ మధ్య మా చుట్టాలు యేదో పనిమీద యీ వూరు వచ్చారు. పల్లెటూరినుండి వచ్చారు గనుక కొంచెము కాయ కూరలు, తమలపాకులు తెచ్చినారు. క్రొత్తగా వడ్లు కోతలు అయినందున యింట్లోనే అటుకులు దంచి మాకు కొంచము అటుకులుకూడ తెచ్చినారు. ఆ అటుకులు తెచ్చినా తెచ్చి నారుగాని, మా యింట్లో ఒక్కటే గోల. అంతా కలసి మా అమ్మవద్ద చేరినాము. మా తమ్ముడు అటుకుల పులిహోర చేయమని, మా చెల్లెలు వుప్మా చేయమని, మా మేనకోడలు (2½ సం॥) వచ్చీరాని ముద్దుమాటలతో "అవ్వా! అతుకుల తియ్యా చేత్తావా" అని, నేను అటుకుల వడియాలు పెడు దామని, మా వదిన "అత్తయ్యా అప్పడాలుకూడ చేస్తారు కదండీ" అని యిన్ని రకాలుగా మా అమ్మను వేధించుకొని తిన్నాము. మా అన్నయ్య మాత్రం అంతా వింటూ పత్రిక చదువుచున్నాడు. అతనికి అటుకుల బాత్ చాల యిష్టమని మా అమ్మకు తెలుసును. మా అమ్మ "ఒక్క నిమిషం వుండండి. యేమిటీగోల? మంచి అటుకులు బాగా తెచ్చారు, యీ చుట్టాలు" అని మమ్ములను చీవాట్లు పెట్టింది. ఎప్పటికినీ అమ్మకు పిల్లలంటే యెంతో ప్రేమ వుంటుంది. ఆ నిమిషానికి విసుక్కున్నా, వెనుక మా అమ్మ మా కందరికీ కావలసిన అటుకుల పిండివంటలు చేసి పెట్టింది. ఈ క్రింద ఆ దినుసులు చేయు విధానము వ్రాయు చున్నాను.

అటుకుల ఉప్మాకు కావలసిన వస్తువులు చేయు విధానము.

1 పడి అటుకులు, ¼ అరశాకు మినపపప్పు, ¼ అరశాకు శనగపప్పు, 1 ఫలం ఆవాలు, 2 పలాల జీడిపప్పు, 8 పచ్చి మిరపకాయలు, 6 ఎండుమిరపకాయలు, కావలసినంత ఉప్పు, ½ మూత పచ్చికొబ్బెర, కర్వేపాకు, అల్లంముక్కలు కొద్దిగ:

ముందుగ అటుకులు రాళ్లు, తవుడు లేక బాగుచేసి రెండు సార్లు బాగా కడిగి నీళ్లులేక వాడవేసి వుంచవలెను. పొయ్యి లేక కుంపటిమీద బాణలిపెట్టి మంచినూనె కొంచెము పోయ వలెను. నూనె మరగగానే ముందుగ యెండు మిరపకాయలు తుంచి వేయవలెను. పిమ్మట ఆవాలు, శనగపప్పు, మినపపప్పు, జీడిపప్పువేసి ఆవాలు చిటపట చిట్లిన పిమ్మట, పచ్చిమిరప కాయల ముక్కలు, అల్లం ముక్కలు, కర్వేపాకు అంతా వేసి, యీ కడిగివుంచుకొన్న అటుకులు కూడ అందులో వేయవలెను. పిమ్మట మనకు కావలసినంత ఉప్పుపొడిచేసి, కొద్దినీళ్లలో కరుగనిచ్చి ఆనీళ్లనుకూడ అందులోపోసి బాగా కలియపెట్ట వలెను. 5 నిమిషాలు కలియబెట్టిన పిమ్మట, తురిమి వుంచుకొన్న కొబ్బెరకోరు 1 పలం నెయ్యివేసి బాగా కలియబెట్టి క్రిందికి దించవలెను. ఉల్లిపాయలు కూడ వేయ వచ్చును. కాని అప్పుడు కొబ్బెరకోరు వేసిన బాగావుండదు. ఏదైనా ఒక్కటే వేయవలెను.

అటుకుల పులిహోర :

1 పడి అటుకులు, ½ అరశాకు శనగపప్పు, ½ అరశాకు మినపపప్పు, 2½ పలం జీడిపప్పు, 2½ పలం వేరుశనగ పప్పులు, 1 పలం ఆవాలు, 10 ఎండు మిరపకాయలు, 2 పలాల చింతపండు, ½ తులము ఇంగువ, 4 పచ్చిమిరప కాయలు, 1 చంచా మెంతులు, 1 చంచా మంచి పసుపు పొడి, 2 చంచాల ఎండు మిరపపొడి, ½ పలం మంచి నువ్వులనూనె, కొద్దిగ అల్లంముక్కలు, పచ్చికర్వేపాకు వలసినంత ఉప్పు :

ముందుగా అటుకులను రాళ్లు, యిసుక లేక చక్కగా కడిగి వుంచుకోనవలెను. చింతపండును కొద్దిగా నీళ్లువేసి బాగా సారమంతా వచ్చువరకు గుజ్జుతీసి, ఆ తీసిన గుజ్జులో వలసినంత ఉప్పు, మిరపపొడివేసి బాగా తడిపి వుంచవలెను. ఇంట్లోదంచిన అటుకులైన యెడల రెండు గంటలకు ముందు గానే యీ చింతపండు నీళ్లతో తడిపి పెట్టవలెను. మిషన్ (అంగడి) అటుకులైన సత్తువ వుండదు గనుక అప్పటికప్పుడే కలిపి చేయవలెను. పిమ్మట బాణలి (కడాయి) లో రెండు చంచాల నెయ్యివేసి జీడిపప్పు వేయించి వేరుగతీసి పెట్ట వలెను. వేరుశనగ పప్పులు, శనగపప్పు మినపప్పు, వరుసగా కొంచము యెఱ్ఱగా రంగువచ్చేవరకు వేయించితీసి పెట్టవలెను. ½ తులము ఇంగువ 2 పలాలనూనె పోసి యింగువ పొంగించుకొని దానిని పొడిచేసివేయవలెను. పసుపుపొడి ఆవాలు, మెంతులువేసి చిటపట వేగిన వెంటనే అల్లంముక్కలు, పచ్చిమిరపకాయ ముక్కలు, కర్వేపాకువేసి, పిమ్మటచింతపండు నీళ్లతో తడిపిపెట్టినఅటు కులను అందులోవేసి రెండుసార్లు బాగా కలియపెట్టి, వెనుక యీ వేయించి వుంచుకొన్న పప్పులన్నీ అందులోవేసి 5 నిమిషాలు బాగా కలియబెట్టి దించవలెను. ఉప్పు, కారము, పులుసు వారి వారికి కావలసినంత వేసుకోవచ్చును. ఎండు కొబ్బరికోరు ½ చిప్ప వేసుకోవచ్చును.

## అటుకుల బాత్ :

1 పడి అటుకులు, ¼ అరొాకు శనగపప్పు, ¼ అరొాకు మినపపప్పు, 1 పలం ఆవాలు, 10 పలాలు బంగాళాదుంపలు, 5 పలాల ఉల్లిపాయలు, 2½ పలం జీడిపప్పు, 8 ఎండు మిరపకాయలు, 1 మూత యెండు కొబ్బెర, కావలసినంత ఉప్పు, కర్వేపాకు, 2½ పలంనెయ్యి :

ముందుగ బంగాళాదుంపలు చెక్కుతీసి సన్నముక్కలుగా తరిగి వుంచుకోనవలెను. ఉల్లిపాయలుకూడ సన్న ముక్క లుగా తరిగి వుంచుకోన వలెను. పిమ్మట కడాయి (బాణలి) లో కొద్దిగా నెయ్యివేసి ముందుగ జీడిపప్పును కొంచము యెఱ్ఱగా వేయించి వేరుగ వుంచవలెను. కొంచము నూనెవేసి ముందుగ మిరపకాయలు వేయించి వేరుగ వుంచు కోనవలెను. శనగపప్పు, మినపపప్పు యెఱ్ఱగా వేయించి వుంచు కోనవలెను. యీ వేయించిన శనగపప్పు, మినపపప్పు, మిరప కాయలు రోటిలోపోసి కొంచము నూకగా దంచవలెను. పిమ్మట ఒక పలం మంచినూనెవేసి ముందుగ వాసనకు రెండు యెండు మిరపకాయలు తుంచివేసి, ఒక పలం ఆవాలు, కొంచము పసుపు పొడివేసి, ఆవాలు బాగా చిట పట వేగిన వెంటనే బంగాళ దుంపల ముక్కలు, ఉల్లి పాయల ముక్కలు వేసి కొంచెము నీళ్లుచల్లి, వలసినంత ఉప్పువేసి ఒకపళ్లెము మూత పెట్టవలెను. ఈ బంగాళా దుంపలు బాగా మెత్తగా వేగిన పిమ్మట, అటుకులను మామూలుగా కడిగి వుంచుకోనవలెను. ఆ అటుకులను యీ బంగాళదుంపకూరలోవేసి బాగా కలియపెట్టవలెను. పిమ్మట దంచి పెట్టుకొన్న పొడి, జీడిపప్పువేసి బాగా కలియపెట్ట వలెను. తరువాత 2½ పలం నెయ్యి, మంచి కొత్తిమిరాకు, కర్వేపాకు ఎండుకొబ్బెరకోరువేసి బాగా కలియబెట్టి దించ వలెను. ఉప్పు బంగాళదుంప కూరలోనైనా వేయవచ్చును. లేక అటుకులువేసి కలుపునప్పుడు కొద్దినీళ్లలో కావలసినంత ఉప్పువేసి కరగనిచ్చి ఆ నీళ్లనైనా పోసి కలియపెట్టవచ్చును. ఈ బాత్ పూనా, బొంబాయి ప్రాంతపువారు బాగా చేస్తారు. కొంచము ఓపికతోచేస్తే చాలా రుచిగావుంటుంది.

## అటుకుల పరమాన్నము :

¼ పడి అటుకులు, 1½ పడి పాలు, ½ పడి పంచ దార, 2½ పలములు జీడిపప్పు, 1 పలం సారపప్పు, 1 పలం యెండుద్రాక్ష, 2½ పలములు బాదం పప్పులు, 10 ఏల క్కాయలు, 1 అణాయెత్తు కుంకుమపువ్వు :

కడాయి (బాణలి) లో కొంచముగా నెయ్యివేసి, జీడి పప్పు, సారపప్పు, బాదంపప్పులు, యెండుద్రాక్ష మొద లైనవి. వేరువేరుగా వేయించి వుంచుకోనవలెను. పిమ్మట శుభ్రపరచిన అటుకులుకూడ కొంచము నెయ్యివేసి యెఱ్ఱగా వేయించి వేరుగా వుంచుకోనవలెను. పిమ్మట శుభ్రమైన కళాయి పాత్రలో 1½ పడి పాలుపోసి దానిని బాగా కాచ వలెను. అంటే 1½ పడిపాలు ఒకపడి అయ్యేవరకు బాగా మరగ కాచవలెను. పిమ్మట యీ వేయించిన అటుకులను అందులోవేసి 5 నిమిషాల వరకు బాగా గరిటతో కలుప వలెను. ఏలక్కాయలు పొడిచేసి అందులో వేయవలెను.

కుంకుమపువ్వుకూడ కొద్దిపాలల్లో నానవేసి అందులో వేయవలెను. పిమ్మట యీ వేయించి వుంచిన పప్పులన్ని అందులో వేసి కలియ పెట్టవలెను. వెనిలా యెసెన్సు, లేక బాదం యెసెన్సు 10 చుక్కలు వేసిన మంచి వాసనగా పరవాన్నము రుచిగా వుండును.

అటుకుల హల్వా :

¼ పడి అటుకులు, 1½ అశౌకు పంచదార, 5 పలాల నెయ్యి, 2 పలముల జీడిపప్పు, 2 పలముల బాదంపప్పులు, 1 పలం యెండుద్రాక్షు, 1 పలం సారపప్పు, 1 పలం పిస్తా పప్పులు, 1 అణాయెత్తు కుంకుమపువ్వు, 8 ఏలక్కాయలు, 1 చెంచా కేసరీ పౌడర్ :

ముందుగ కొంచము నెయ్యిలో యీ జీడిపప్పు వగైరాలు వేరువేరుగా వేయించి వుంచుకొనవలెను. మంచి అటుకులు ¼ పడి కొద్దిగా నెయ్యివేసి ఎఱ్ఱగా వేయించవలెను. వేయించిన అటుకులను ఒక కంచుగిన్నెలోగాని, కళాయి గిన్నెలో గాని వేసి కొద్దిగా నీళ్లుపోసి కొంచెము అటుకులు ఉడకగానే 1½ అశౌకు పంచదార అందులోవేసి బాగా కలియ బెట్ట వలెను. రెండు నిమిషాలు కలియ పెట్టిన పిమ్మట నెయ్యి కరగబెటుకొని కొద్ది కొద్దిగా ఆ హల్వాలోపోసి బాగా కలియ పెట్టవలెను, అటుకులు ముద్దగా వుండ కూడదు. చేతికి అంటకుండా వుండుటకే నెయ్యి పోయవలెను. పిమ్మట కేసరీ పౌడర్, కుంకుమపువ్వు, ఏలక్కాయలపొడి, ముందుగా వేయించి వుంచిన జీడిపప్పు వగైరాలు వేసి బాగా కలియబెట్టి దించవలెను. తీపి యిష్టమైన వారికి యిది చాలా రుచిగా వుండును.

అటుకుల వడియాలు :

1 పడి అటుకులు, 5 పలాల సగ్గుబియ్యం, 2½ పలాలు పచ్చి మిరపకాయలు, 2 అణాల కొత్తిమీరిఆకు, ½ తులము ఇంగువ, కావలసినంత ఉప్పు :

ముందుగ పచ్చిమిరపకాయలు, ఉప్పు, ఇంగువ బాగా నూరి, లేక దంచి వుంచుకొనవలెను. కొత్తిమీరి ఆకుకూడ బాగా పుల్లలులేక శుభ్రముగా కడిగి వుంచుకొనవలెను. అటుకులు రాళ్లు, ఇసుక లేక బాగా కడిగి వుంచుకొనవలెను. పిమ్మట కొద్దిగా నీళ్లుపెట్టి 5 పలాల సగ్గుబియ్యం ఆనీళ్లలో ఉడకబెట్టి, కడిగి వుంచుకొన్న అటుకుల్లో వేయవలెను. పచ్చి మిరపకాయల కారము, కొత్తిమిరిఆకు యివికూడ ఆ అటుకుల్లో వేసి బాగాకలపవలెను. అంటే మెత్తగా అంతా చేర్చి ముద్ద చేయకూడదు. బోలు బోలుగా కలిపి ఉసిరి కాయంతంత వడియాలు పెట్టవలెను. రెండురోజులు ఎండిన పిమ్మట నూనెలో వేయించిన, తెల్లగా బాగా బొరుగులు పోయి చాలా రుచిగా వుండును. పచ్చిమిరపకాయల కారం వేయక, జీలకఱ్ఱ, ఉప్పు మాత్రమువేసి పెట్టిన వడియాలు పత్యానికి, బాలింతలకు పనికివస్తాయి. ఇందులోనే లేత బెండకాయలుగాని, బూడిద గుమ్మడికాయగాని, సన్న ముక్కలుగా తరిగి అటుకులతో కూడ కలిపి వడియాలు పెట్టవచ్చును.

అటుకుల అప్పడాలు:

½ పడి అటుకులు, 1 అశౌకు సగ్గుబియ్యం, 6 పచ్చి మిరపకాయలు, కొద్దిగ ఇంగువ, 1 పెద్ద నిమ్మపండు :

అటుకులు, సగ్గుబియ్యం శుభ్రముచేసి మంచి యెండలో పెట్టి, పిమ్మట తిరగట్లోవేసి మెత్తగా పిండి విసరవలెను. కావలసినంతఉప్పు నీళ్లలో కలిపి పై తేటనీళ్లతోను, నిమ్మ పండు రసముతోను ఆపిండిని గట్టిగ కలపవలెను. పచ్చిమిరపకాయలు మెత్తగానూరి అదికూడవేసి బాగా కలపవలెను. పిమ్మట బాగా దంచిన, అప్పడాల పిండివలె మెత్తగా అవును. అప్పుడు ఉసిరికాయంత ఉండలుచేసి, మెత్తటి బియ్యం పిండితో వుండలను అద్ది అప్పడాలు ఒత్తవలెను. ఎండిన పిమ్మట మంచినూనె, లేక కొబ్బరినూనె, లేక నెయ్యిలో వేయించిన తెల్లగా వుండును. చిన్న అప్పడం నూనెలో వేయగానే పెద్దదై యెంతో రుచిగా వుండును.

గ లీ.



# మంచి తరుణము మించిపోవును! త్వరపడుడు!!

ప్రత్యేకపద్ధతులతో తయారుకాబడి ప్రసిద్ధిగాంచిన **(A. S. Brand)** ఎ. ఎస్. బ్రాండు పైరునువ్వుల చాయపప్పునూనె స్ఫటికంవలె తెల్లనై, మంచి సువాసనతో ఘుమఘుమలాడుచు, రుచికరముగనుండి, మంచి ఆరోగ్యమును, బలమును కలిగించును. నేతికి బదులుగాకూడ వాడవచ్చును.

ఏడాది పొడుగునా, నిల్వయుండవలసిన ఊరగాయలు చెడిపోకుండా, ముక్కలు మెత్తబడకుండా కాపాడి, అమితమగు రుచిని కలిగించును.

A. S Brand Husked Pure Pyra Gingelly Oil
noted for Taste, Health and Strength



చిరునామా :— GRAMS. BUTTER PHONES {4002 86327

## M/s, బి. వెంకటేశ్వరరావు & కో.,

వెన్న, నేయి, ఎ. ఎస్. బ్రాండు పైరునువ్వుల నూనె వర్తకులు,

136, పురశవాక్కం హైరోడ్డు, వేపేరి పోస్టు, మదరాసు.



బ్రాంచి షాపులు :—

57, బిగ్ స్ట్రీట్, ట్రిప్లికేన్.

1/5 F, సౌత్ మాడా స్ట్రీట్, మైలాపూర్.

38, లాయిడ్స్ రోడ్డు, రాయపేట.

1/82 B, మింట్ స్ట్రీట్, 113, ఆదియప్పనాయక స్ట్రీట్.

# రీటా హెయిర్ టానిక్

## తల వెంట్రుకలను పెంచును

Grows

LOVELY HAIR



రీటా కుదుళ్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్‌టానిక్.

తలవెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేను కొరుకు, ఇంకను తలవెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేలకువేలు వాడి గుణమును పొందియున్నారు. మీరుకూడ నేటినుండియే రీటా వాడుడు. రీటా హిందూ దేశమంతటా దొరకును.

వెల సీసా 15 అణాలు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

లలితాపావర్ ఉత్తమమైన హెయిర్ టానిక్ కోరేవారికి రీటాకు మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మన మాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

శారదా జినార్కర్ : నేను రీటాను వాడగానే తలవెండ్రుకలు రాలిపోవడం మానిపోయింది. వాటికి మృదుత్వం, నిగారింపు కలిగించే పదార్థాలు రీటాకు కలవు. రీటా అత్యద్భుతమైన హెయిర్‌టానిక్.

కన్నాంబ రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగా నున్నది. అది నిజముగా అమోఘమైనది.

పుష్పవల్లి నాకు సుమారు ఏడాదిగా తలవెండ్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తల వెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్ఠమైన హెయిర్‌టానిక్ అని నా అభిప్రాయము.

వి లక్ష్మీకాంతం రీటా ఉపయోగించిన తరువాత నా తలవెండ్రుకలు రాలుట తగ్గింది, కొత్తవెండ్రుకలు ఒత్తుగ పెరుగుచున్నందులకు చాల సంతోషముగ నున్నది. రీటా అమోఘమైన హెయిర్‌టానిక్ అని నా దృఢమైన నమ్మకము.

లక్ష్మీబాయి : తలవెండ్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

# రాధా సిల్కు ఎంపోరియం

14 సన్నిధి స్ట్రీట్

మైలాపూరు, మద్రాసు.

రకమునకు,

నాణ్యతకు,

చౌకకు

పేరుపొందినది.

:: మా బ్రాంచి ::

రుక్మిణి

సిల్కు ఎంపోరియం

బిగ్ స్ట్రీట్,

కుంభకోణము.










**కేశ్‌రీన్ హేర్‌టానిక్ 0-12-0**

సొగసుగాను, ఒత్తుగాను, పుష్టిగాను, కేశములను పెంపు జేయును.

**కేశ్‌రీన్ షాంపూ పౌడరు 0-12-0**

కొంచెము నీటిలో కలుపుకుని తల స్నానమునకు యుపయోగించిన తలనుండు మురికి, జిడ్డు పోగొట్టును.

రెండూ చేరి పోస్టేజితో సహ రూ. 2-2-0 మాత్రమే

విక్టోరియా డిపో, నార్తు మాడవీధి,

మైలాపూరు, మద్రాసు 4.

దేశాభ్యుదయమునకు

స్వదేశీ వస్తువులను వాడుట అత్యావశ్యకము




Known
for a
QUARTER
CENTURY
as a
High Class
Writing Fluid



కృష్ణవేణి సిరాలు

స్టేషనరీ వర్తకులందరి వద్దను దొరకును.

Edited and published by G Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by M. Satyanarayana at the H. P. Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras

# ఆంధ్రమహిళ

ఐదు సంవత్సరములుగ

## ఆంధ్రమహిళాసభవారిచే

ప్రతినెలా ౧ వ తేదీని

ప్రకటింపబడుచున్నది.

## స్త్రీలయొక్క

విద్యావిజ్ఞానాభివృద్ధికై

## స్త్రీలచే

నడుపబడుచున్న తెలుగుపత్రిక

ఇందు

విజ్ఞానానికీ, వినోదానికీ,
కథలూ, నాటికలూ,
గద్యాలూ, పద్యాలూ,
వ్యాసాలూ, విమర్శనలూ,

గృహవిజ్ఞానము

పాకకళ

బాలానందము

ఇంకా ఎన్నో

స్త్రీలయొక్క ఆర్థిక, నైతిక, సామాజిక
సమస్యలకు సంబంధించినవి

సాలుచందా రూ 5 విడిపత్రిక అ 6

సంపాదకురాలు: శ్రీమతి దుర్గాబాయి, ఎమ్ ఏ, బి ఎల్
సహాయ సంపాదకురాలు: శ్రీమతి చన్నఘంటమ్మ,
ఎమ్ ఏ, ఎల్ టి.

ప్రకటనధరలకు
ప్రాసి తెలిసికోండి

మేనేజర్
'ఆంధ్రమహిళ'
ఆంధ్రమహిళాసభ
మదరాసు 4

## ఈ క్రింద పేర్కొన్న పత్రికలను కృతజ్ఞతతో అందుకొనుచున్నాము

●

మాసపత్రికలు — తెలుగు

ఆంధ్రజ్యోతి, ఢంకా, బాల, చందమామ, సమత, తెనుగు, తెలుగు సినీమా, ప్రవాసి, రూపవాణి, నటన, రామరాజ్యము, శ్రీధన్వంతరి, విశాలాంధ్ర, పాడిపంటలు, సౌభాగ్యం, హిందూసుందరి, గృహలక్ష్మి, ఆంధ్రశిల్పి, శ్రీ రామకృష్ణప్రభ, సూర్యప్రభ, ఉపాధ్యాయ, ప్రకృతి, ఉష, కిన్నర, జయశ్రీ, దివ్యజ్ఞానము, వరలక్ష్మి.

●

మాసపత్రికలు — ఆంగ్లము

Indian Home, Stentor, Triveni, Sowbhagya, Cine Technicians

●

మాసపత్రికలు — అరవము

కలైమహళ్, నాట్యం, జగన్మోహిని, కల్కి, అంబులిమామ

●

వారపత్రికలు — తెనుగు

స్వతంత్ర, ఆనందవాణి, చిత్రగుప్త, నవజీవన, నవోదయ, చేనేత, ఆంధ్రవారపత్రిక, గ్రామసేవ, ప్రజాపత్రిక, ధర్మచక్రం, త్రిలిఙ్గ, కర్షక, ములుకోల, కృష్ణాపత్రిక, అంకుశం, అజాద్ హింద్, వ్యవసాయకూలి, జనవాణి, జమీన్ రైతు, సర్వోదయ, రాయలసీమ, ఇంద్రావతి, విజయవాణి, సంఘం

●

దినపత్రికలు — ఆంధ్రపత్రిక

Indian Republic

●

ఈ పత్రికా సంపాదకులకు మా కృతజ్ఞత. మిగత పత్రికలను గూడ మాకు పంపినచో, కృతజ్ఞతతో స్వీకరింతుము మా ఆంధ్రమహిళను వారి ఫీజులకు ప్రతిమాసము పంపగలము

●

మైలాపూరు,
మదరాసు 4

మేనేజరు
ఆంధ్రమహిళ

# WHAT A START!




## WITH THE NEW GMI BATTERY

● *INSTANT* starting—brilliant lighting dependable long life and performance. That's what you get from the New G.M.I. Battery. General Motors take pride in offering you this new masterpiece of Indian craftsmanship. Next time you buy a battery, choose the GMI for absolute economy and dependability. Available from all General Motors Cars and Parts Dealers.

- MADE IN INDIA
- BY GENERAL MOTORS INDIA LIMITED
- FOR CARS, TRUCKS, BUSES
- WHENEVER A DEPENDABLE BATTERY IS NEEDED
- GUARANTEED DEPENDABILITY

**THE MOTOR & GENERAL TRADING CO.,**
MADRAS & VIJAYAWADA.

Wrapper printed at Ananda Press, Madras.